## ప్రపంచప్రఖ్యాతి గాంచిన కేరళ ఆయుర్వేద వైద్యశాల వారి ప్రత్యేక చికిత్సలు!! (ఆపరేషన్‌లు లేకుండా)

## H.I.V / A.I.D.S. H.I.V / A.I.D.S. వ్యాధిగ్రస్థులకు శుభవార్త!!

H.I.V / A.I.D.S లు నయముకాని వ్యాధులని అనుకుంటున్నారా? దక్షిణ కాలిఫోర్నియా యూనివర్సిటీ వారి పరిశోధన ప్రకారం 'మానవ శరీరంలోని A.P.O.B.EC-3G అనే ఎంజైము ఉంటుంది. H.I.V శరీరములోనికి ప్రవేశించిన వెంటనే దాన్ని అడ్డుకునే సామర్థ్యం కల్గిన ఎంజైము శరీరములోని ప్రతి కణములోను ఉంటుంది.' శరీరములోని ప్రతికణములో ఉన్న బలహీనపడిన A.P.O.B.EC-3G ఎంజైమును శక్తివంతం చేస్తే అది H.I.V ని నాశనం చేస్తుంది. మా మందులు వైరల్ లోడ్‌ని తగ్గించి CD-4 కౌంట్ పెరిగి సాధారణ స్థితికి వస్తుంది. H.I.V సోకిన వ్యక్తిని A.I.D.S నుండి కాపాడవచ్చు. H.I.V /A.I.D.S లు ప్రాణాంతకాలు కావు. డాక్టర్ సలహా మేరకు మందులు వాడి CD-4 కౌంట్ (Immunity)ని 800 నుండి 1500వరకు పెంచుకొని పూర్తి జీవితకాలం ఆరోగ్యముగా జీవించవచ్చును. ఎలాంటి ఆహార నియమాలు లేవు. ఆల్కాహాల్ సేవించరాదు

## కేన్సర్ - CANCER కేన్సర్ - CANCER - వ్యాధిగ్రస్థులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

* మెదడు * నోరు * థైరాయిడ్ గ్రంథి * స్తనములు * ఊపిరితిత్తులు * అన్నవాహిక * జీర్ణాశయము * పసరుతిత్తి * కాలేయము * పాన్‌క్రియాసిస్ * మూత్రపిండములు * ప్రొస్టేటు గ్రంథి * మూత్రకోశము * జీర్ణకోశము * ప్రేగులు * గర్భాశయ కంఠము (సెర్విక్స్) * గర్భాశయము * అండములు * పురుషాంగము * వృషణములు * న్యూరోబ్లాస్టోమా * కండరములు * ఎముకలు * చర్మము * లింఫ్ గ్రంథులు ఎంతో మంది క్యాన్సర్ వ్యాధిగ్రస్తులకు చికిత్స చేస్తున్నటువంటి కేరళ ఆయుర్వేద వైద్యశాల, రేడియేషన్ థెరపి, కీమోథెరపి, హార్మోన్ థెరపి, బయోలాజికల్ థెరపి. మరియు ఇతర వైద్యపద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగర్ (DIABETES MELLITUS) అతి మూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త!!

అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE - II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) 3 నెలలలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE -1 DIABETES. INSULIN DEPENDENT DIABETES MELLITUS. (IDDM) 6 నెలలలో రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషంట్లకు మానని పుళ్ళు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs.3000/-) TYPE - II COURSE 6 MONTHS. TYPE - 1 COURSE 12 MONTHS.

## సంతానం లేని (Infertility-Sterility) దంపతులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా).

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్నా (OLIGOSPERMIA) మగవారికి కణాలలో కదలిక (MOTILITY) లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoospenmia) వెరికోసీల్ (Varicoseviens) (Per month Rs.5000/-) Course : 3 months, [illegible] (Fallopian Tubes Block), [illegible] (Acid) [illegible] (PCOD) - [illegible] (Per Month Rs.5000/-) Course : 3 months.

## ఆల్కహాల్ - స్మోకింగ్ - గుట్కా - డ్రగ్స్ మానండి! త్రాగే వారికి తెలియకుండా మాన్పించండి!! Per Month Rs.2000/-) Course : 2 months.

**నూతన యవ్వనశక్తికి : నపుంసకత్వము - శీఘ్రస్ఖలనము - నరాల బలహీనత** (IMPOTENCY) అంగస్తంభన గట్టిగా లేకపోవుట - లైంగిక వాంఛ లేకపోవుట (LIBIDO) - రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట-వృషణములు శుష్కించిపోవుట (ATROPHY OF TESTIS) రతిలో పాల్గొనక ముందే వీర్యము బయటికి వచ్చుట - నిద్రలో వీర్యము పోవుట - శృంగారమంటే భయం - శృంగారములో తమ సామర్థ్యము మీద తమకే నమ్మకం లేకపోవుట - శృంగారపరమైన సమస్యలను నివారించి - మగువదగ్గర మృగరాజులా రెచ్చిపోయే శృంగార సామర్థ్యము - 60లో 20లా యవ్వనాన్ని తరగనీయదు - శరీరము వజ్రమంత దృఢముగా, శక్తివంతముగా - వృద్ధాప్యాన్ని రానీయని మహత్తర ఆయుర్వేద ఔషధము. (Per Month Rs.5000/-) Course : 3 months.

**సుఖవ్యాధులు:** గనేరియా - సిఫిలిస్ (per month Rs.2000/-) Course : 3 Months, హెర్పిస్ సింప్లెక్స్ (HERPES SIMPLEX) (Per month Rs.4000/-) Course : 3 months.

లివర్ వ్యాధులు - లివరు గట్టి పడుట (Cirrhosis) - లివర్‌లో పుండు (Abscess) - లివర్ వాపు, నొప్పి (Hepatitis) (Per month 5000/-) Course: 3 Months

మూర్ఛ (Fits) అపస్మారకము.(Epliepsy) - సోరియాసిస్ (Psoriasis) - బొల్లి (Leucoderma) - PROSTATE ENLARGE - THYROID - KIDNEY STONES (Per month Rs.4,000/-) Course : 3 month స్త్రీల శరీరంపై వచ్చు అవాంఛిత రోమములు (UN WANTED HAIR) తిరిగి మొలవకుండా చేయుటకు: (Per month Rs.4,000/-) Course : 1 month స్థూలకాయము (Obesity) - బరువును - లావును తగ్గించుటకు (No Diet, No Exercise)- సన్నగా బలహీనముగా నుండు వారు, బరువు - లావుపెరుగుటకు - (21సం॥లోపు వారు ఎత్తు పెరుగుటకు) - నత్తిని తగ్గించుటకు (Stammering) - జ్ఞాపకశక్తిని పెంచుటకు - నిద్రపట్టకపోవుట (Insomnia) - MAIGRANE - T.B - PSYCHOLOGICAL PROBLEMS, Per month Rs.3000/-) Course:3months.

## స్త్రీల స్తనముల సైజు పెంచుటకు - స్త్రీల పొత్తికడుపు మీద (SCRATCH MARKS) చారలు, గీతలు పోవుటకు (Per month Rs.1500/-) Course : 3 months.

కీళ్ళు కండరాల నొప్పులకు - ఎనీపెయిన్ - నడుమునొప్పి - వెన్ను నొప్పి మెడనొప్పి - PILES - FISSERS - GAS - TROUBLE - ACDT - ULCER (Per month 1200/-) Course: 3 Months) - తుంటినొప్పి (SCIATICA) - FITULA (Per month 3000/-) Course: 3 Months)

**బట్టతల!! Baldness! నెరిసిన జుట్టు!! Grey Hair!** చుండ్రు, జుట్టురాలుట, పేను కొరుకుడు, జుట్టును నల్లగా పొడుగ్గా, పొడవుగా పెంచి బట్టతల నెరిసిన జుట్టును నివారించును.

Kerala Herbal Hair Tonic (Oil) 100ml Rs.600/-, 250ml Rs.1300/-Herbal Hair Capsules 60 - Rs600/- (Per Month Rs.1200) Course : 6 Months.

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

[illegible] (Sinusitis) ఇసినోఫీలియా (Eosinophilia) [illegible] Asthama Sanjivini 400ml / TAB / CAP (Per month Rs 1000/-) Course: 9 months.

# కేరళ ఆయుర్వేద వైద్యశాల





ఫోన్:65526109, 9392355590, 9866155109

సప్తగిరి థియేటర్ ప్రక్కన, 2 nd బిల్డింగ్, 1 Floor R.T.C X Roads BUS STOP హైదరాబాద్-20.


అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు

Note : పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాలద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు ఏపీలో పోస్టల్ కొరియర్ చార్జీ రూ. 100/-, ఇతర రాష్ట్రాలవారు రూ.250/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా పంపువారు Kerala ayurveda vaidyasala పేరు మీద ఇక్కడ రాసినట్లుగా వ్రాసి పంపవలయును. మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 9 A.M. - 9 P.M. Sunday 9 A.M to 2 P.M

# ఆత్మీయనేస్తాలకు అందమైన కానుకలు

ENTERED

స్నేహితుల ఆనందమే మన ఆనందం
ఆప్తుల తలపులే మనకు ఆహ్లాదం
ఆత్మీయులకు అరుదైన బహుమానం
ఇవ్వాలనుకుంటున్నారా..?
ప్రతి నిత్యం వారి మదిలో
నిలవాలనుకుంటున్నారా..?

ఇందుకు మీరు చేయాల్సిందల్లా..
మిత్రుల పేరు మీద
రూ. 216/- చందా కట్టండి చాలు
ఇక నెలనెలా వారికి కొనసాగుతుంది



# విపుల చతుర



ఆత్మీయ పలకరింపు
నెలంతా సాహితీపరిమళాల
చిలకరింపు
ఏడాది పొడవునా వారి మదిలో
మీ తలపులే గుబాళిస్తాయి
అక్షరాక్షరాన మీ ఉత్తమాభిరుచి
రూపుకడుతుంది

అది పుట్టిన రోజయినా..
నూతన సంవత్సర సందర్భమైనా
సరే ఎంచుకోండి
ఒక్కసారి మమ్మల్ని
సంప్రదించండి చాలు..

---

డీడీ లేదా ఎంఒ పంపవలసిన చిరునామా:
వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.

వివరాలకు : ఈనాడు టోల్ ఫ్రీ నెం : 18004258888 లేదా
vipula.chatura@eenadu.netకు మెయిల్ కూడా చేయొచ్చు

ENTERED

సంపుటి -34, సంచిక - 5
401వ సంచిక, పేజీలు : 132
జూన్ 2011

# చతుర





'గల్ఫ్‌లోని మీ ఆయన
దగ్గరకి వెళ్లవా?'
అడిగింది నీలు స్నేహితురాలు.
'మూడేళ్లయింది నీలూ
మొగుడు ఇక్కడికొచ్చి'
అంది అత్తగారు.
వీరంతా తననెందుకు భర్తవద్దకు
పంపించట్లేదు- నీలూలో దుఃఖం.
'నీలూ పరధ్యానంగా ఉంటోంది.
వాడేమో అటే వెళ్లిపోయాడు'
అత్తగారి సానుభూతి.
'సరే, ఈ ఏడాది పండగకన్నా
వస్తాడా?' ఒకామె ప్రశ్న.
'అక్కడి మహారాణీ
వాడ్ని పంపాద్దూ'
మరొకామె వెటకారం!
ఏమిటీ నీలూ సంసార గాథ?
పురుషాధిక్య సమాజంలో
లక్షలాది మంది నీలూల గురించి
ఆలోచనలు రేకెత్తించే
**చంద్రలత** ప్రయోగాత్మక నవల
**వాళ్లు.. వీళ్లు.. పారిజాతాలు!**
పేజీ ...6
బొమ్మలు: భాస్కర్



# 2011లో ఇంప్రింట్‌వారి భారతదేశంలోని తీర్థయాత్రలు పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర

గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక,
ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర , రూ. 4000/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,11/2,11/3,8/4,13/5,10/6,
8/7,12/8,9/9,7/10,11/11,9/12

## తమిళనాడు దర్శన్

వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్,
తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేంద్రం.
7 రోజుల యాత్ర , రూ.11500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1, 18/2, 18/3, 15/4, 20/5, 17/6,
19/8,16/9,14/10,18/11,16/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు

షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 12500/-
యాత్ర తేదీలు : 21/1, 24/2, 25/3, 22/4, 27/5,
24/6, 22/7, 26/8, 23/9, 21/10, 26/11, 22/12

## హిమాలయ దర్శన్

బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరినాగ్, జాగేశ్వర్, రాణీకేత్,
నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 11/1, 18/2, 18/3, 15/4, 20/4,17/5,15/6,
19/7, 16/8,23/9,21/10,26/11,16/12

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్

పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 11000/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు, యాత్ర తేదీలు :
11/1,25/1,22/2,8/3,22/3,5/4,19/4,10/5,24/5,7/6,21/6,5/7,
19/7,9/8,23/8,6/9,20/9,4/10,18/10,8/11,22/11,6/12,20/12

## కేరళ యాత్ర

కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు
గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేంద్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర , రైలు, బస్సు ఖర్చు రూ. 18000/-
యాత్ర తేదీలు : 28/1, 25/2, 25/3, 21/4, 26/5,28/6,28/7,
28/8, 28/9,19/10,23/11,22/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర

ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతి
ర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 22/1,12/2,26/2,12/3,26/3,9/4,23/4,14/5,28/5,11/6,25/6,9/7,
23/7,13/8,27/8,10/9,24/9,8/10,22/10,12/11,26/11,18/12,24/12

## సంపూర్ణ నేపాల్ యాత్ర

లుంబిని, పోక్రా, ముక్తినాథ్, మనోకామ్న, పశుపతినాథ్,
దక్షిణకాశీ, జనక్‌పురి, చిన్నమస్త, కోసిదామ్, ఖాట్మండ్,
రూ. 42,000/- ఒక్కరికి
(ప్రయాణ భోజన వసతులతో సహా)

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్

పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం,
గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది,
ఉమానందా దేవాలయం, పీకాక్ ఐలాండ్ , కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర, రూ. 18000/- , రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,25/2,25/3,22/4,27/5,24/6,
22/7,26/8,23/9,21/10,25/11,23/12

## కాశీ, గయ, ప్రయాగ

కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి
జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం
కల్పించబడును. 6 రోజుల యాత్ర, రూ. 5,500/- (భోజనములు కాక)
రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీరోజు

## చార్‌ధామ్ యాత్ర

హరిద్వార్, హృషీకేశ్, యమునోత్రి, గంగోత్రి, కేదార్‌నాథ్, బదరీనాథ్.
13 రోజుల యాత్ర, రూ. 20000/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 3/5,20/5,27/5,3/6,17/6,24/6,1/7,22/7,
29/7,5/8,19/8,26/8,2/9,16/9,30/9

## ద్వాదశ జ్యోతిర్లింగ యాత్ర

శ్రీరామేశ్వరం, శ్రీశైలం, భీమాశంకర్, శ్రీ త్రయంబకేశ్వర్, ఘృష్ణేశ్వర్,
పర్లీవైద్యనాథ్, శ్రీనాగేశ్వర్, శ్రీసోమనాథ్, ఉజ్జయిని, శ్రీ ఓంకారేశ్వర్,
శ్రీ కేదార్‌నాథ్, వారణాసి. 23 రోజుల యాత్ర, రైలు, బస్సు ప్రయాణం.
రూ. 32000/- యాత్ర తేదీలు : 27/1,24/2,24/3,26/4,
23/5,21/6,25/7,22/8,20/924/10,24/11,22/12

వివరాలకు :




**దంటు నాగార్జున శర్మ, ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్**

ప్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్,
హైదరాబాద్ - 20, ఫోన్ : 040 – 2754 7708/2754 7709, సెల్ : 98850 89092

# వాళ్ళు.. వీళ్ళు.. పారిజాతాలు

## - చంద్రలత

విరిసీ విరియని ఉదయం.. తూరుపుతీరం.. ఎదిగీ ఎదగని పట్నంలో ఓ చిరుపారిజాతం! పేరు నీలూ!! నవ్వుల పువ్వులు రువ్వుకుంటూ, మాటల మాలలు తురుముకుంటూ, స్నేహితురాళ్లతో పోటీపడుతూ వేకువవేళలో పారిజాతపూల కోసం అన్వేషిస్తోంది.. 'లాహిరి లాహిరి లాహిరిలో ఓహో జగమే ఊగెనుగా.. తూగెనుగా' అన్నట్లు సాగుతున్న చిన్నారి నీలూ జీవితం అకస్మాత్తుగా ఎలాంటి పరిణామాలకు లోనైంది ..??

వెలిగీ వెలగని ఉదయం.. పశ్చిమతీరం.. ఆరావళీ పర్వతపాదాల చెంత ఓ అందమైన పల్లెటూరు. ఇక్కడా విరిసిందో పసి పారిజాతం, ఈమె పేరూ నీలూనే!! స్నిగ్ధమనోహరంగా, ముగ్ధమందారంలా విచ్చుకుంటున్న ఈ పసికుసుమం ఆ కుటుంబానికే వన్నెతరగని పరిమళం. ఈ నీలూ జీవితం తుదకు ఎలాంటి అనుభవ గీతమైంది?

ఆసాంతం కవితాత్మకంగా సాగిన చంద్రలత **వాళ్ళు.. వీళ్ళు.. పారిజాతాలు** జూన్ చతుర కానుక!!

## వాళ్ళు-

విరిసీ విరియని ఉదయం.

తూరుపు తీరం. ఎదిగీ ఎదగని పట్టణం.

ఎనభయ్యో దశకం ముడుచుకొనే వేళ.

తొంభైల్లోకి విచ్చుకొనే తరుణం.

తెలతెల్లవారే లోగానే, నీలు అక్కడికి చేరుకొంది.

గబగబ వెళ్ళి గోడవారగా నిలబడింది. నిదానంగా చుట్టూ చూసింది.

ఇంకా ఎక్కడా ఎవరూ బయలుదేరిన అలికిడి లేదు. వీధంతా ఖాళీ.

ప్రయివేటుకెళ్ళాల్సిన పిల్లలు ఒక్కో గుమ్మం దాటుతున్న చప్పుడు.. ఆగాగి.

అప్పుడప్పుడే.

ఖాళీ సిగరెట్ ప్యాకెట్లను రింగులు రింగులుగా కత్తిరించి, వాటిలోకి చుట్టచుట్టిన పత్రికలని దూర్చేసి, ఒక్కో గుమ్మంలోకి అలవాటుగా అలవోకగా గిరాటేసి.. ఆగీ ఆగకుండానే తేలిపోతున్నాడు.. ఒక పేపర్ పిల్లవాడు.

ముసిముసి చీకట్లు తెల్లబారుతున్నాయి. అక్కడక్కడా సనసన్నని వెలుగుచారికలు.

బర్రుబర్రున లాగే చీపుర్లు, జల్లుజల్లున పడే కళ్ళాపులు, వంకరటింకరల ముగ్గులు- ఇక ఆ హడావుడి ఆరంభం అయ్యేవేళ దగ్గర పడసాగింది. కుళాయిలు ఆ వీధిలో లేవు కనక సరిపోయింది కానీ, లేకుంటే ఈపాటికి బిందెలజోరు తగువుల హోరు ముంచెత్తేదే.

రోజూ తెల్లారకమునుపే లెక్కల ట్యూషన్‌కు బయలుదేరుతుంది నీలు. చిన్న బజారులోంచి కాంచన, మండపాల వీధిలోంచి వినత ఈపాటికి బయలుదేరే ఉంటారు.

"హమ్మయ్య" నీలు కులాసాగా నిట్టూర్చింది. "ఈ పూట పూలన్నీ తనవే" ఎదురుగా ఉన్న గోడవైపు చూపు సారించింది.

జెండా వీధి మలుపులో ఉన్న ఆ ఇంటి గోడకు ఒక ప్రత్యేకత ఉంది.

ఎత్తైన ఆ ఇటుకల గోడ మీదుగా ఆర్చీలను కనబడనీయకుండా గేటుమీద దాకా విస్తరించిన పారిజాతం చెట్టొకటి ఉన్నది.

ఆ గేటు తలుపులు ఎప్పుడూ ఇనపగొలుసుతో కట్టేసి ఉంటాయి. దానికితోడు తుప్పుపట్టిన పెద్ద తాళం. మనుషులున్న అలికిడి ఉండదు కానీ ఉన్నారన్న నిదర్శనంగా అప్పుడప్పుడు ఆ గేటుకున్న చిన్న వాకిలి మూసి తెరుచుకుంటూ ఉంటుంది.

బయటకే ఇంత చెట్టుందంటే లోపలివైపున ఎంత ఎదిగి ఉందో.. ఆ ఇంటివారు అదృష్టవంతులు.

నీలు ఊపిరి గట్టిగా పీల్చి వదిలింది.

ఆ గోడలోపలి వారెవరో కారు. నీలు అమ్మ తరుపు బంధువులు. పెళ్ళిళ్ళకీ పబ్బాలకీ అమ్మ లోపలికి వెళ్ళివస్తూనే ఉంటుంది. ఎప్పుడైనా తాము కూడా..

కానీ, పూసిన పూలన్నీ తనకే ఇమ్మని అడిగేంత చనువు మాత్రం లేదు. లేకుంటే నీలునే ఆ చొరవ తీసుకోలేదేమో. ఆ ఇంటిలో నీలు ఈడువారు ఎవరైనా ఉన్నా స్నేహం కలిసేదేమో. తన అమ్మకు అవ్వకు తప్ప తనతో నేస్తం కట్టేవారు అక్కడ లేరుమరి. ఏమైనా ఆ వైపు పెద్దగా ఆలోచన ఏమీ చేయలేదు. రాలిన పూలన్నీ కళ్ళెదురుగా కనబడుతుంటే ఆ యజమానిని అడగాలని కూడా తట్టలేదు. ప్రతిపూట ఇంతేకదా మరి.

తొలికిరణాల తాకిడికి తట్టుకోలేవేమో అన్నట్లు ఆ చెట్టు చుట్టూ అలవోకగా రాలిపోయే పారిజాతాల కోసం పిల్లలంతా పోటీలు పడతారు. ఇవ్వాళ నీలు వంతు.

తన పొడుగు లంగా కుచ్చిళ్ళను పైకెత్తి నేలమీద గొంతు కూర్చుంది. అడుగేస్తే పూలు అణిగిపోతాయేమోనని, మునివేళ్ళ మీదే ముందుకు జరుగుతూ నేలకంటా

వంగి, ఒక్కో పూవునూ భద్రంగా ఏరుకొని. గుప్పిట్లో దాస్తోంది. నిండిన గుప్పిట నుండి తెరిచి పెట్టిన కంపాసు బాక్సులోకి వంపుతోంది.

తెల్లటి పూవు, నారింజ కాడ.

రాత్రంతా పరిమళాలు వెదజల్లి.. వెదజల్లి అలసిపోయాయేమో, అయినా నిగారింపు తగ్గలేదు. నిగడదీసుకొని నిమ్మళంగా చూస్తున్నాయి.

గోడ మీదా.. నేల మీదా.. రోడ్డు చివర వంకరటింకర తారు మీదా.. అక్కడక్కడా తలెత్తిన కంకర మీదా..

వెల్లకిలా నింగిని చూస్తూ.. పకపక నవ్వుతూ పలకరిస్తూ..

పారిజాతాలు.

నీలు గుండెల నిండా ఊపిరి పీల్చి వదిలింది.

ఏ పూటకాపూట ఆ పారిజాతాలు ఆమెని ఎంతగా ఊరిస్తున్నాయో.

నిన్నటికి నిన్న కాంచన ముందొచ్చింది. వినత కనక ముందొచ్చి ఉంటే ఇక అంతే సంగతులు. మాటవరసకన్నా ఒక్క పూవునూ మిగలనీయదు.

లెక్కల మాష్టారు మురళీ కృష్ణుడి భక్తుడు. ఎవరిచ్చినా పారిజాతాలను పదిలంగా అందుకొంటారు. వాటికోసమే అన్నట్లు వారి శ్రీమతి తళతళా తోమిన ఇత్తడి పళ్లాన్ని వాకిట్లోనే బోర్లించి పెడుతుంది. తమ లెక్కల పాఠాలు అయ్యేంతవరకూ, ఆ పూలన్నీ ఓపికగా సూదితో గుచ్చి మాలలుగా పేరుస్తుంది. ఎవరు ముందు తీసుకెళ్ళి ఆ పూలను ఆ పళ్ళెంలో నింపాలా అని పిల్లలు సహజంగానే పోటీలు పడేవారు. ఆఖరున చక్కెర అద్దిన ఒక కొబ్బరి ముక్కన్నా దక్కుతుందనీ.. మొరాయించిన ఒక చిక్కులెక్కన్నా వీడుతుందనీ ఎవరికివారికి ఏ మూలో ఆశ.

నీలు తలెత్తి పూల చెట్టువైపు చూసింది. రాలుతూ రాలుతూ ఆగిపోయిన పూవొకటి ఆమె కంట పడనే పడింది. సన్నటి నవ్వొకటి నీలు ముఖాన కదలాడింది వెచ్చని వెలుగురేఖలా. మునివేళ్ళపై అలవోకగా నిలబడి.. ఆ పువ్వును అరచేతిలోకి సుతారంగా అందుకోబోయింది. అంతే.. వళ్ళోని కంపాసు బాక్సు భళ్ళున కిందకు జారిపడింది. పూలన్నీ నేల పాలయ్యాయి!

తన తెలివితక్కువకి తన తలమీద తానే ఒక మొట్టికాయ వేసుకొంది. మూతి బిగించి, గబగబ వంగి, పూలన్నీ సేకరించి కంపాసు బాక్సులోకి నింపసాగింది.

'ఎంత చిత్రం! దేవుని పూజలకు నేలరాలిన ఈ పూలు...! మాష్టారి సతీమణి ముఖం కళ్ళముందు మెదిలింది. ఎంత పవిత్రంగా ఆవిడ వీటిని చూసుకొంటారో. కాస్త ఎండపొడ తగిలినా.. బాటసారుల కాళ్ళ కింద నలిగినా.. కార్లు సైకిళ్ళ రిక్షాల చక్రాల కింద పడినా.. ఇక.. చాలు చాలు.. పదిలం పదిలం పూలన్నీ పదిలం..! "నీలు ఆలోచిస్తూ చకచక చేజారిన పూలను చేజిక్కించుకో సాగింది.

"ఇవిగో.. ఇవీ తీసుకో..!"

మెడమీద వేడి ఊపిరి తగిలేంత దగ్గరలో ఒక గంభీర స్వరం.

నీలు ఉలిక్కిపడింది. ఊపిరి ఆగినంత పనయ్యింది.

ఒక్క ఉదుటున అక్కడి నుండి పరిగెత్తి పోదామని అనుకుందో లేదో నీలు ఆలోచనలను తెలిసినట్టుగానే, ఆ కంఠపు బలిష్ఠమైన పిడికిలి నేలకంటా సాగి, నీలు కాలి మడమను ఒక్క ఒడుపున బిగించి పట్టుకుంది, అటూ ఇటూ కదలనీయకుండా. నీలు పాదాలపైని జిలేబి గొలుసుల వెండి పట్టాలు వత్తుకుపోయేట్టు పట్టు బిగిసింది. నీలు కళ్ళు బైర్లుకమ్మినంత పనయ్యింది. నోటమాట పెగిలితే ఒట్టు. గుండె గొంతులో కొట్టుకుంది. కంఠపు భయంతో

బిత్తరపోయింది. ఏడుపు ఎగతన్ను కొస్తోంది.

ఆ బలిష్ఠమైన చేయి ఎప్పుడు వేగంగా కదిలిందో, ఎప్పుడు నీలు మోకాలు పైన నొక్కి వదిలిందో ఆమెకే తెలియదు. ఒక్క సారిగా గగుర్పాటుతో కింద కూలబడిపోయింది, లంగా కుచ్చిళ్లను పాదాల మీదికి కప్పుకుంటూ.

భళ్ళున గాజు పగిలినట్లు కొంటె నవ్వుతో.. ఆ వ్యక్తి కదిలిపోవడం లీలగా గుర్తుంది. ఆ నల్లగేటులోని చిన్న తలుపులో వంగి వెళుతూ మరొకమారు నవ్వి వెళ్ళాడతను.

ఎప్పుడూ ఆ ఇంటి వాకిలి తెరుచుకుందో ఎప్పుడు ఆ ఇంటి వ్యక్తి బయటకు వచ్చాడో నీలుకు గమనమే లేదు.

చడీచప్పుడు కాకుండా ఎంతసేపటి నుంచి తనను గమనిస్తున్నాడో ఊహాకందనే లేదు. ఇక ఎప్పుడు తిరిగి వెళ్ళాడో తెలియనే లేదు.

ఒక జలదరింపు నీలు వెన్నంతా పాకింది.

తేరుకుని చుట్టూ చూసేసరికి కాంచన, వినతలు సందు మలుపు తిరిగారు. అంతే, ఒక్క ఉదుటున లేచి పరిగెత్తింది.. పరిగెత్తినట్లే వెళ్లింది.

కంపాసు బాక్సులోని పారిజాతాలు మాష్టారింటి మాలలుగా మారలేదావేళ. అలాగే, చిందరవందరగా నేలనబడి మట్టి కొట్టుకొని, మాడి వాడి వడలిపోయాయి.

తట్టుకొని పడ్డ కంపాసు బాక్సులోని మూలమట్టాలు, వృత్తలేఖిని, కొలబద్దలు ఎక్కడ విరిగిపడ్డాయో నీలు పట్టించుకొనే ధ్యాసలో లేదు.

ఊపిరి బిగబెట్టుకొని అందినవి అందినట్లు అందింపుచ్చుకొని పరుగో పరుగు.

బడినుండి నీలు తిరిగి వచ్చే లోగానే జరగవలసినవన్నీ జరిగిపోయాయి. వరసైన ఆ కోరమీసపు బంధువు ఆ క్షణాన్ని వృథా చేయదలుచుకోలేదు. నీలుని వధువును చేసేశాడు.

అంతలోనే ఆ ఇంటి ఆడవారు నీలు ఇంటికి రాయబారాలు మోసేశారు. ఆ సాయంకాలానికి ఆమె బడికి శాశ్వతంగా సెలవు ప్రకటించేశారు రెండు కుటుంబాల వారు.

పచ్చిపాల సోయగం.. సోగకళ్ళ పసితనం.. బెరుకు భయం అన్నీ కలగలసిన ఆ నవవధువు నెల తిరిగేనాటికి ఆ ఇంటికి ఇల్లాలై ఆ వాకిట నడిచినప్పుడు కూడా.. తలెత్తి పారిజాతం వంక చూడలేదు. మేలిముసుగు కొంత.. తలెత్తనీయని ఆడవాళ్ళు మరికొంత.

నేలకంటా తల వాల్చుకొని, తనకన్నా తట్టెడు బరువున్న బట్టల్ని మోస్తూ, వంటి నిండా బంగారు నగలని అలంకరించుకొని, చేతులనిండా గాజులు తొడుక్కొని, వధూ భారాన్ని తీయగా మోస్తూ.. ఆ ఇంట్లో అడుగు పెట్టింది.

పూలకాలం సాగిపోయింది. అతను ప్రయాణమయ్యాడు.

అలంకరణలు, సిల్కు చీరలు, రాళ్ళ గాజులు, గోరింటాకు, అత్తరు స్నానాలు, అగరు ధూపాలు, విందుభోజనాలు, వినోదాలు, చుట్టాల పలకరింపులు, పరాచి

---

## కొత్తగాలి...



**అవినీతిపై**
**అణ్వస్త్రం**
**జనలోక్‌పాల్**
**'అన్నా'స్త్రం**

*– అంబటి వెంకటశివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప*

# సారీ! ఇవ్వాళ కుదరదు!

'శ్రీశాంతిసామ్రాట్టు అశోక చరిత్రము' కావ్యాన్ని రాసిన రాయలసీమ కవి కవిత్వవేది కల్లూరి వేంకటనారాయణరావు 1947-48లో బళ్ళారిలో జిల్లా విద్యాధికారి. అప్పుడు వై. మహాబలేశ్వరప్ప జిల్లా బోర్డు అధ్యక్షులు. ఆయన సుసంపన్న కుటుంబం నుంచి వచ్చిన విద్యావంతులు. పెద్దల పట్ల గౌరవభావం కలవారు. సభాసమావేశాల్లో జిల్లా అధికార్లతో మర్యాదగా మాట్లాడినా పనుల విషయంలో కచ్చితంగా వ్యవహరించేవారు. దాంతో అధికారులు ఆయనంటే భయపడేవాళ్ళు. తాము చేస్తున్న పనుల్ని ఆయనకు క్షుణ్ణంగా వివరించేవారు.



ఒకరోజు మహాబలేశ్వరప్ప కారులో స్కూలు తనిఖీ కోసం ప్రయాణమయ్యారు. ఆ కారు జిల్లా విద్యాధికారి ఇంటి ముందరకు రాగానే ఆయనకు ఏదో జ్ఞాపకం వచ్చి ఆపమన్నాడు. నౌకరుతో తను కల్లూరివారితో మాట్లాడదలచినట్లు కబురు పంపాడు. నిజానికి అధికారులు ఆయన కారు శబ్దానికే బయటకు పరుగెత్తుకుని వచ్చేవారు. కల్లూరి వారు బయటకు రాకపోగా, ముందే నిర్ణయించుకున్న పనులవల్ల అప్పుడాయనను కలవడం కుదరదని, మరుసటి రోజు ఉదయం ఆఫీసులో కలుసుకోవచ్చని చెప్పి పంపారు.

మహాబలేశ్వరప్ప రాజకీయనాయకుడు. జిల్లాబోర్డు అధ్యక్షుడిగా కలెక్టర్ తర్వాతి స్థానం అయనది. జిల్లా అధికారులను తనవద్దకే పిలిపించుకుని మాట్లాడటం ప్రోటోకాల్ మర్యాద. అయిననూ కల్లూరివారిపై గల గౌరవంతో ప్రోటోకాల్‌ను పక్కనపెట్టి ఆయనే స్వయంగా వెళ్ళి కల్లూరివారిని కలిశాడు.

# తెంపరి శిష్యుడికి చెప్పుదెబ్బ!

చిలుకూరు నారాయణరావు కళాశాలలో ఆంగ్ల భాషాధ్యాపకులు. ఆంగ్ల వ్యాసాలను తెనిగించు పాఠ్యాంశం ఉండేది. ఆయన ఇచ్చిన వ్యాసాన్ని తరగతిలోనే విద్యార్థులు తెనిగించి, మార్కులు వేయించుకొనేవారు. ఆ తరగతిలో వారి సంఖ్య నూటాపది. అంతమంది వ్యాసాలను ఆసాంతం అప్పటికప్పుడే చదివి మార్కులు వేయడం ఆయనకు కష్టమని విద్యార్థులు భావించేవారు. ఎందుకంటే ఒక్కో విద్యార్థి రాసిన నాలుగైదు పేజీల వ్యాసాలను చూడాల్సివచ్చేది. ఒకరోజు జరిగిన సంఘటన గమ్మత్తుగా ఉంది. చేకూరి కృష్ణయ్య చేసిన అనువాదానికి పదికి ఎనిమిది మార్కులు వేశారాయన. ఆ పక్కనే కూర్చున్న మరో విద్యార్థికి మూడే మార్కులు వేశారు. దాంతో ఆ విద్యార్థి అగ్గిమీద గుగ్గిలమయ్యాడు. 'మనిషికి కళ్ళుండీ పూర్తిగా చదవకపోతే ఎలా? మార్కులు వేసేందుకు మొత్తం చదవక, కేవలం చూస్తే చాలనుకుంటే ఎలా?' అని నోటికొచ్చినట్లు వాగాడు.



ఆ వాగుడు విన్న చిలుకూరివారు ఆ విద్యార్థి పుస్తకాన్ని, చెన్న కృష్ణయ్య రాసినదాన్ని తెప్పించుకున్నారు. మొదటి బెంచి విద్యార్థి చేతికిచ్చి ఆ రెండింటినీ పోల్చి చదివి అందరికీ వినిపించమన్నారు. ఆ విద్యార్థి చదివి వినిపిస్తుంటే రావుగారు ఎంత చక్కగా మార్కులు వేశారో, ఆ రెండో విద్యార్థి చేసిన తప్పులేమిటో అర్థమయ్యాయి. దాంతో విద్యార్థులందరూ రావుగారి అసాధారణ మేధాశక్తికి ఆశ్చర్యపోయారు.

కాలు. నోటిలోని తియ్యందనం.. మనసు లోని ఇంకెంత వ్యవధైనా లేదు నీలుకి. అతని తాకిడికి తట్టుకొని తేరుకొనేంత వెసులుబాటు కూడా లేదు. నిద్రలు మెళు కువకూ మధ్య గడిచిన ఆ కల కమ్మటిదో వగరుదో తలిచేంత కూడా తెలియరాలేదు.

రాత్రింబవళ్ళు అమ్మో, అత్తో, ఆడబిడ్డో, తోడికోడలో.. తెరిపి దొరికిన మరుక్షణం.. అత్తరుస్నానం చేయించి సాంబ్రాణి పొగ లేసి, అలంకరణలు చేసి.. మళ్ళీ పడకగది లోకి పంపి.. తెరలు దించేవారు. అది రాత్రో పగలో తెలియనంతగా మగతలో నీలు మునిగి ఉంది.

ఎప్పుడైనా ఏదైనా మాట్లాడబోతే, కొత్త పెళ్ళికొడుకంటే అంతే లెమ్మనేవారు మెటి కలు విరుస్తూ. ఏమి తినిందో, ఎలా నిద్రించిందో నీలుకి అర్థమయ్యే లోపలే అతను వెళ్ళిపోయాడు.

నోరారా పలకరించనైనా పలకరించకుం డానే.

వీడ్కోలు పలకాలన్నా ఆమెకు మాటలు రాలేదు. భయంలోంచి బెరుకులోంచి బిత్త రచూపులు చూసి ఊరుకోవడం తప్ప.

అతనిని సాగనంపి రేయింబవళ్ళు కును కుదీసింది. మెలుకువ వచ్చేనాటికి, నీలూ ఒక పూలచెట్టయ్యింది. ఒక పసిమెగ్గను కడుపున తొడిగింది.

నీలు తండ్రిలేని పిల్ల. నాన్న ఆమె చిన్న తనాన్నే కాలం చేశాడు. తల్లి ముగ్గురు పిల్లలనూ గుంభనంగా పెంచుకొచ్చింది. అటూ ఇటూ అవ్వలు, తాతలు, మేనమా మలు, పెదనాన్న చిన్నాయినలు.

ఉమ్మడి కుటుంబంలో నలుగురితో ఒక రిగా పెరిగింది. తాతకున్న బీడీ ఫ్యాక్టరీలో తండ్రికెంత భాగమో కానీ, భర్తంటూ లేక పోయాక ఆ ఇంట్లో వంటమనిషికి ఎక్కు వగా పనిమనిషికి తక్కువగా ఉండేది ఆమె తల్లి.

నిజానికి జెండా వీధి వీధంతా అటు ఇటు తిరగేస్తే అంతా బంధువులే. ఒకరిం టితో ఒకరు పెనవేసుకొనిపోయి పెళ్ళిళ్ళు చేసుకొని, ఆ ఊరిలో మరొక లోకంలా బతుకుతున్నారు. బీడీ ఫ్యాక్టరీలవాళ్లు కొందరైతే, అందులో బీడీ కార్మికులే ఎక్కువ. బంగారం వ్యాపారులు కొందరైతే బంగారం పనివాళ్లు ఎక్కువ. మరికొందరు ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రికల్ పనులు చేసుకొం టారు. మద్రాసు నుంచో, మరొక చోట నుంచో విలాస వస్తువులు తెచ్చి విదేశీవని అమ్మే వ్యాపారులూ అక్కడ ఎక్కువే.

చదువుకన్నా సంపాదనపైనే మక్కువ. ఇంటికొకరు అటు బయటిదేశాలకో ఇటు బొంబాయికో వెళ్లి ఉన్నారు.

నీలు భర్తా అంతే.

నీలుకి నిజానికి అతని చదువు సంధ్యలు, ఉద్యోగ సద్యోగాల వివరాలు ఏమీ తెలియవు. వయసెంతో వరసేమిటో కూడా తెలియదు. తెలుసుకోవాలనీ తెలి యదు.

అతని ఆదాయ వ్యయాలు, ఆస్తిపా స్తులు, ఇళ్లూ వాకిళ్లు అన్నీ అమరినట్లు బావున్నాయని పుట్టింటివారంతా అన్నారు. నీలును కోరి చేసుకొంటున్నాడని అంతక న్నా అదృష్టం మరొకటి లేదనీ అంతా మెటికలు విరిచారు. తమ్ముళ్లనిద్దరినీ చదు వులయ్యాక గల్ఫుకు తీసుకెళతాననీ చెప్పా డట. వాళ్ళింకా ఆరో తరగతి పూర్తి చేయ లేదన్నది వేరే విషయం.

ఏదిఏమైనా నీలుది అన్నివిధాలా నలు గురి కన్నూ కుట్టేంత మంచి సంబంధం అని తల్లి మెటికలు విరిచింది.

అతను ఆమెకన్నా పుష్కరకాలం ముందు పుట్టి ఉంటే ఏమి? పలుచోట్ల తిరిగి, పలురకాల కథనాలు వినబడు తుంటే ఏమి? అవన్నీ ఇవన్నీ నీలుకు సంబంధం లేకుండా నీలు ప్రమేయం

లేకుండా జరిగిపోయాయి.

నీలుకు జ్ఞాపకమంతా అతని హూంకరింపు. అమ్మ, నీలు అత్త చెవినిల్లు కట్టుకొని చెప్పినట్లుగా అతను అందగాడే కావచ్చు, తను అదృష్టవంతురాలే కావచ్చు.

కాలి మడమ మీదనుంచి మోకాలి పైకి పాకిన ఆ బలిష్ఠమైన చేయి మిగిల్చిన గగుర్పాటు మాత్రం నీలుని నిద్రలోనూ వదలలేదు. ఒక్కోమారు ఉలిక్కిపడి నడిమంచంలో లేచి కూర్చునేది వణుకుతూ. వెన్నులో జలదరింపు.. వళ్లంతా చెమట్లు. ఏమీ మాట్లాడకుండా మిడిగుడ్లప్పగించి చూస్తుండేది.

పక్కనే తోడుగా పడుకొన్న నీలు అత్త చిత్రంగా నవ్వేది.

"మొదట్లో అంతే" నీలు అత్త కొంటెగా అనేది, "ఓపికపట్టు వెళ్లినవాడు వస్తాడ్లే!"

ముసలమ్మ ముసిముసి నవ్వులు నవ్వింది చాలక, ఆడవాళ్లందరినీ పోగేసి, నీలు ఉలికిపాట్లను, కునికిపాట్లను, కలవరింతలనూ జోడించి హరికథలు వినిపించేది. విన్నవాళ్లు పూరుకోక అతని ప్రతాపాన్ని వీరగానం చేసి, నీలు అదృష్టానికి మెటికలు విరిచి పోయేవారు. నీలు సిగ్గుతో, బిడియంతో మరింత ముడుచుకుపోయేది.

వంటికి నలుగులు పెట్టేటప్పుడు, తలంటిస్నానాలు చేయించేటప్పుడు, ఆడవాళ్లు, ఆమె వంటిమీది పంటిగాట్లకోసం వెతికి చూసి, లెక్క తప్పకుండా బాదంపొడి మీగడలతో మర్దన చేసేవారు.

అనగా అనగా రాగమతిశయిల్లుచుండునని ఎందుకన్నారో కానీ, చుట్టూ చేరిన ఆడవాళ్లు కీర్తిస్తున్న వీరప్రతాపాల ప్రభావమేమో, పెనిమిటి పంటిగాట్లు గోటిముద్రలు, అవి మిగిల్చిన తడి జ్ఞాపకాలను తడిమి చూసుకోవడమే నీలు నిత్యకృత్యమైపోయింది.

బడిలేదు. కాంచన, వినత కాలేజీలో చేరారు. వినత మెడిసిన్ చదవడానికి తిరుపతి వెళ్లాలని, కాంచన డిగ్రీ కాలేజీలో చేరాలనీ అందుకు అవసరమైన పరీక్షలు రాస్తూ కుస్తీ పడుతున్నారు క్షణం తీరిక లేకుండా. నీలుకి ఉన్న లోకమంతా ఆ ఇంటిలోనే. ఎవరో వృత్తలేఖినితో శ్రద్ధగా గీసినట్లు ప్రపంచం చిన్న వృత్తంలోకి ఇమిడిపోయింది.

చేయవలసిన పని లేదు. చేయ దలచిన పనీ లేదు.

పుట్టబోయే బిడ్డతో సహా, నీలుని కాలు కందనివ్వకుండా భద్రం చేస్తున్నారు. అంతకు మించి మరొక విశేషం లేదు.

అతని నుంచి ఒక మాటా మంతీ లేదు ఒక తపాలా తంతీ లేదు. ఆ నోటా ఈ నోటా వినే కబుర్లే తప్ప. ఎప్పుడైనా ట్రంకాల్ చేసినా, అతను చెప్పింది ఊ కొట్టడం తప్ప, మరొక సంభాషణా లేదు.

అప్పుడప్పుడు నమ్మశక్యం కానట్లు, నిలువుటద్దం ముందు నిలబడి, తన చిన్న బొజ్జపైని నిగారింపును చూస్తూ ఉండిపోయేది సంభ్రమాశ్చర్యాలతో.

ఉక్కుపిక్కలు, బలమైన చేతులు, పెదాల వత్తిడి తప్ప అతనిని గూర్చిన స్పష్టమైన జ్ఞాపకాలేమీ నీలుకి లేవు. ఆ అస్పష్టమైన ఊహనే తన ఊపిరిగా చేసు

## కొత్తగాలి...

**అవినీతికి రాజకీయం ఓదార్పు**
**రాజకీయానికి అవినీతి ఓదార్పు**
**ప్రజాస్వామ్యానికెప్పుడూ నిట్టూర్పే!**

– తల్లాప్రగడ ప్రభాకర్,
హైదరాబాద్

కొంది.

పెళ్లి ఫొటోలలోనూ అతని ముఖం మల్లెల వరుసల్లో దాగి ఉంది. తన సంగతి సరేసరి. అమ్మ, అవ్వలూ తల వంచేసి, చుబుకాన్ని గుండెలపై వాల్చమన్నారు. కుతూహలంగా తలెత్తబోయినా, వంచడానికి అటొకరు ఇటొకరు.

తల మీదనుంచి మునివేళ్లదాక మేలిముసుగొకటి. ఒక రూపం లేని తమ దాంపత్యం నీలుకి ఒక్కోమారు చాలా చిత్రంగా తోచేది. నీలులోని సిగ్గు, బిడియం, భయం తేరుకొనేలోగానే, అతను దేశాంతరం పోయాడు. క్రీగంట చూపులైనా దక్కాయి కావు. వాలిన సోగ కళ్ళ నిండా ఏమేమి కదలాడాయో.

కన్నవారిల్లు వదిలిన కన్నీటి వీడ్కోలులోనే ఇంకా తడిచి ముద్దయి ఉండగా, అసలు మనిషే వంటరిగా వదిలి వెళ్ళాడు.

నీలు అమాయకత్వంలోంచి అమ్మలా ఎప్పుడు మారిందో తెలియదు. పురిటినొప్పుల భయంలోంచి తేరుకొనే లోపలే కానుపయ్యింది. వంటిని చీల్చేసే ఆ నొప్పుల గూర్చి ఒక్కనాడన్నా అవ్వలు మాట్లాడారా? ఏం అనుకొని ఏమి లాభం? పసితనంలోనే పసిబిడ్డకు తల్లయింది.

పోయిన రక్తం పోగా, పాలిపోయిన నీలు పాలిచ్చే తల్లయింది.

తన ప్రమేయమేమీ లేకుండా తన వంట్లో, తన ఇంట్లో జరిగిపోతున్న ఈ మార్పులను నీలు వింతవింతగా అనుభవించసాగింది.

నీలు తనంతతానుగా ఆ గదిని వదిలివెళ్ళిందే లేదు. అలాంటప్పుడు తన జ్ఞాపకాలన్నీ అల్లిబిల్లిగా సాగుతూ ఉండేవి.

తొలిచూలు. చక్కటి పాప. తండ్రి నోట్లోంచి ఊడిపడిందని అందరూ మెటికలు విరిచారు. అతను అందగాడే అయి ఉండాలి. ఒక చిత్రమైన కుతూహలం నీలులో ప్రవేశించింది.



పాప బారసాల ఉయ్యాల, ఉత్సాహంగా గడిచాయి. పాప తండ్రి వచ్చాడు నెలల తరువాత. మళ్ళీ ఆ రాత్రే అతనిని నీలు కలవడం, పచ్చి బాలింత. అతను తెచ్చిన కొత్త చీరలు, చమ్కీలు కుట్టిన జాకెట్లు, అత్తర్లు, నగల అలంకారంలో నీలు మరింత అందంగా తయారయింది. పక్క గదిలో అమ్మమ్మ, అవ్వల ఒడిని చేరిన పాప మొదటిసారిగా పాలసీసాతో మౌనం దాల్చింది.

ఇక నీలూ అతనికోసం పరిచిన కొత్త



వెల్వెట్ దుప్పటి అయ్యింది. రేయింబవళ్ళు ఉక్కిరిబిక్కిరిగా సాగిన ఆ సంసారం మళ్ళీ అతని ప్రయాణంతో సావధానపడింది.

వళ్ళో బిడ్డ, వంట్లో బిడ్డ.

కాలంపాటికి కాలం సాగింది.

పదహారేళ్ల పడుచు తల్లి మళ్లీ పెనిమిటి కోసం ఎదురు చూడసాగింది. ఈ అనుభవం చిత్రమైంది. ఇంటి పని, వంట పని, పిల్లల పని.. అన్ని పనులకు మనుషులను అమర్చారు. పుల్ల తీసి పుల్ల పెట్టాల్సిన పనిలేదు. చీరలు, సారెలు, నగలు, నాణ్యాలు, అత్తర్లు, సెంట్లు వేటికీ కొదువ లేదు.

నీలులో సరిగ్గా అప్పుడో మరెప్పుడో ఏదో కలకలం మొదలయ్యింది.

వినత డాక్టరు చదువుతోంది. కాంచన కాలేజీకి వెళుతోంది. తన స్నేహితుల కబుర్లు అప్పుడొక వార్త, ఇప్పుడొక వార్తా వచ్చి చేరుతున్నాయి.

ఏమీ తోచక ఏదైనా చేయాలని అమ్మను అడిగింది. కొత్తగా అందరూ కుడుతున్న కుట్లు, అల్లికల సామగ్రి అంతా తెచ్చి ఆమె నీలుకు ఇచ్చింది. నిబ్ పెయింటింగులు, దారాల్తో బొమ్మలు, వెల్వెట్ బుట్టబొమ్మలు, అవి చేసే విధానం కూడా

వారే వివరించి పంపారు.

కొత్తలో వింతగా తోచి, దిండు గలీబులు, దుప్పట్లు, టేబులు కవర్లు, చీరలు, జాకెట్లు అందినచోటల్లా లతలతో, తీగలతో, పూలతో, మొగ్గలతో నింపేసింది. రానురాను అవీ మొహం మొత్తాయి.

ఇంట్లో ఉన్న ఒకే ఒక ఈసీ టీవి. చిత్రహార్, చిత్రలహరితోపాటు వారాంతం సినిమాలు గది గడపలోనే కూర్చుని, తెరచాటునుంచి చూడాల్సి వచ్చేది. ఇంట్లోని వారెందరో నీలూకి తెలియదంటే అతిశయోక్తి కాదు.

**కొత్తగాలి...**

**ఇంటికొకరుంటే**
**అన్నాహజారే**
**అవినీతి నాయకుల పని**
**ఇక బజారే**

*– శ్రీష్టి శేషగిరి, సికింద్రాబాద్*

వీధిలోని పిల్లాపాపలు టీవీ ముందు ముసిరినా, పనివాళ్ళు కదలకుండా తిష్ఠ వేసినా ఫరవాలేదు కానీ నీలు మాత్రం తన గది గడప దాటకూడదని నీలు అత్త నిక్కచ్చిగా చెప్పేసింది.

'ఏ జో హై జిందగీ', 'హం లోగ్'. చూడాలని నీలూకీ ఎంత కుతూహలంగా ఉండేదో, అవి పెట్టేవారే కాదు. అలా టీవీ చూడడంకన్నా వినడం అలవాటయిపోయింది.

ఇక గది గడప దాటడానికే చొరవ చేయలేనిది తలవాకిట నిలబడి పారిజాతాలను ఎలా పలకరించగలదు?

ఏం చేయడానికి తోచడంలేదు. అలా సినిమాకి పోయి వస్తే..? మరొక కొత్త కుతూహలం కలిగింది.

ఆ మాట ఆమె పెదవి దాటిందో లేదో.. వీసీఆర్, క్యాసెట్లు ఆమె గదికి దిగుమతయ్యాయి, ఆయన పంపాడంటూ. భర్తకు తన మాటపట్ల ఉన్న విలువకు నీలు నిజంగానే మురిసిపోయింది. గది కదలకుండా బుద్ధిగా సినిమాలు చూస్తూ కూర్చునేది. అదీ కొన్నాళ్ళకి మొహం మొత్తింది. అప్పుడప్పుడు అదాటున ఆ సినిమా సరాగాలు ఆమెను పలకరించేవి. సరికొత్త భావనలు, సున్నితంగా ఆమెను స్పృశించేవి అర్థరాత్రి అపరాత్రి అని లేకుండా..

జాలువారిన పారిజాతాల కోసం ఆ ఇంటి వాకిటిలోకి నడిచి వచ్చిన ఆ వంటరి ఉదయం అలలు అలలుగా జ్ఞాపకాల్లోకి వచ్చేది. తెలియని ఒక భావనతో లోలోన పరితపించేది. ఒక తోడు కోసం తనకు తెలియకుండానే పక్కలు తడుముకొనేది.

మరింత వంటరితనం, వింత భావనలు అర్థం పర్థం కాకుండా నీలూని ఉక్కిరిబిక్కిరి చేసేవి. అలాంటప్పుడు తెలియకుండానే కళ్ళవెంట నీరు ఉప్పొంగేది. తెలియని ఉద్వేగంతో పిల్లలను చెరోపక్క డొక్కలో ముడుచుకొని, తానొక పసిపిల్లలా మునగదీసుకొనేది. మౌనంలోకి ముడుచుకుపోయేది. ఆకుల మాటున మొగ్గలా.

★ ★ ★

ఇంట్లోవాళ్లు నీలు పిల్లలను చేసే గారం అంతా ఇంతా కాదు. శాటిన్ గౌన్లు, సాక్సులు, రిబ్బన్లతో ఎప్పుడు శ్రద్ధగా అలంకరించిన బుట్టబొమ్మలా ఉండేది పాప.

బాబు పసివాడు. వాడికీ కోరినన్ని బట్టలు, బొమ్మలు, ఆటవస్తువులు, కార్లు, చాక్లెట్లు, బిస్కెట్లు.

అమ్మ, అవ్వ పిల్లలను అరచేతుల్లో పెట్టుకొని పెంచేవారు. ఆయన పంపా

రంటూ ఎక్కడెక్కడి బొమ్మలు, కానుకలతో ఇల్లంతా నింపేవారు. ఆటా పాటల ముద్దుమురిపాల సంగతి సరేసరి.

పిల్లలకు ఒళ్ళు వెచ్చజేసినా, చిర్రున చీదినా, తటాలున తుమ్మినా, ఆటల్లో పడి ఏ మోకాలో గీరుకుపోయినా.. వారు చేసే హడావుడికి అంతేలేదు.

నీలుని తాకనిచ్చేవారైనా కాదు. పిల్లల్ని ఒళ్ళో పెట్టుకొని, తమ కళ్ళల్లో వత్తులు వేసుకొని, ప్రాణాలు ఉగ్గబెట్టుకొని, వాళ్ళే ఊపిరిన్నట్టు పెంచేవారు పిల్లలు తెరిపినపడేదాక. ఇక నీలు ప్రేక్షకమాత్రురాలే.

పిల్లవాడు మాత్రం అమ్మకూచి. తల్లిని కరుచుకొని వదిలితే విడ్డూరమే.

దానికితోడు ఎప్పుడు మొదలయిందో ఆయాసం. మాటిమాటికి వాడిని పట్టి పీడించేది. అలా వాడితోపాటు, నీలు మొట్టమొదటిసారిగా జెండా వీధి దాటి ట్రంకు రోడ్డు దాటి, బృందావనంలోని ఆసుపత్రిలోకి అడుగు పెట్టింది.

అదొక చిత్రమైన ప్రపంచం. అన్ని ఇళ్ళూ ఆసుపత్రులే. వాటిపైన డాక్టర్ల కాపురాలు.

అటు ల్యాబులు, ఇటు మందుల అంగళ్ళు, అంబులెన్సుల హడావుడి అటూ ఇటూ ఎక్కడ చూసినా రోగుల సందడే.

నీలుకి మళ్ళీ వినత కనబడింది. అక్కడి గుండె మరియు శ్వాసకోశాల వైద్యుడి దగ్గర. తెల్లకోటులో చేతిలో ముడిచి పట్టుకొన్న స్టెతస్కోపుతో.

నీలు ఒక్కసారిగా లోకంలోకి పడినట్లయింది.

వినత డాక్టరయిపోయింది. కానీ, గుండె ఊపిరితిత్తుల వైద్యురాలు కావాలని పై పరీక్షలు రాస్తోందట. అందుకే ఆ ఆసుపత్రిలో చేరానంది. అక్కడ వినత ఉందన్న భరోసాతో, అమ్మ, అవ్వలు నీలును అప్పుడప్పుడు వంటరిగా వదిలి వెళ్లేవాళ్లు పిల్లవాడితో పాటు, ఇంటిపనులు చక్కబెట్టుకు వస్తామని.

సరిగ్గా అప్పుడే నీలు తన చుట్టూ చూడడం మొదలు పెట్టింది మెల్లిమెల్లిగా.. కళ్ళంతా విప్పార్చి, ఎలాంటి పర్యవేక్షణ లేకుండా.

ఒకరోజు అమ్మ, అవ్వ లేనప్పుడు, డాక్టరుగారు రౌండ్స్‌కి వచ్చారు. వినతే అన్నీ విడమరిచి చెపుతోంది. నీలు మౌనప్రేక్షకురాలయింది.

ఆయన వినతకు, మిగిలిన నర్సులకు ఇస్తోన్న సూచనలకన్నా, వివరించి వ్యాధి గురించి చెపుతున్న విషయాలకన్నా నీలు అతని మడతలు లేని చొక్కాని, మోచేతి దాకా మడిచిన పొడవు చేతుల ముడతలనీ, విప్పేసి ఉన్న చొక్కా పైరెండు గుండీలనీ.. వింతగా గమనించసాగింది. అవన్నీ ఆమెకు చిత్రంగా తోచాయి. మాటామంతీ లేకుండా గుడ్లప్పగించి చూస్తున్న నీలుని డాక్టరు సంభాషణలోకి లాక్కొచ్చాడు "ఆ బాబు తల్లిని అడిగి చెప్పండమ్మా, వినతా" అంటూ.

"ఆమే ఆ బాబుకి అమ్మ, డాక్టర్!" వినత నవ్వింది. "నీలు, నా స్కూల్ మేట్"

వినత ఎలాంటి జంకు గొంకు లేకుండా సూటిగా చూస్తూ తేటగా మాట్లాడుతోంది.

నీలుకి ఒళ్ళో వణుకుతున్న బిడ్డ పరిస్థితికన్నా, వాడి గుండెల్లోంచి ఎగతన్నుకొస్తున్న ఆయాసం కన్నా, ఆ డాక్టర్తో మాట్లాడడమే, ఒక పెద్ద సాహసంగా తోచసాగింది.

"అవునా? వీరెప్పుడూ బిడ్డ గురించి మాట్లాడలేదు.."

అంత దర్జాగా దర్పంగా మాట్లాడుతున్న ఆయన్ను నీలు కళ్ళార్పకుండా చూస్తూనే ఉంది. నోట పలుకు లేదు. తలను అటూ ఇటూ ఆడిస్తూ, అన్ని ప్రశ్నలకు సమాధానాలిచ్చింది.

"నమస్తే డాక్టర్‌గారు!" ఇంతలో నీలు అత్త రానే వచ్చింది. నీలు కళ్లు వాల్చుకొని పక్కకు తొలగింది. ఆ డాక్టరు మాట తీరును, హావభావాలను, కదలికలను, వివరణలను మౌనంగా ముద్రించుకోసాగింది.

తలాడిస్తూ శ్రద్ధగా నీలు అత్త మాటలు వినడాన్ని, ఓపికగా నీలు అత్తకు అన్ని విడమర్చి చెప్పడాన్ని, కేస్ షీట్ పై మందులు రాయడాన్ని, వినతకు నర్సులకు సూచనలు ఇవ్వడాన్ని నీలు అత్త కురిపిస్తున్న ధన్యవాదాల్ని నవ్వుతూ వారిస్తూ, హుందాగా గది బయటికి నడిచెళ్లడాన్ని.. నీలు కుతూహలంగా గమనించసాగింది.

నీలు అత్త, వినత, నర్సులు.. వంగి వినయంగా మాట్లాడం నీలుని మరింత ఆకర్షించింది.

పిల్లవాడి ఆయాసం తిరగబెడూతూనే ఉంది. ఆ వంకనా ఈ వంకనా నీలు ఆసుపత్రికి వస్తూనే ఉంది. నీలు అత్తతోనో, అమ్మతోనో..

పిల్లవాడి ముక్కుదిబ్బడ పట్టడం ఆలస్యం, ఆఘమేఘాల మీద ఆసుపత్రి ఆవరణలో వాలిపోతున్నారు. బాబు తండ్రి ఈ రూపేణా నీలుకి పిల్లల మీద పెరిగిన శ్రద్ధకు ఎంతో సంతోషం వ్యక్తపరిచాడు. ఆ నోటితోనే, "పిల్లవాడికి ఏదైనా జరిగిందో.." అంటూ ఒక హెచ్చరికను బెదిరింపును కలిపి వదిలాడు.

ఇక, తుమ్మొచ్చినా దగ్గొచ్చినా, వానొచ్చినా వరదొచ్చినా.. నీలు ఆ ఆసుపత్రిలోనే మకాం.

తన వెల్వెట్ తెరల గదిలోంచి ఈ బయటి ప్రపంచానికి ఈ ఆసుపత్రి ఒక బంగారు బాటలా తోచసాగింది. ఎవరికీ ఈ విషయం తట్టలేదు కానీ!

★ ★ ★

వినత, కాంచన అదే మొదటిసారి నీలు వాళ్లింటికి రావడం.

కాంచన అమెరికాకు వెళ్ళబోతూ, అందరికీ వీడ్కోలు విందు ఏర్పాటు చేసింది. దానికి ఆహ్వానించడానికి వెళ్ళారిద్దరూ.

వాళ్ళు వెళ్లేసరికి నీలు గదిలోంచి సన్నగా పలకరించింది, పంకజ్ ఉదాస్ గొంతు.

ఇంటినిండా ఘుమఘుమలాడుతోన్న మసాలల వాసన. వాళ్ళిద్దరినీ చూసిన సంతోషంలో నీలు ముఖం వెలిగిపోతోంది. తన కోసం ప్రత్యేకించి అతిథులు రావడం అన్నది ఆమె ఊహించలేదు.

వినత పట్ల నీలు అత్తకున్న సద్భావన వారి ముచ్చట్లకు కలిసొచ్చింది. గదిలో చేరి కబుర్లు చెప్పుకుంటుంటే, అతిథి మర్యాదలు అద్భుతంగా జరిగిపోయాయి.

వినత కూడా తక్కువ తిందా? నీలు అత్త కళ్లనుంచి కాళ్ల వరకు అన్నింటినీ పరీక్షించింది. కంటిలో పువ్వు నుంచి కీళ్ళ నొప్పుల వరకు అన్నింటినీ అడిగి తెలుకొని, సలహాలు గుప్పించేసింది గలగలమంటూ.

నీలు అత్త సంబరానికి అవధులు లేవు.

ఇక వినత, కాంచన.. నీలు చేసిన బొమ్మల్ని, కుట్టిన చీరల్ని, దిండుగలీబుల్నీ ఆశ్చర్యంగా చూశారు.

"ఎన్నెన్ని కళలు నేర్చుకొన్నావే!" అబ్బురపడ్డారు.

నీలు మురిసిపోయింది.

"అబ్బ! ఆ గులాబీ పువ్వుమీద సీతాకోకచిలుక వాలింది చూడు! నిజందేమో అనిపించడం లేదూ?" సంబరపడ్డారు.

నీలు ముసిముసి నవ్వులు నవ్వింది.

పిల్లల ఫొటోలు చూశారు. వాళ్ళ అల్లరి, ముద్దు మాటలు, బడి కబుర్లు అడిగి అడిగి చెప్పించుకొన్నారు. ఆనందపడ్డారు.

నీలు మురిపెంగా నవ్వింది.

ఉండుండి కాంచన అంది, "అసలు నువ్వు ఊళ్ళో ఉన్న విషయమే మాకు తెలి

యదబ్బా.. మీ ఆయనతోపాటు గల్ఫులో ఉంటున్నావనుకొన్నాం? "

"పెళ్ళయ్యాక ఇక మాతో నీకేం పనిలే.. అనుకొన్నాం!" వినత నవ్వుతూ వంత పాడింది.

"ఎన్నేళ్ళు! ఒక్క ఊళ్ళోనే ఉన్నామన్న మాటే కానీ, ఒక్కసారన్నా కలవ లేదు. ఇప్పుడు ఎక్కడెక్కడికో వెళ్లిపోతున్నాం" కాంచన గొంతు గద్గదమైంది. అంతలోనే తేరుకొని అంది "వినత పుణ్యాన మళ్ళీ నీ చిరునామా దొరికింది"

"ఊహు, మన నీలమణి మనకు దొరికింది.."

అందరూ హాయిగా నవ్వారు. నీలు అత్త మురిపెంగా మెటికలు విరిచింది.

వీడ్కోలు చెపుతూ తలవాకిటి వైపు అడుగులు వేసేసరికి, కాంచన ఏదో అడ్డు పడ్డట్లు చటుక్కున వాకిట్లోనే ఆగిపోయింది.

రెండు చేతులూ జోడించి, గడ్డానికి ఆనించుకొంది, పారవశ్యంతో కళ్ళు మూసుకొంది. కమ్మటి పరిమళం గుండెల నిండా నింపుకొంది.

ఆమె ముఖకవళికలు చూసి, అందరూ విస్మయంలో మునిగిపోయారు.

ఏదో కలలోంచి మాట్లాడుతున్నట్లు కాంచన అంది, "ఈ దేశం నాకేమిచ్చిందంటే, ఇదే! ఈ అనిర్వచనీయమైన అనుభవం!"

ఆ పలుచని పరిమళం మెల్లిమెల్లిగా అందరి గుండెల్లో నిండిపోసాగింది.

మాటల్లోపడి వారు గమనించనేలేదు. పారిజాతాల వేళయ్యింది. పైనుంచి, ఆ పూట పున్నమి.

వెన్నెల్లో తడుస్తోన్న పారిజాతాల సోయగానికి కళ్లప్పగించేశారు.

అందరూ ఎవరికి వారు ఒక అపురూపమైన అనుభవం చేజారిపోతుందేమో, కలలా కరిగిపోతుందేమో.. అన్నట్లు ఎక్కడివారక్కడ శిలాసదృశులు అయిపోయారు నోట పలుకు లేకుండా.

"నీలూ నీకు గుర్తుందా? మనం ముగ్గురం ఎంత పోటీ పడేవాళ్ళం, లెక్కల సార్‌కి ఈ రాలిన పూలు తీసుకెళ్ళి ఇవ్వడానికి!"

నీలు సన్నగా నవ్వింది.

"మాష్టారుగారి శ్రీమతి ఎప్పుడూ చెప్పేవారు గుర్తుందా? స్వయంగా ఆ శ్రీకృష్ణుడు స్వర్గం నుంచి తెచ్చి ఈ మొక్కను నాటాడట.."

"ఆ మరే.. యుద్ధంచేసి గెలిచి. అయితే, నాటిందేమో సత్యభామ ఇంటి తోటలో. పూలు రాలిందేమో రుక్మిణమ్మ ఇంట! అంతా టక్కరి పని..!" వినత నవ్వుతూ వాళ్ళను మైకంలోంచి బయట పడేసింది.

"ప్రతిదానికీ ఎడ్డెమంటే తెడ్డెమంటావ్! నువ్వేకదానివి.." కాంచన నవ్వింది.

"నిజమే మరి.. పువ్వులు విరిసే తరుణాన మరులొలికే మత్తు వాసనలు.. ముద్దుల భార్యకి, తెల్లవారి రాలిన పూల హారాలతో పూజా పునస్కారాలు పెద్దావిడకి.. చూశారా.. ఆ ఆంతర్యం..!" కాంచన అర్థాంతరంగా ఆగింది.

"మరే, ప్రేమ ఒకరిదీ.. భక్తి ఒకరిదీ"

## కొత్తగాలి... 

**ఆనాడు పరుల దోపిడి**
**ఈనాడు నాయకుల దోపిడి**
**నల్లధనం దాపిడి**
**ఫలితం, పేదోడి రాపిడి**

– బి. మోహన్,
సూర్యాపేట

ఒక దీర్ఘం తీసింది వినత.

"రక్తీ కాదు. భక్తీ కాదు. తత్వజ్ఞాన చర్చకూ దిగబోవడంలేదు.. గానీ, వారెవరైనా, ఆ ఆడవాళ్ళు దాంపత్యంలో గాఢాను రక్తి కోసం తపిస్తూ పరితపిస్తూ గడిపారే, ఆ జీవితం తలుచుకొంటే గుండె నీరవుతుంది" ఆ మాట అంటూనే, కాంచన మౌనంలోకి కూరుకుపోయింది.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. నీలు అయితే నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. ఇలా మాట్లాడుకోవడం ఆమెకు కొత్తగా వింతగా ఉంది. ఒకప్పుడు తనూ వీళ్ళతో ఇలాగే మాట్లాడుతూ పోట్లాడుతూ ఉండేది కాదూ..? తనను చూసి తనే వింత పడింది.

"ఏమైనా ఆ పారిజాతాలు మనలో ఎంతలా భాగమైపోయాయో కదా?" వినత మెల్లిగా అంది.

ఎవరో లోన గదిలోంచి వాకిటి దగ్గరి లైట్ వేశారు. ఒక్కసారిగా మాటలు ఆగిపోయాయి.

నల్లటి గేటు మీదుగా.. పచ్చటి చెట్టు. నారింజరంగు కాడలపై నాజూకు నక్షత్రాల్లా విరిసిన తెల్లటి పారిజాతాలు.

కాసేపు అక్కడే ఆగిపోయి, ఆ పరిమాళాన్నంతా మనసులో నింపుకొని, నీలుకి వీడ్కోలు చెప్పి వెళ్ళారు ఒక్కొక్కరుగా. అదే ఆఖరు నీలు వారిద్దరినీ కలవడం.

ఆ తరువాత, వినతకు ఎప్పుడు నీలు గుర్తొచ్చినా, బిగించేసిన కిటికీలు, వాటికి వేలాడుతున్న రంగురంగుల సిల్కు తెరల రెపరెపలు, మంచంమీది వెల్వెట్ దుప్పటీ.. గుర్తొచ్చేవి ఎందుకోగానీ. కాంచనకు ఆకుపచ్చ సిందూర సహిత శ్వేతవర్ణమూ, పలచని పారిజాతాల పరిమళమూ గుర్తొచ్చేవి.

★ ★ ★

వాళ్ళు కలిసి వెళ్ళిన చాలారోజుల వరకు, వాళ్ళ మాటలు చుట్టూ తిరుగుతున్నట్టే నీలుకి తోచేది. ఒక్కో మాటా అదాటున గుర్తొచ్చి నీలును కదిలిస్తూనే ఉంది.

అవును. తను ఇక్కడ ఏం చేస్తుంది, అతనితోపాటు వెళ్ళిపోకుండా? అతను ఎప్పుడో ఒకసారి అలా రావడం, ఇలా పోవడం. ఒక కలలాగా, ఒక కల్పనలాగా. పిల్లలు తను.. కానుకలు అందుకొని మురిసిపోతున్నారే! పిల్లలకు ఏ రిమోట్ కంట్రోల్ కారో, ఏ చాక్లెట్ ప్యాకెట్టో ఇస్తే చాలు. మరి తనకు? తనకేం కావాలి?

నీలులో మోసులెత్తిన చిన్న చిన్న ప్రశ్నలు ఆమెను నిలువ నీయడంలేదు. విచ్చుకొంటున్న పారిజాతాలు ఆమెను ప్రేమగా పలకరిస్తున్నాయి. విచ్చిపోయిన పారిజాతాలు శ్రద్ధగా పరామర్శిస్తున్నాయి.

మెల్లిమెల్లిగా నీలు అంతరాంతరాల్లో దాంపత్యం గురించీ కుటుంబం గురించీ ఆలోచనలు మొదలయ్యాయి. ఎక్కడ ఏ జంట చెట్టాపట్టాలేసుకొంటూ కనబడినా, వారిని నిశితంగా చూస్తోంది. తమది ఎలాంటి జంట కాగలదోనని ఆశ్చర్యపోతోంది.

పిల్లలతో అమ్మా నాన్నలు కలిసి కబుర్లు చెప్పుకొంటూ వెళుతుంటే చూసినపుడు ఆ ఆలోచనలు మరింత విస్తృతమవ్వసాగాయి.

## కొత్తగాలి...

**ముందు**
**అది తెల్లధనమే**
**మసిపూసి మాయం చేశాకే**
**అది నల్లధనం**

– బిక్కనూరి రాజేశ్వర్, ఈద్‌గామ్

పిల్లలతో వాళ్ళ నాన్నతో, దేశంకాని దేశంలో, ఒక ఇంటిని ఊహించుకొం టోంది.. దాని ముందు చిన్నతోట. దాని లోనే ఈతకొలను. దాని పక్కనే పారిజా తాలనీ చూడసాగింది. ఏమేమి రకాల వంటలను చేయాలో, ఎన్నెన్ని రకాల పూల మొక్కలను నాటాలో... అను కొంటూ ఉంటుంది. తమ నలుగురితో నిండిన ఆ ఇంట్లో, ఒక నిత్య జీవన వ్యవ హారాన్ని తన మనసులో నిర్మించుకొంటూ ఉంటోంది. ఆమె నిత్యం చూసే లెక్కకు మిక్కిలి వీడియోలు, ఆమె కలలకు రంగు లను అద్దాయి. ఆశలకు రెక్కలు మొలిపిం చాయి.

ఆ ఆలోచనల్లోనే జీవిస్తూ, అప్పుడ ప్పుడూ అనుకోకుండా, ఆ కల్పనల వాకిట నిలబడి, ఆ కలలన్నీ పైకి కలవరించేస్తూ ఉంటుంది.

ఒకరోజు వంటింట్లో మెల్లిగా నీలు అత్త పక్కన చేరి, మెత్తగా అడిగింది తన ప్రయాణం విషయం ఏంటని.

నీలు అత్త నివ్వెరపాటుతో నీలును పరీ క్షగా పరిశీలించింది. ఒక పసిబిడ్డ తల్లి చెంతను కోరినంత స్వచ్ఛంగా ఉంది ఆమె ముఖం.

'నీలులో స్వంత ఆలోచనలు మొదల య్యాయి. వాటిని మొదలంటా తుడిచే యాలి' నీలు అత్త నిట్టూర్చింది.

నీలు అత్త మెల్లిగా మాట మార్చి, నీలును తన గదిలోకి పంపింది.

నిజానికి నీలు మొదటిసారి ఆ ప్రస్తా వన తెచ్చినప్పుడు, నీలు అత్త అంత పట్టిం చుకోలేదు. మళ్ళీ మళ్ళీ నీలు ఆ మాటే ఎత్తడం, నీలు అత్తను ఆలోచనలో పడే సింది.

నీలు పదే పదే అడిగేట్టు చేసిన అనుభ వాలు, ఆమెకు తెలియకుండానే ఎదుర య్యాయి అనుకోకుండా.. వెంటవెంటనే.

★ ★ ★

ఒకరోజు మందుల అంగడి వద్ద పిల్లవా డికి మందులు తీసుకొంటుంటే ఒక దృశ్యం నీలు కళ్ళబడింది.

డాక్టరు కారు తలుపు తీసి పట్టుకొ న్నాడు. ఒక యువతి పసిబిడ్డను పొదివి పట్టుకొని దిగింది. డాక్టరు ఎంతో అభిమా నంగా బిడ్డను పొత్తిళ్ళతో సహా అందుకొ న్నాడు. మరోచేత్తో ఆమెకు చేయి అందిం చాడు. ఇద్దరూ ముసిముసి నవ్వులతో మెట్లెక్కి వెళ్ళారు. ఆ ఇద్దరి ముఖాల్లో వెలుగు ప్రస్ఫుటంగా.. ప్రఫుల్లంగా.. ప్రమోదంగా..

నీలు ముఖం వెలవెలా బోయింది, తనకు తెలియకుండానే.

"డాక్టరుగారి బాబు. పుట్టింటి నుంచి మేడం బాబుతో ఇప్పుడే వస్తున్నారు" మెడి కల్ షాపతను నీలు ముఖంలో కదిలిన భావాలకు సమాధానంగా స్పందించాడు.

ఆ డాక్టరు అపురూపంగా, మురిపెంగా చూసుకొనే కుటుంబం ఒకటి ఉంటుందని నీలుకి మొదటిసారిగా తట్టింది.

ఆపై ఆసుపత్రి మెట్ల మీదుగా పైనున్న ఇంటికి అనేకసార్లు ఆ జంట కలిసి వెళ్ళడం చూసింది.

"పెళ్ళికి వెళ్ళాలంట.. త్వరగా రండి, ఎనిమిదింటికల్లా వచ్చేయండి సార్ వాళ్ళు సినిమాకి వెళుతున్నారు"

"బంధువులెవరో వచ్చారు. ఈ పూట ఓపి ఆలస్యంగా మొదలవుతుంది"

"బాబుకు అన్నప్రాశన. ఈ రోజు డాక్ట ర్‌గారు ఉండరు"

ఇలాంటి చిన్న చిన్న సవరణలు వివర ణలు ఎందుకో గానీ, నీలుకి నచ్చడం లేదు. ఎక్కడో కలుక్కుమనిపించసా గాయి. వినతతో వెళ్ళగక్కితే, "నీకేంటోయ్, నేనుంటాగా! బాబును తీసుకొని వచ్చేయి. అంతగా అవసరమైతే డాక్టర్‌గారిని

ఫోనులో అడిగి నేనే చెప్తాగా? " అనేది.

నీలు వస్తూ పోతూ ఉన్నప్పుడు, ఆ డాక్టరు భార్య కంటపడేది.

బాల్కనీలో, మెట్లమీద, కారు దగ్గర నిలబడి, కుండీల్లో మొక్కలు తవ్వుతూ, గోడకు చేరగిలబడి కుర్చీలో గోడకు కూర్చుని.

ఆకర్షణీయమైన ముఖకవళికలు, పెద్ద పెద్ద కళ్ళు, అటూ ఇటూ వస్తూపోయే పెనిమిటిని మురిపెంగా చూస్తూ, ఒళ్ళో బాబుకు ముద్దులు కురిపిస్తూ, గోరుముద్దలు తినిపిస్తూ..

నీలుకి అసలు ఊపిరాడేది కాదు. మెల్లిమెల్లిగా ఆస్పత్రికి రాకపోకలు తగ్గించేసింది. అత్తనో అమ్మనో తీసుకెళ్లమనేది,

## కొత్తగాలి... 

**పెళ్లికాని స్త్రీ**
**పంచదార చిలుక**
**పెళ్లయిన స్త్రీ**
**పంజరంలో చిలుక**

– చక్కా చెన్న కేశవరావు,
కావలి

తాను ఇంటి పనులు చక్కబెడతానని. ఆమె మాటను వారెన్నడు కాదన్నారు కనుక?

నీలు ఆలోచనలు మెల్లిమెల్లిగా విస్తరించసాగాయి.

వీసీఆర్‌లో సినిమాలు రుచించడం లేదు. సినిమా చూద్దామనుకోగానే, నవ్వుతూ జంటగా సినిమాకెళుతున్న డాక్టరుగారి జంట ఆమె కళ్ళముందు మెదిలేది. "అందరం చూసే సినిమానేగా? మరి, అంత సరదా ఏముంటుంది? అంత సంతోషం వారికి దేనికని? "

ఆసక్తి, అసహనం పోటీపడుతూ నీలుని ఆవహించేవి. తెలియకుండానే ఆగ్రహించేది. పిల్లనో పిల్లవాడినో, అటో చెంపా ఇటో చెంపా వాయించేది.

నీలు అత్త వాళ్ళల్లో వాళ్ళు మంతనాలు చేసుకొన్నారు.

"నిజమే, ఈమారు రెండు మూడేళ్ళయ్యింది. వాడు ఇంటి ముఖం చూసి. ఒకమారు వచ్చిపొమ్మనాలి"

"అవునబ్బా, నువ్వెప్పుడు వెళుతున్నావ్ గల్ఫ్‌కి? " వినత యథాలాపంగా అడిగిన మాట నీలు లోలోనికి చొచ్చుకుని పోయింది. మొదటిసారిగా ఆ ప్రశ్నలోని ప్రాధాన్యత స్ఫురించింది.

"ఇంట్లో ఎవరూ ఆ మాట ఎందుకు ఎత్తడం లేదు? తననెందుకు అతనితో పాటు అతనున్న చోటికి పంపడం లేదు? పిల్లాపాపలతో ఇద్దరూ కలిసి ఉంటేనేగా అది సంసారం? " ఒక చిన్న ప్రశ్న నీలు లోనంతా ఊడలు దిగిపోయింది. మరలా గల్ఫ్ నుంచి ట్రంకాల్ వచ్చినప్పుడు, ఆ ఒక్క మాటా నీలు పెదవి దాటిపోయింది.

"నన్నెప్పుడు తీసుకెళతారు? "

"అన్నీ అమర్చాక"

"ఎంత కాలమని? "

"చెప్పాగా.. ఎంత కాలమైనా.. అన్నీ అమర్చాకే!"

ఆ సంభాషణ మొత్తం అటు తిరిగి ఇటు తిరిగి అందరికీ చేరింది.

అతనిని ఒకమారు ఇంటికి వచ్చిపొమ్మని అందరూ ముక్తకంఠంతో చెప్పారు.

అతను ఇంటికి ముఖం వాచిపోలేదు. ఎక్కడ ఉన్నాడో అక్కడే, ఇల్లు నిర్మించుకోగల సమర్థుడతడు. నీలు లేకుండానే.. అతను అన్నీ అమర్చుకొన్నాడు. అయినా, అతను వచ్చాడు. రావడం రావడం.. అతనిలో ఏదో మార్పు ఇట్టే కనిపిస్తూంది.

నిన్నటి నిజం

## వేశ్యాగృహంలో కల్లూరి !

కర్నూలులో కల్లూరి వేంకటనారాయణరావు 1925లో విద్యాశాఖలో డెప్యూటీ ఇన్స్పెక్టర్. ఉద్యోగమంటే ఆయన దృష్టిలో సమాజసేవ. తోటి ఉద్యోగులకు మాత్రం అది అక్రమార్జనకు ఓ అవకాశం. అందుకే జీతంతో పాటు గీతమూ ఆశించేవారు. తమ కార్యకలాపాలకు అడ్డుగా నిలుస్తున్న ఆయనను ఎలాగైనా పడదోయాలని ఇతర ఉద్యోగులు పథకం వేశారు. కల్లూరి వారికి సంగీత, సాహిత్యాలతో గడపడం అలవాటు. దాంతో ఒక పెద్ద భక్తి సంగీత కచ్చేరికి వెళదామని ఆయనతో చెప్పి, ముందుగానే ఏర్పాటు చేసుకున్న వేశ్య ఇంటికి తీసుకెళ్లారు. భక్తిరస సంగీతం ప్రారంభమైంది. కల్లూరివారి జతగాళ్ళంతా ఒక్కొక్కరే బయటకు వెళ్లిపోయారు. చివరికి ఆ వేశ్య, ఆయన మిగిలారు. ఆమె తన సంగీతాన్ని చాలించి ప్రేమపాశాలతో ఆయనను బిగించాలనుకుంది. భక్తి సంగీతంతో అప్పటికే ధ్యాన స్థితిని చేరుకున్న ఆయనవద్ద ఆమె ప్రయత్నాలన్నీ బెడిసికొట్టాయి. చివరికామె ఆయన కాళ్ళమీద పడి మొత్తం పథకాన్ని వివరించింది. 'స్వామీ నా తప్పును మన్నించండి. మీలాంటి ఉత్తముడ్ని చూడటం ఇదే మొదటిసారి. వారి మాటలకు మోసపోయి మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను' అని చెప్పింది.



అతని కోరమీసం చిన్న గడ్డంలో కలిసి పెరిగిపోయింది. కళ్ల చుట్టూ చారలు, దవడలు మాటి మాటికీ బిగుసుకొంటున్నాయి. పెరిగిన భారం చిరుబొజ్జగా తొంగి చూస్తున్నది. కళ్లు మరింత తీక్షణమైనాయి. నీలుని నిలువెల్లా పరీక్షించి చూశాయి.

నీలు అత్త, అమ్మలను చెరో ప్రక్కన నిలబెట్టి, పాపను బాబును, చెరొక చంకనెత్తుకొని, అతని పలుకు పలుకుకు హూంకరింపు..

నీలు నిలువెత్తు భయమై నిలబడిపోయింది.

అతని అందమైన చుబుకం ఇప్పుడు గరుకు గడ్డం మాటున దాగింది. అప్పుడే తొడిమ వీడుతోన్న పారిజాతాన్ని అందుకున్నంత పదిలంగా తనను ఆదరిస్తాడని అన్నాళ్లు ఎదురు చూసింది. అతని దుడుకు ధోరణి అందుకు భిన్నంగా ఉంది. సున్నితంగా స్పృశించగల నేర్పు, స్పందించగల ఓర్పు అతనిలో లేనేలేవు.

నీలుకి తన దాంపత్యం ఎలాంటి మైమరుపును కలిగించనే లేదు. మెరుపు కురిపించనూ లేదు.

మాటలు లేవు. స్నేహం లేదు. సరదాలు లేవు. సంతోషమూ లేదు. పిల్లల ముద్దు మాటలూ అతనిని ఎందుకో ఈమారు కదిలించలేదు. వారిని గడప బయటే నిలవేశాడు చిత్రంగా.

నీలును గదిలోనే!

పిడుగులు పిడిగుద్దుల్లా!

పల్లెత్తుమాట లేకుండానే, ఏదో తెలియని భయావహ వాతావరణం చుట్టూ ముసిరిపోయింది. దానికితోడు అతను వెళుతూ వెళుతూ.. ఆమె తల మీదుగా ఒక పలుచని ఉలిపిరి వల దించేసి పోయాడు.

ఇప్పుడు నీలు పూర్ణ యవ్వనవతి..

అందం ఆమె అణువణువునా సింగారమై తొణికిసలాడుతోంది. ఆమె దాంపత్యాన్ని, సాంసారిక జీవితాన్ని వాంఛిస్తోంది.

నిశ్చేష్టమై, నిశ్శబ్దంగా నీలు తన నిరాశను దిగమింగింది. తమ దాంపత్యం గురించి నీలులో మోసులెత్తిన చిన్న చిన్న కోరికలన్నీ మోడు వారిపోయాయి.

అతని రాకపోకలు నిజమో కలనో తెలియనంత సందిగ్ధం కలిగింది. వచ్చి వెళ్లడం అది మిగిల్చే నిస్పృహలోంచి, మళ్లీ తన లోకంలోకి మళ్లసాగింది. సరిగ్గా ఎప్పుడైనా అదాటుగా వచ్చే జ్ఞాపకంలా తెల్లారి పారిజాతాల చెట్టు మొదట్లో రాలిన వెన్నెల చుక్కల్లా.. నీలుకు నవ్వొచ్చేది.

ఆ పూల కోసం ఆ ఇంటి ముందుకు వచ్చేటప్పుడు, ఆ చెట్టే ఉన్న వారెంత అదృష్టమనుకొనేవారు కదూ తనూ వినత కాంచన!

ఆ చెట్టొకటి ఉన్నదన్న స్పృహ కూడా లేదు ఆ ఇంటిలో అడుగు పెట్టాక.

ఎప్పుడైనా పిల్లలు బంతాటో, కుంటాటో ఆడుతోంటే వారితోపాటూ ఆ కాంపౌండ్లో అటూ ఇటూ తిరిగేది. పిల్లలు బడికి వెళ్లేటప్పుడు, తలవాకిటదాకా వచ్చేది అప్పుడప్పుడు. అప్పటికే రాలిన పారిజాతాలన్నీ మట్టి కొట్టుకుపోయేవి.. దారిన పోయేవారు పోతూపోతూ తీసుకుపోయినవి తీసుకుపోగా మిగిలినవన్నీ..

పారిజాతం చెట్టంతా కాయలు కాసింది. పూత తగ్గిపోయింది. ఆకులు ముదిరిపోయాయి. పైనుంచి ఎవరో గుమ్మరించినట్లు దుమ్ము ఏదో పాడుబడ్డ భవనంలా చూడగానే వెనక్కి తగ్గేట్టు, కళావిహీనంగా ఉంది.

ఒకరోజు నీలు అత్తను అడిగి చూసింది.. గోడవారగా కాంపౌండ్ చుట్టూ పూలమొక్కలు నాటుతానని. అందులో అభ్యంతరమేమీ తోచలేదు.

అంతే, మల్లె, మందారం, కనకాంబరం, మరువం, గన్నేరు, బంతి, చేమంతి- అడిగిన మొక్కల్లా తెప్పించారు.

విత్తనాలు, దుంపలు, నారు.. ఏవి అడిగితే అవి.

నీలు ఇలా పనిలో పడడం అందరికీ బావుంది. తీరా పారిజాతం చెట్టు దుమ్ము తొలిగేలా నీళ్లు గుమ్మరిస్తే ఎండుటాకులతో పండుటాకులు, వీటితోపాటు కొట్టుకు వచ్చిన పురుగులు.. పైనుంచి చెట్టంతా చీడ, మొదలంటా కత్తిరించి, ఎండుకొమ్మలు రెమ్మలు తొలగించి, పాదుచేసి మళ్లీ నీరు పట్టింది.

కొత్తగా నాటిన మొక్కలతో పోటీపడుతూ పారిజాతం ముదురు కాండంపై చిలుకాకుపచ్చగా గరుకు చిగురేసింది నవనవలాడుతూ.

చిగురేసి, ఆకేసి మొగ్గ తొడిగింది చూస్తుండగానే.

నీలు ఎంతో విస్మయంతో ఆ మార్పును చూస్తూ ఉండేది. ఆమెతోపాటే పిల్లలూ.

మొదట పారిజాతం మొగ్గ విచ్చుకొన్న రోజున నీలు సంబరం ఇంతింతని కాదు. పసిపిల్లైపోయింది. ఆకుల చాటున అణిగి మణిగి ఉండే ఆ పారిజాతపు చిట్టిమొగ్గలు వెన్నెలనంతా తమలో నింపుకొని విరబూయసాగాయి. కమ్మని పరిమళంతో బాటు గమ్మత్తయిన పారవశ్యం నీలుని ఆవరించసాగింది.

క్రమం తప్పకుండా తెల్లవారకమునుపే తలవాకిట చేరి, ఆ లేత వెలుగులో నానుతూ, రాలే పూలన్నీ తన దోసిట్లో పట్టుకొనేది పదిలంగా.

పిల్లలిద్దరూ తమ చిన్న దోసిళ్లతో నీలు వొడిలో పూలను నింపేవారు. నీలు ఆ పూలన్నిటినీ ఓ గాజు గిన్నెలో పెట్టుకొని తన గదిలో ఉంచేది.

ఇన్నేళ్లుగా ఇవన్నీ ఎలా మరిచిపోయిం

దని తనకై తను ఆశ్చర్యపోయేది.

ఈ అపురూప అనుభవం ఆమెలో నిద్రాణంగా ఉన్న మధురభావనలన్నిటినీ సున్నితపరిచాయి. ఆ పలుచటి పరిమళాలు తెల్లవారుజాముకల్లా ఆమెతోపాటు మేలుకొనేవి. ఆమెతోనే రోజంతా గడిపేవి. తెలియని ఆనందం ఆమె చుట్టూ.

ఇంట్లో అందరూ నీలు మొక్కల పనికి అలవాటు పడ్డారు. ఔనన్నా కాదన్నా వాకిలి కళకళలాడుతోంది. ఇంటికి వచ్చేపోయేవారు మెచ్చుకోకుండా ఉండలేకపోతున్నారు. దానికితోడు ఆయా సమయాల్లో విచ్చుకొనే పూలు శ్రద్ధగా అలంకరించిన పుష్పగుచ్ఛాల్లా తీర్చిదిద్దిన రంగవల్లుల్లా ముచ్చట గొలుపుతున్నాయి.

ఎప్పటిలాగానే, ఆ రోజూ నీలు తెల్లవారుఝామున పారిజాతాలు సేకరిస్తోంది. పిల్లలింకా లేవలేదు. లేకుంటే నీలునే ముందు లేచిందో. ఒక్కో పూవును ఎంతో అపురూపంగా, నెమ్మదిగా తన కొంగులో వేసుకొంటోంది. ఇంతలో ఆమె దృష్టిని మరొక చేయి ఆకర్షించింది.

సరిగ్గా మూసిన గేటుకు అటువైపున వంగుతూ లేస్తూ ఒక్కో పూవును పదిలంగా అరచేతిలో పెట్టుకొంటున్నారెవరో.

నీలు గేటు సందులోంచి కుతూహలంగా చూసింది. తనకన్నా ఎక్కువే సేకరించారు! అంటే, ఆ వైపున చెట్టు విరగబూస్తున్నదన్న మాట!

ఎప్పటినుంచి వారలా పూలను సేకరిస్తున్నారో కానీ, ఈ పూటే నీలు చూడడం.

ఇక ప్రతిపూటా గమనించసాగింది. ఒక చిన్న పిల్లలో ఉండే ఉత్సాహంతో ఎవరికెక్కువ పూలన్నట్లు.

అవతలి వారెవరో చూడాలన్న కుతూహలం ఎప్పుడు ఎలా మొదలయ్యిందో తెలియదు కానీ, అంతకంతకూ పెరిగి అంతరంగమంతా ఆక్రమించింది.

చివరికా రోజు, ఎప్పటికన్నా, ఒక అడుగు ముందే అక్కడికి చేరుకొంది. గేటు వాలున వీధిలోకి చూపు సారించింది. అక్కడ ఎవరూ లేరు.

అడుగుల శబ్దం వినబడుతుందేమోనని చెవులు రిక్కించింది. ఆ అలికిడే లేదు. రెండు గేట్లను గొలుసుతో ముడివేస్తూ తాటికాయంత తాళం వేళ్ళాడుతోంది.

నీలు మెల్లిగా గేట్లను నెట్టి చూసింది. కిర్రుమంది.

'ఇంట్లో వారెవరన్నా లేచి వస్తే?' నీలు గబుక్కున కొంగును తల మీదికి లాక్కుంది.

## కొత్తగాలి...

**చెట్టుకింద జ్ఞానోదయం బుద్ధునికి**
**చెట్టుకింద ఆలోచన ఓ శాస్త్రవేత్తకి**
**ఆ చెట్టునే నరికివేయాలని ఓ మనిషికి**

– ఆకుల వెంకటగోపి,
సంగం జాగర్లమూడి, గుంటూరు జిల్లా

తలవాల్చుకొనే ఇంకా రాలీరాలని పూల వంక నిదానంగా చూసింది. ఏదో తెలియని ఉత్సాహం మునుపటి భయాలన్నిటినీ నెట్టేసింది. మరింత చురుగ్గా పూలను సేకరించసాగింది. గేటు సందుల్లోంచి బయటకు చూసింది. అప్పటికే అవతలి వ్యక్తి పూవులేరుతున్నాడు, మెత్తగా వంగి లేస్తూ. అతనితోపాటే అతని గంజిపెట్టిన ఖాకీ నిక్కరూ వంగి లేస్తోంది. బలిష్ఠమైన కాళ్లు. నిత్యం వ్యాయామం చేసేట్టుగా ఉన్న దృఢమైన పిక్కలు. బలమైన పాదాల అడుగులు. ఒక పొడవాటి కర్రను ఒడుపుగా పట్టుకొని, విల్లులా వంగి లేస్తూ పూలను సేకరిస్తున్నాడతను.

నీలు ఆసక్తి మరింత పెరిగిపోయింది. అటు కొట్టడానికి సిద్ధం అంటున్న కర్ర, ఇటు అపురూపంగా సేకరిస్తున్న పారిజాతాలు. నీలు మరింత కుతూహలంగా, మరింత దగ్గరిగా అతని కదలికల్ని గమనించసాగింది.

ప్రతిరోజు ఇదొక రంచను కార్యక్రమం అయిపోయింది. సూర్యుడైనా ఆలస్యం చేస్తాడేమో కానీ, అతను మాత్రం ఏనాడూ వేళతప్పలేదు.

నీలుకి ఇక రోజులెలా గడిచాయో తెలియలేదు.

కార్తీక మాసం చలితోబాటు, అతని కోసం నీలు ఎదురుచూపులు ముదిరిపోయాయి. తను అతనిని గమనిస్తోన్న విషయం అతనికి తెలుసేమోనన్న సందేహం నీలుకు వచ్చింది ఒకమారు.

నిజమే, తనను కూడా తన భర్త మొదటిసారి ఇలాగే చూసి ఉంటాడు. అలా ఎంత కాలంగా చూశాడో!

ఆ ఆలోచనతో బాటు పాదం నుంచి పైదాకా పాకిన అతని బలిష్ఠమైన చేయి, అది తనలో కలిగించిన జలదరింపు మరొకమారు నీలును ముంచివేశాయి. నీలు భయంతో వణికిపోయింది. ఆ భయం ఎంతలా వెంటాడిందంటే, ఆ చోటికి మరొక నాలుగు రోజులు వెళ్లడానికే వెనకాడింది.

చివరికా రోజు, గేటు సందుల్లోంచి చూడనా? వద్దా? అనుకొంటూ వాలుచూపులు చూస్తున్నప్పుడు, అవతలి వైపు మెల్లిగా గొంతు సవరించుకొన్న శబ్దం. అతనికి సమాధానమా అన్నట్లు, నీలు అప్రయత్నంగా గొంతు సవరించుకొంది.

ఏదో చెప్పబోయినట్లు అతను..

ఏదో చెప్పదలుచుకొన్నట్లు ఆమె..

నీలు తనకు తెలియకుండానే, గేటు



సందులోంచి పూల పిడికిలిని చాచింది. అరచేతిలో విరిసిన పారిజాతాలు అతను అపురూపంగా అందుకొన్నాడు.

అతని కొనగోటి మీటు నీలు అరచేతిని గోరింటలు పూయించింది. మరొకమారు పారిజాతం ఆమె లోలోన పరిమళించసాగింది. పెదవుల చివరన చిరునవ్వుల దొంతరలు, కనుకొలుకుల్లో కలల పూదోటలు జాలువార సాగాయి. తెలియని వెలుగులు ఆమెలో నుంచి ముఖాన ప్రతి



ఫలించ సాగాయి.

పిల్లలను మరింత చేరువ చేసుకొంది.

పూలకాలం సాగుతోంది. నీలు ఎప్పుడు పరధ్యానంలో పడిందో, తనకే తెలియదు. నీలు పరధ్యాస అంతకంతకూ అందరి దృష్టిలో పడింది. చర్చల్లో భాగమైంది.

ఒకరోజు నీలు పాత పత్రికలన్నీ పోగేసి, పిల్లలతో కాగితం పడవలు చేయిస్తోంది. గాలిపటం కూడా చేయాలని వారందరి ప్రయత్నం.

వీళ్లకు దూరంగా, ఆ ఇంటి పెద్దలంతా మాటామంతికి దిగారు. వీధిలోని పిన్నా పెద్ద కొందరు జమయ్యారు.

"ఒక్కో ఇంటినుంచి ఒక ఇటుక వెళుతుందట!"

"మీకు తెలుసో లేదో.. ఆ రథానికి బొమ్మలేసింది రంగులద్దిందీ, కటౌట్లు తయారు చేసిందీ.. మన వూరివాళ్లేనట!"

"ఆకలేస్తే ఎవరైనా వేస్తారు!" ఒక పెద్దాయన గొణిగాడు.

"అయినా, వాళ్ల పవిత్ర మందిరాలను, పెళ్లి మండపాలను" అలంకరించేది మన వాళ్లే కదా? ఆ అందాల పూలమాలలన్నీ గుచ్చేది ఎవరు? ప్రభలను కట్టేది ఎవరు? ఊరేగింపులకు అటూ ఇటూ తలలమీద పెట్రోమాక్స్ లైట్లు మోసేదెవరు? ఆ విరాట్ స్వరూపాలనూ తీర్చిదిద్దేది ఎవరు? అంతదాకా ఎందుకూ.. నేను నా జీవితమంతా చేసింది ఆ డిస్కో డెకరేషను, రంగురంగుల లైట్ల సెట్టింగ్ల పనే కదా? నన్నెవరూ అడగలేదే? "

"ఊరుకో పెద్దాయనా..! ఇది అలాంటి ఇలాంటి ఆకలి కాదు! అందరినీ పొట్టన

## కొత్తగాలి...

**తలెత్తుకుని**
**తిరగాలంటే**
**తల దించుకునే**
**పని చెయ్యకు**

– బద్ది నాగేశ్వరరావు,
అనకాపల్లి

పెట్టుకొంటుంది? "

"చూస్తూ ఊరుకొందామా? "

"ఊరుకోక ఏం చేద్దామని? "

అందరూ నిశ్శబ్దమయ్యారు.

"మన బొంబాయి బంధువులు ఏమంటున్నారు? "

"పరిస్థితులేమీ బాగున్నట్లు లేవు. వీళ్ళకీ అవకాశం రావాలి కదా? యువకులంతా ఉడుకుమీదున్నారు. వాళ్ళు కనబడితే చాలు కాలరెత్తి విరుచుకు పడుతున్నారు!"

"వాళ్ళు అంతేలే. మనవాళ్ళు కనబడగానే, కర్ర తాటిస్తున్నారు"

"మీరు మాత్రం తక్కువా? "

"ఆ ముద్దపప్పుగాళ్ళు.. లంగోటీసాలే.." ఒక యువకుడు కూర్చున్న చోటినుంచి ఆవేశంగా లేవబోయాడు.

"ఇదుగో ఇలాంటి ఆవేశకావేశాలే వద్దనేది.."

"మనమేం చేయాలి? "

"మనపని మనం చేసుకుపోవాలి"

అందరు మళ్ళీ మౌనం. "వాళ్ళు వాళ్ళు చూసుకొంటారు. మధ్యలో మనం ఎందుకిలా..? " పెద్దాయన గొంతు వణికింది.

"కాలం మారుతోంది బాబా, మనమూ మారాలి. కాలంతోబాటు పోవాలి!"

"కాలంతో బాటు పోవడమంటే.. ఇలాగా.." పెద్దాయన కంఠం రుద్ధమైంది.

ఇంతలో అందరి సంభాషణ దేశం మీది నుంచి నీలువైపు మళ్ళింది. ఇది నీలు అత్త నిర్వాకం.

"నీలు ఈ మధ్య పరధ్యానంగా ఉంటోంది. పిల్లాడికి జబ్బు చేసినప్పటి నుంచీ మనిషి మనిషిలో లేదు. వాడేమో వెళ్ళినవాడు వెళ్ళినట్లే.."

"నిజమే, ఈ ఏడాది పండగక్కన్నా వస్తాడా? "

"అక్కడి మహారాణి పంపొద్దూ? "

కిసుక్కున నవ్వారందరూ.

నీలు అక్కడే ఉన్నట్లు సైగ చేశారెవరో. "ష్!" మరొకరు పెదవుల మీద చూపుడు వేలు తాటించారు.

అత్త ఆరాగా నీలు గదివైపు చూసింది. అక్కడ పిల్లల అలికిడి తప్ప మరో శబ్దం లేదు.

"ఏది ఏమైనా, నీలుని కొంత పనిలో పెట్టాలి. ఇప్పుడు మన ఆడవాళ్ళు కూడా పనిపాటలు నేరుస్తున్నారు. బ్యూటీపార్లరో.. బడిలో అయ్యవారమ్మల్లానో.. ఏదో ఒకటి.."

"మన పక్కవీధిలో మన డాక్టరమ్మ

ప్రాక్టీసు పెట్టలా..? మనమూ ఆలోచించాలి. నీలుని ఏదో ఒక పనిలో పెట్టాలి" పెద్దాయన తన దీర్ఘభాషణను ముక్తాయించాడు.

"చదివింది పదోతరగతి. పరీక్షయినా రాయించలేదు. ఇక బడిలో పాఠాలేం చెబుతుంది? "

అందరూ ఆలోచనలో పడ్డారు.

ఇంతలో పిల్లలు కేరింతలు కొడుతూ, నీలు గదిలోంచి వంటింటివైపు పరిగెత్తారు.

తలా ఒక పళ్ళెమో, గ్లాసునో, పెద్దగిన్నెనో తీసుకొని నీళ్ళతో నింపారు. కాగితం పడవలు వదిలారు. అరుపులు, కేకలు. పిల్లలు అటూ ఇటూ పరుగులు పెడుతుంటే, నీలు తన గది తెరలమాటున నిలబడిపోయింది.

"పిల్లలూ బయటకెళ్ళి ఆడుకోండిరా.. ఇక్కడ అల్లరి చేయకూడదు.." పిల్లలను గద్దించిన అవ్వ సాలోచనగా ఆగింది.

ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా నీలు అత్త అంది. "పిల్లలందరినీ కాసేపు ఆడించే పనయితే హాయిగా చేస్తుంది!"

"ఒకపని చేయొచ్చు" ఒక యువకుడు టక్కున అన్నాడు, "బేబీ క్రష్ మొదలుపెట్టొచ్చు. కాలక్షేపానికి కాలక్షేపం.. కాస్త ఆదాయం కూడాను.."

అందరూ కాస్త ముందూ వెనగ్గా తలాడించారు.

"వాడేమంటాడో..? అతన్ని అడిగి చూద్దాం" నీలు అత్త గొణిగింది.

"మారుతున్న కాలంతోబాటూ మారడమంటే ఇదే. వాళ్ళను చూడండి. ఎక్కడ చూసినా వాళ్ళే. ఏ పనైనా ఇట్టే చేసేస్తారు. మనమూ చేయాలి. నలుగురితో కలిస్తేనేగా మంచీ చెడూ తెలిసేది? " పెద్దాయన గట్టిగా వత్తాసు పలికాడు.

అతను వెంటనే అంగీకరించాడు.. నీలు అత్త ఆ మాట అడిగిందో లేదో.



## జాషువా చతురోక్తులు



ఆధునిక పద్యకవుల్లో సామాజిక సమస్యలపై గొప్ప కవితలు రాసిన మహోన్నత కవి జాషువా. ఆయన అడుగడుగునా వివక్షను ఎదుర్కొన్నప్పటికీ దీటుగా ప్రత్యర్థుల నోళ్లు మూయించేవారు. ఆయన చెప్పిన చతురోక్తులు కొన్ని..

### ఔను, నీవన్నది నిజం!

**ఓ**సారి జాషువాకు మరో ప్రముఖ కవికి కలిపి ఓ సాహితీ బహుమతిని ప్రదానం చేశారు. జాషువా అంటే అంతగా పడని ఆ కవి, 'గుర్రాన్నీ, గాడిదనీ ఒకే గాట కట్టేశారు' అని అక్కసు వెళ్లగక్కాడు.

అప్పుడు అది విన్న జాషువా, 'ఔను, నిజమే.. ఈ ఒక్కసారికి మాత్రం నేను ఆయనతో ఏకీభవించకుండా ఉండలేకపోతున్నాను' అన్నారు.

పై నుంచి ఒక వీడీయో క్యాసెట్టు పంపాడు, పెట్టుబడితో బాటు. ఆ మాదిరిగా తమ ఇంటి ముందు హాలు అలంకరించుకొని, బొమ్మలతో ఆట వస్తువులతో నింపమని.

అలా అనుకోకుండా నీలు పనిమంతురాలయ్యింది.

వారింటి గేటు గొలుసులు కొద్దిగా తీస్తే బాగుండునని నీలు అనుకోలేదా, ఇప్పుడు ఏకంగా అవి తొలగించబడ్డాయి.

ఆవరణంతా ఉయ్యాలలు, జారుబండలు, ఊగుడు గుర్రాలు, సీసా బల్లలతో.. పిల్లల ఆటమైదానంలా అందంగా అమిరింది. ఇక గోడవారగా పూలమొక్కలు

సరేసరి.

నీలు అత్త తిన్నగా వెళ్లి డాక్టరుగారినీ, ఆయన సతీమణిని ముఖ్య అతిథులుగా ఆహ్వానించి వచ్చింది. రిబ్బను కత్తిరించి ప్రారంభించను.

ఎంతైనా నీలు అత్తది ముందుచూపు. అక్కడ చేరిన పిల్లలు దగ్గినా తుమ్మినా ఒక డాక్టరంటూ ఉండాలిగా.

నీలుకి ఇదంతా కలో మాయో అర్థం కావడం లేదు. ఉత్సాహంలో అసలు తలా తోకా తెలియడం లేదు. వినత, మిగిలిన వాళ్లంతా వచ్చారు. పిల్లలను వదలడానికి వచ్చే అమ్మలు నీలుతో మాట్లాడుతున్నారు. ఆ చిన్న చిన్న సంభాషణలు నీలుని ఇట్టే ఆరిందాను చేసేశాయి. పిల్లల కబుర్లతో బాటు, కొత్త సినిమాలు, ఫ్యాషన్లు, బొమ్మలు, పుస్తకాలు.. ఇంతలో ఎంత మార్పో.. నీలుకి నమ్మశక్యం కావడం లేదు.

ఈ హడావుడిలో పడి పారిజాతాల మాటే మరిచింది. ఒక తెల్లవారు ఝామున అదాటుగా జ్ఞాపకం వచ్చి, లేచిందే పరుగన్నట్లు, తలవాకిట వైపు ఉరుకులు పెట్టింది.

లోపలి వైపున రాలిన పూలు రాలినట్లే, చెట్టు మొదట్లో పోగు పెట్టి ఉన్నాయి.

బయటివైపు పూల సంగతి తెలియదు.

నీలు మెల్లిగా గేటు నెట్టి చూసింది. అది నిశ్శబ్దంగా తెరుచుకొంది.

బయటవైపు గోడమీద పారిజాతం చెట్టును వెనక్కి నెట్టి, ఒక పెద్ద బోర్డు పెట్టి ఉంది. నీలు కళ్ళు ఇంతింత చేసుకొని విడ్డూరంగా చూస్తూ నిల్చుంది.

"పూలన్నీ మీకేనా? " ఎవరో భుజం మీదుగా అడిగారు.

నీలు ఉలిక్కిపడింది.

అతను

అదే నిక్కరు, చేతిలో కర్ర, తలపై టోపీ నవ్వుతూ నిల్చుని..

నీలు తల వేలాడేసి, ఒక్క పరుగులో లోపలికి వెళ్ళింది.

అతను వెనకే వచ్చాడు.

నీలు గబుక్కున తలుపేసుకొంది.

అతను తలుపు తట్టాడు.

నీలు ప్రాణాలు పైనే పోయాయి. "ఇంకేమైనా ఉందా? "

నీలు ప్రాణాలు ఉగ్గబెట్టుకొని లోపలి గదిలోకి వెళ్ళిపోయింది. అతను బయట తలుపు తడుతూనే ఉన్నాడు.

ఎవరో వెళ్ళి తలుపు తీశారు. అతను మాట్లాడాడు.

"పాపను ఇక్కడ చేర్పించాలని.."

"తొమ్మిదింటికి రండి"

తొమ్మిదింటికి అతను మళ్ళీ వచ్చాడు. ఒక పసిపాప వేలు పట్టుకొని. నీలు అతని సాహసానికి విస్మయురాలైంది.

ఇక, ఆ పూటనుంచి అతని రాకపోకలన్నీ సింహద్వారం నుంచే.

ఒక్కమాట మాట్లాడేవాడు కాదు. ఆ నిశ్శబ్దమే, పారిజాతపు పలుచని పరిమళంలా వారిద్దరి నడుమా విస్తరించసాగింది.

అతని కోసం చూడడం నీలుకి నిత్యకృత్యమైపోయింది. నిత్య మల్లిక అయింది.

పారిజాతాల సౌరభం నిలువెల్లా నిండిపోసాగింది.

ఈ విషయాన్ని త్వరలోనే చూడవలసిన వారు చూడనే చూశారు.

ఊరు వూరంతా మెల్లిమెల్లిగా అల్లుకొంటొన్న కేబులు తెరలమీద. తమ తమ ఇళ్ళల్లో తాపీగా కూర్చుని.. ఏ పకోడీలో, జీడిపప్పు పలుకులో పటుకు పటుకుమని పిస్తూ..

ఇదంతా నీలుకి తెలియనే తెలియదు.

నవరాత్రి ఉత్సవాల్లో నలుగురితోబాటు, నవ్వుతూ తిరిగిన విషయం వాస్తవమే.

# వాగ్గేయకారుడిపై నిష్ఠీవనం

నిన్నటి నిజం

కర్నాటక సంగీత వాగ్గేయకారుడు మైసూరు వాసుదేవాచార్య తిరువయ్యూరులో సంగీతం అభ్యసిస్తున్న రోజులవి. అదే ఊరిలోని ఫిడేలు విద్వాంసుడు తిరుక్కోడికావల్ కృష్ణయ్యర్‌తో ఆయనకు పరిచయం ఏర్పడింది. తన ఇంటికి ఏ వేళలోనైనా రావచ్చునని వాసుదేవాచార్యకు ఆయన అనుమతినిచ్చారు. సంగీత సాధనవేళ ఆయన ఫిడేలునుంచి జాలువారే అమృతాన్ని జుర్రుకోవాలనే అభిలాష ఆచార్యది.



ఓరాత్రి అచార్యులు ఊరంతా నిద్రపోయాక కృష్ణయ్యర్ ఇల్లు సమీపించారు. అంతా నిశ్శబ్దం. అయితే ఓ గది కిటికీకి తలుపులు మూసివున్నాయి. లోపలి నుంచి మంద్రంగా సంగీతం విన్పిస్తోంది. కాంభోజి రాగంలోని 'ఏరా నాతో చలము చేసేవురా శ్రీకృష్ణా' అనే పల్లవిని అయ్యర్ వాయిస్తుంటే మైమరచిపోయి ఆలకిస్తూ ఆచార్యులు అక్కడే కూర్చుండిపోయారు. ఇంతలో అకస్మాత్తుగా అయ్యర్ సాధన నిలిచిపోయింది. దీంతో ఆచార్యులు మేల్కొన్నారు. ఇక అక్కడ ఉండడం భావ్యంకాదని తలచి ఆచార్యులు కిటికీ వద్ద నుంచి కదలబోయారు. అంతలో తలుపులు తెరుచుకోవడం, అయ్యర్ ఊసిన తాంబూలం ఆచార్యుల నెత్తిపైన పడటం జరిగిపోయాయి. దాన్ని విదిలించుకునేందుకు లేచి నిలబడ్డ ఆచార్యుల్ని చూసి అయ్యర్ వెంటనే పరుగున బయటకు వచ్చి 'అయ్యయ్యో పొరపాటు! నన్ను క్షమించండి' అంటూ ఆయనను లోపలకు తీసుకెళ్లారు.

'మా ఇంటికి మీరెప్పుడైనా రావచ్చని అనుమతినిచ్చాను కదా?' అన్నారు అయ్యర్ బాధతో.

'జన్మాంతర పుణ్యఫలం! ఈ రోజిలా శారదామాత అనుగ్రహం కలిగింది. నేనెంత అదృష్టవంతుణ్ణి!' అన్నారు ఆచార్యులు.

ఆచార్యుల తలను శుభ్రపరచి ఉచితాసనంలో కూర్చుండబెట్టి ఇందాకటి సాధననే అయ్యర్ కొనసాగించారు. ఇద్దరికిద్దరూ నాద ప్రవాహంలో మునిగితేలారు. తెల్లవారి సూర్య కిరణాలు ఫిడేలు మీద పడిన తర్వాతనే వారు ఈ లోకంలోకి వచ్చారు.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

నిజమే, వాళ్ళెవరూ ఇటువైపు అడుగుపెట్టరు. ఇక్కడ జరిగే విశేషాలు తెలియవు.

అంగరంగ వైభోగంగా జరిగే అమ్మవారి నవరాత్రి సంబరాల్లో, రంగురంగుల అలంకరణలూ, ధూపనైవేద్యాలు, అష్టైశ్వర్య ప్రదర్శనలూ.. వాళ్ళు ఊహించనైనా ఊహించలేరు.

అందుకే అతను ఆమెను అక్కడికి తీసుకెళ్ళాడు. అభిషేకాలు, పూజలు పునస్కారాలు ఆమె చేతుల మీదుగా, ఏ లోటూ లేకుండా జరిపించాడు. తీర్థప్రసాదాలు ఇప్పించాడు.

తన చేతుల్తో నిండారా అలంకరించి, తలనిండా పూలు తురిమి, ముత్తైదువులా పసుపు కుంకుమ గంధాలతో పాటు, నగలూ నాణ్యాలతో ఆమెను సర్వభూషణాలంకృతను చేశాడు. ఎర్రటి ఎరుపు పట్టు చీరలో, చేతులనిండా ఎర్ర గాజులతో అచ్చం ఆ అమ్మవారే నడిచి వచ్చినట్లుగా ఉంది నీలు.

అక్కడే ఉన్న కేబుల్ వీడియో గ్రాఫర్తో అతను ఎప్పుడు మాట్లాడాడేమో కానీ, అతను నీలును తన వీడియోలో బంధించాడు. దానిని నీలుకి వేసి చూపించాడు.. అతను తమ రహస్య మందిరమైన వూరి చివరి ఒక అపార్ట్‌మెంటులో.

తన రూపాన్ని చూసి తనే నిశ్చేష్టురాల య్యింది నీలు.

"ఇప్పుడే తొడిమ వీడిన పారిజాతంలా ఉన్నావు నీవు!" అతని గొంతు లోతుగా పలికింది "పారిజాతాలను మదరాసీలు ఏమంటారో తెలుసా? పవళమల్లిగె. అంటే, పగడాల మల్లి. నువ్వే నా పగడాల మల్లి" అని గొంతు తడితడిగా గుసగుసలా డింది. అతని చూపులు నీలు ముఖాన్ని తడిమి, పెదవుల మీదుగా సాగి, మెడవం పుపై ఆగాయి.

అప్రయత్నంగా తన మెడ వంపులో అంటిన అతని నుదుటి సిందూరాన్ని మునివేళ్ళతో తుడిచివేసింది. అరక్షణం ఆలస్యం చేయకుండా అతను ఆమె తను వంతా సిందూరభరితం చేశాడు.

అక్కడ పట్టపగలే పారిజాతవనం పరి మళించింది. పారవశ్యం ముంచెత్తింది.

నీలు కళకళాడుతున్న పూలచెట్టే అయింది.

నీలు ఆ తమకంలో పడిపోయింది. తన సాహసానికి తానే తన్మయురాలైంది.

తేరుకొనేలోగానే జరగవలసిందంతా జరి గిపోయింది.

చూడవలసినవారు చూడనే చూశారు.

మెల్లిమెల్లిగా వాళ్లలో ఒక విషయం చాపకింద నీరులా పాకిపోయింది. నెమ్మ దిగా ఒక సంగతి నిర్ధారణ అయిపో యింది. నిస్సందేహంగా అది అమలవ్వబో తున్నట్లు అందరికీ అర్థమైపోయింది.

నీలుకి కాలం చెల్లబోతోంది!

డాక్టరు భార్య బాబునో భుజాన, సంచు లు చేత్తో పట్టుకొని, భారంగా ఇంటికెళ్లే మెట్ల దగ్గరికి వచ్చింది.

ఊపిరి పీల్చుకొని, సంచులు మొదటి మెట్టుమీద నిలిపి, బాబును భుజాన సరి చేసుకోబోతూండగా, అక్కడ తడబడుతూ, తటపటాయిస్తూ గోడవారగా నిల్చున్న పెద్దామె ఒకరు ఆమె కంటపడింది.

తనమీద చూపు నిలపగానే, పెద్దామె గబుక్కున అంది, "వినత కోసం వచ్చా నమ్మా"

"వినత ఇప్పుడు ఇక్కడ లేదు. పైచదు వులకు వెళ్ళింది"

"మా కోడలు వినత స్నేహితురాలు"

ఆమె బాబును భుజం మార్చుకొంటూ, అవునా అన్నట్లు తలాడించి, ఇక వస్తాన న్నట్లు తలూపేసి, మౌనంగా మెట్లెక్కసా గింది.

"పోనీ, మీతో మాట్లాడేనా? "

మెట్లెక్కుతున్నావిడ, ఆశ్చర్యంతో ఆగి వెనక్కి చూసింది.. "ఏ విషయం? "

"ఒక్క.. పది నిమిషాలు!"

ఆమె కాస్త వింతపడి, మాట్లాడకుండా, మరో మెట్టెక్కింది.

"ఎక్కువ సమయం తీసుకోను!"

ఆమె పెద్దావిడను తేరిపార చూసింది. ఆమె ముఖంలో ఏం కనబడిందో కానీ, "రండి" అంటూ ముందుకెళ్ళింది.

పెద్దామెను కూర్చోబెట్టి, బాబును పడుకో బెట్టి, ఏ విషయమై ఉంటుందబ్బా అని ఆలోచిస్తూ, ఆమె వచ్చి కూర్చుంది.

పెద్దామె ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా అంది "నీలు చిన్నపిల్ల. నిలువునా చీరే

## కొత్తగాలి...

**లంచం**
**పిల్లాడికైతే**
**చాక్లెట్టు**
**పెద్దోడికైతే**
**చవర్లెట్టు**

– ***గుడిమెట్ల గోపాలకృష్ణ***, అరసవిల్లి

# నో బెల్‌బాటమ్స్ ప్లీజ్




బెల్‌బాటమ్స్ ప్యాంట్లను వాస్తవానికి 1817లో నావికుల కోసం కనిపెట్టారు. ప్రమాదాలు సంభవించినప్పుడు ఓడలోంచి బయటకి వెళ్లే ముందు వర్క్‌పేంట్‌ని విప్పి, వేగంగా కొత్తవి ధరించడానికి వీలుగా బెల్‌బాటమ్స్‌ను రూపొందించారు. అయితే వీటికి మొదట్లో ప్రపంచంలో పెద్దగా ప్రాచుర్యం లభించలేదు. 1960లలో యూరప్‌లో బెల్‌బాటమ్స్ స్త్రీపురుషులకు ఫేషన్ అయ్యాయి. మోకాలి కిందిభాగం పైభాగం కంటే వెడల్పుగా ఉండటమే బెల్ బాటమ్ ప్రత్యేకత. మగవాళ్ళ బెల్‌బాటమ్‌కి మోకాళ్ళ వద్ద పేంటు వదులుగా ఉంటే, ఆడవారికి అక్కడ కాస్త టైట్‌గా ఉంటుంది. మొదట యూరప్‌లో, తర్వాత అమెరికాలో దీన్ని ఆఫీస్‌కి వేసుకెళ్ళేందుకు అనుమతించారు. అయితే 'ది ఎన్‌సైక్లోపిడియా ఆఫ్ బ్యాడ్ టేస్ట్' ప్రకారం ఇది చెడ్డ ఫేషన్. 1977లో న్యూయార్క్‌లోని ఫోర్‌స్టార్ ఫ్రెంచ్ రెస్టారెంట్ బయట 'నో బెల్ బాటమ్స్ ప్లీజ్' అని బోర్డు తగిలించారు. కిందిభాగంలో బెల్‌బాటమ్స్ అటు ఇటు కదలడంవల్ల చాలామందికి అవి ఇష్టం ఉండదు. అనేక రకాల ఫేషన్ల లాగానే అవి కూడా దీర్ఘకాలం మనలేకపోయాయి. భారతదేశంలో కూడా వీటికి పెద్దగా ఆదరణ లభించలేదు. 1970లలో విడుదలైన మన సినిమాల్లో హీరోలు వాటిని ధరించేవారు. ఈనాడు ఆ సినిమాల్లోని బెల్స్‌ని చూసి ప్రేక్షకులు నవ్వుకోవడం సర్వసాధారణం.




బెల్‌బాటమ్స్ ఫ్రెంచ్ దేశంలోనే మొదట ఫేషన్‌గా మారినా అక్కడే దానికి సరైన ఆదరణ లభించలేదు. దాన్ని వారు 'జోకర్స్ పేంట్' అని హేళనగా పిలిచేవారు. టైట్‌పేంట్‌కి బెల్‌బాటమ్స్ తల్లిలాంటిది. బెల్‌బాటమ్ ఆలోచనని కాస్త రివర్స్ చేసి, టైట్‌పేంట్‌ని రూపొందించారు.

స్తారు!"

"మీరంటున్నది నాకు అర్థం కావడం లేదు!" పెద్దామె ఉద్వేగానికి అడ్డుపుల్ల వేసింది.

పెద్దామె విషయమంతా వివరించి మౌనంగా కూర్చుంది.

ఎలా స్పందించాలో తెలియక శ్రోత కూడా మౌనం వహించింది. కాసేపు అయ్యాక మెల్లిగా అడిగింది. "చెప్పి చూడకపోయారా? "

"చెప్పవలసినవాళ్లే చెప్పాలి కదమ్మా? ఇది సున్నితమైన విషయం. బయటకు పొక్కితే నానా రభస. అటు జెండా వీధి, ఇటు మండపాల వీధి. వూరంతా వల్లకాడవుతుంది. గుట్టుగా సర్దుకుపోతే మంచిది ఎవరికి వాళ్లం. ఇప్పటివరకు వాళ్లతో వీళ్లతో ఎలాంటి పేచీలు లేవు"

"మేమేం చేయగలం? "

"నిండు ప్రాణం.. అమాయకురాలు.. ఇద్దరు పిల్లలు.."

ఆమె గొంతు బొంగురుపోయింది. "పిల్లల గురించైనా ఆలోచించలేదా పిచ్చి పిల్ల!"

డాక్టరు భార్య మౌనంగా వింటోంది.

"పిల్లాడికి జబ్బు తగ్గించినప్పటి నుంచి, నీలుకి డాక్టరుగారి మీద ఎక్కడలేని గురి. వారొకసారి మాట్లాడితే.." పెద్దామె మాటలు మింగేసింది.

డాక్టరు భార్య చివ్వున తలెత్తింది.

"ఇది మీ ఇంటి విషయం. చాలా సున్నితమైందని మీరేగా అన్నారు.."

ఆమె అర్థాంతరంగా ఆగింది.

పెద్దామె చాలాసేపు మౌనంగా ఉండిపోయింది.

"అతను కూడా డాక్టరుగారికి తెలుసు. మరదలికి ఉబ్బసం. ఆమెను తీసుకొని, ఆయన భార్య డాక్టరు దగ్గరకు వస్తూనే ఉంటుంది"

"అతనికి పెళ్లయిందా? "

"ఇద్దరు పిల్లలు"

"పోనీ.." అవ్వ కాసేపు ఆలోచించి సందేహిస్తూ అంది. "పోనీ ఇలాంటి తప్పుడు కోర్కెలు లేకుండా పోవడానికి, డాక్టరుగారిచేత నీలుకి ఏదన్నా మందిప్పించమ్మా.. అవిచ్చి, మూడో కంటికి తెలియకుండా మనిషిని అదుపులో పెట్టొచ్చు!"

డాక్టరు భార్య దిగ్గున లేచి నిల్చుంది.

## కొత్తగాలి... 

**నాటి అమ్మ**
**కాలంతో నడిచేది**
**నేటి అమ్మ**
**కాలంకన్నా వేగంగా పరుగిడుతోంది**

– వై.వి.ఎస్.ఎస్. అన్నపూర్ణ,
నిజాంపేట, హైదరాబాద్

కోపం అణుచుకొంటూ అంది "మరి మీ కొడుకు వచ్చినప్పుడు సంసారం చేయొద్దా..? "

"వాడి ఏర్పాట్లు వాడికున్నాయి!"

వెంటనే వెనక్కి తగ్గి, తడిగొంతుతో అంది.. "చచ్చిపోతుందమ్మా.. చంపేస్తారమ్మా.."

"వాళ్లు.. వాళ్లు.. కర్కోటకులమ్మా.. నిలువునా నరికి పారేస్తారమ్మా.."

డాక్టరు సతీమణి నిశ్చేష్టురాలై నిలబడిపోయింది.

"నీకన్నా పెద్దదాన్ని. చేతులు పట్టుకొని అడుగుతున్నా. ఇవి చేతులు కావనుకో. ప్రాణం నిలబెట్టు. డాక్టరుగారికి అర్థమయ్యేట్లు చెప్పు తల్లీ.."

పెద్దామె ఉద్వేగంతో తన చేతులు పట్టి ఊపుతున్నా- చలనం లేక.. నోటమాట కరువైనట్టు కళ్లప్పగించింది, డాక్టరు భార్య.

పెద్దామె చటుక్కున చేతులు లాక్కొని, చీరకొంగుని తలమీదకు సవరించుకొని, చరచర మెట్లు దిగి వెళ్ళిపోయింది.

నోటమాట కరువైనట్లు పెద్దామె వెళ్ళినవైపే చూస్తూ నిలబడిపోయింది డాక్టరు భార్య.

పెద్దామె మెట్లుదిగి కిందికి వెళ్ళడమూ.. డాక్టరు పైకి రావడమూ దాదాపు ఒకేమారు జరిగాయి.

"ఎవరావిడ? మన ఇంటికి వచ్చి వెళుతోంది? " డాక్టరు యథాలాపంగా అడిగాడు.

నిజానికి ఇలాంటి రాకపోకలు మామూలే. తమవారికి జబ్బు నయమయ్యాక డాక్టరు ఇంటికి వచ్చి- పండో ఫలమో.. నెయ్యో.. మిఠాయిలో.. మరోటో... ఇచ్చి కృతజ్ఞతలు చెప్పి వెళుతుంటారు.

కానీ, ఆ వచ్చి వెళుతున్న పెద్దామె తాలూకు ఎవరూ ఈ మధ్య ఆసుపత్రిలో చేరనూ లేదు. చికిత్స జరగనూ లేదు.

"మాలతీ! ఏంటబ్బా సంగతి? "

"ఏమోనండి.. అంతా అయోమయంగా ఉంది" కాస్సేపాగి అంది మాలతి, "బాధగానూ ఉంది"

"విషయం ఏంటి? "

"వాళ్లు... వాళ్లు... ఆమెను చంపేస్తారు? "

"వాళ్లెవరు? ఆమెవరు? చంపడం ఏంటి? ఏదైనా కొత్త టీవీ సీరియల్ మొదలయిందా? " షూ లేసులు విప్పుకుంటూ - భార్యను ఆటపట్టించాడు.

"మీరు మరీను! ఇప్పుడు మెట్లమీద మీకు ఎదురొచ్చారే ఆవిడ.." మాలతి

గొంతులోని ఆందోళన తీవ్రత అతనికి తాకింది.

"ఆవిడనా? " డాక్టరు భ్రుకుటి ముడిప డింది. "అయితే, వెంటనే పోలీస్ కంప్ల యింట్ ఇవ్వమనకపోయావా? "

"విషయం అది కాదు. వాళ్లు ఆమెను చంపేస్తారు!"

"అదేకదా నువ్వన్నావు ఇందాక!'

"ఆమె అంటే- ఆవిడ కోడలు"

"ఎవరు? "

"వాళ్ళు!"

"కట్నం విషయమా? "

"కాదు. మరింత సున్నితమైంది" మాలతి మాటలు పేర్చుకుంటూ ఆగింది. డాక్టర్ ఆమె ముఖంలోని చూస్తూ కూర్చు న్నాడు.

"నీలు అని డా. వినత స్నేహితురాలు. వాళ్లబ్బాయిని తరుచు మీ దగ్గరకి తీసుకొ చ్చేది. నెబ్యులైజ్ చేయించుకొని వెళుతుం డేది. ఆవిడ సంగతి!"

"ఓ ఆవిడా? " డాక్టర్ భ్రుకుటి ముడిప డింది.

"ఏదో ఒకటి చేయాలి. ఆమెను చంపే స్తారు!"

"దేనికి? "

"ఒక్క ముక్కలో చెప్పలేను"

"నిదానంగానే చెప్పు"

మెల్లిగా భోజనాల బల్లవద్దా, భోజనం చేశాక, మరునాడు ఉదయం- ముక్కలు ముక్కలుగా విషయమంతా చెప్పింది. పెద్దావిడ చెప్పినది చెప్పినట్లుగా.

"నిజమే కావచ్చు. నేనూ లోగడ విన్నాను"

"విన్నారా? మరి ఏమీ ఎరగనట్లు నాతో చెప్పించారే!"

"నీకే మాత్రం తెలుసోనని!" డాక్టరు వాతావరణం తేలికపరచడానికన్నట్లు నవ్వాడు. మాలతి పక్కన కూర్చున్నాడు. ఆమె చేతుల్ని మెల్లిగా తన చేతిలోకి తీసు కొన్నాడు. ఆమె చేతివేళ్లను తన చెంపలకు ఆనించి, నెమ్మదిగా అన్నాడు "నీకొక విషయం చెప్పాలి"

ఆమె చిత్రంగా చూసింది, 'ఉపోద్ఘాతం దేనికన్నట్లు'

"ఆమె.. ఆమె.. నువ్వు అనుకున్నంత అమాయకురాలు కాదు" డాక్టరు మాటల కోసమా అన్నట్లు కాసేపాగాడు. మాలతి మరింత వింతపడుతూ అతని మాటలు వినసాగింది.

"ఆమె నన్ను కూడా ఆకర్షించే ప్రయత్నం చేసింది!"

మాలతి మెల్లిగా తన చేతిని తన ఒళ్ళో పెట్టుకుంది.

"నువ్వప్పుడు లేవు. పురిటికని వెళ్లావు. ఆమె ఎన్నో రకాలుగా ప్రయత్నించింది. నేను వీలుపడనివ్వలేదు!"

ఆమెపై అపనిందా? అతని సంజాయి షీనా? మాలతి మౌనమై కూర్చుంది.

"ఇలాంటిదేదో జరుగుతుందని నాక ప్పుడే అనిపించింది. ఇంతలోనే ఊరంతా గాలికబుర్లు. వాళ్లు మామూలువాళ్లు కారు. వీళ్లు సామాన్యులు కారు. ఎందుకు చేశారో తెలియదు. కానీ, ఇప్పుడు ఆ పండుగనాటి వీడియో ప్రసారంతో వ్యవహారం ఇంటిం టికీ చేర్చారు. నిజమే- ఆమెను చంపే స్తారు!

మాలతికి మరేం జ్ఞాపకంలో లేదు. నీలు అత్త ఎన్ని ఆలోచనలు చేసిన తరు వాత- ఎంత ఆశతో తమ ఇంటి తలుపు తట్టిందో- అన్నచోట ఆమె నిలిచిపో యింది. మెల్లిగా కూడదీసుకొని అడిగింది.

"మనం ఆపగలమా? "

"కష్టం!"

"ఇది ఘోరం!"

"ఆమెను వాళ్లు వదిలినా వీళ్లు వద లరు!"

వీళ్ళెవరు? అన్నట్లు చూసింది మాలతి.

"అతని భార్య తన అన్నదమ్ములకి కబురు చేసింది. అసలే ఆళ్ళగడ్డవారు. ఆపై ఆవేశంలో ఉన్నారు. కత్తులు కటార్లతో బయలుదేరారని వార్తలు. ఏ క్షణానైనా- రావచ్చునని. ఇప్పుడు ఆమె ఏమెరుగదన్నా ఎవరేమి ఆపలేరు!"

"అతన్ని? అతన్ని ఏం చేస్తారు? "

"ఏమీ చేయరు"

"ఇది దారుణం!"

అతనేమీ పలకలేదు. చాలాసేపు మౌనం తరువాత, మాలతి మాట్లాడింది.

"ఇది ఎప్పుడు జరగొచ్చు? "

"ఇప్పుడైనా!"

"ఎక్కడ? "

"ఎక్కడైనా!"

"ఇంత చేశాడే.. అతను ఆమె ప్రాణాలకు అడ్డుపడలేడా? " మాలతి ఉద్వేగంతో అంది. డాక్టరు ముఖాన అనుకోకుండా ఓ నవ్వు కదలాడింది.

"మాలతీ! అవన్నీ కథల్లో చెప్పుకొనే వట్టి కాకమ్మ కబుర్లు! పని గడుపుకోవడానికి చెప్పే కల్లబొల్లి వాగ్దానాలు! ఎవరి ప్రాణానికి ఎవరడ్డం పోతారు? ఊరంతా పాక్కిన కబురేమిటంటే- అతనెప్పుడో పొలిమేరలు దాటిపోయాడని!"

మాలతి నివ్వెరపోయి చూసింది.

"ఇక దొరకబోయేది ఎవరంటావ్? "

మాలతి మాటలు కరువయ్యాయి.

"నువ్వు వొట్టి బోళామనిషివి. తెల్లనివన్నీ పాలనుకొంటావ్. ఆమె అమాయకపు ముఖం చూసి ఇట్టే బోల్తాపడ్డావ్. అందరూ నీలా ఉండరు. ఆ నీలూ చూడు. ఎలా ఉండేదో! ఎంత తెగించిందో!"

డాక్టర్ నోట దొర్లిన ఆ చివరి మాటలు మాలతిని చివుక్కుమనిపించాయి.

"అయినా, ఆమెది ఎంతటి సాహసం!"

★ ★ ★

ఆ పూట నీలు వాకిట్లో అడుగు పెట్టేసరికి, వరుసల్లో పేర్చిన చెప్పులు గడపలోనే పలకరించాయి. మౌనంగా తన గదిలోని తెరలమాటుకు వెళ్లిపోయింది.

పిల్లలు అక్కడున్న అలికిడి లేదు. ఎక్కడైనా ఆడుకుంటున్నారేమోనని కాసేపు చూసింది. ఊహు! పిల్లల ఆటల సవ్వడే లేదు.

అటు మెసిలి ఇటు మెసిలి- ఏమి చేయాలో తోచక సతమతమయిపోయింది.

యథాలాపంగా "పంకజ్ ఉదాస్"ను పలకరించింది. "జమానా ఖరాబ్ హై" అంటూ గాయకుడు గళం విప్పాడు. ఒక పాటలోంచి మరొక పాటలోకి కాలం కరిగిపోతోంది.

నీలు గదిలోకి నిశ్శబ్దంలోకి ఒదిగిపోతోంది. ఒక మైకంలోకి ఒదిగిపోతోంది. కలల్లోకి కరిగిపోతోంది, మెల్లిమెల్లిగా.

"నీలూ!" ఒక్క ఉదుటున భుజాలు పట్టి లేపారెవ్వరో.

నీలు అదిరిపడి లేచింది.

"ఏం చేయనే తల్లీ.. ఏం చేయను? " వణికిపోతోంది పెద్దామె.

నీలు అయోమయంగా చూసింది.

"పారిపో అందామన్నా.. చీమ దూరే సందన్నా లేకుండా నీ చుట్టూ చువ్వలు పాతేశాం కదమ్మా.. నిన్నెట్లా కాపాడేది తల్లీ..? " గొల్లుమందామె.

నీలుని వాటేసుకొని శోకాలు పెట్టసాగింది.

నీలు దిమ్మెరపోయి నడిమంచంలో కూర్చుంది.

"తప్పయిందని ఒప్పుకో" పెద్దామె కంగారు, భయం కలగలిసిన వణుకుతో గబగబ అంది.

"కాళ్ళ మీద పడు. ఒట్టు పెట్టుకో. ఏదో

ఒకటి చేయవే!"

నీలు ఏదో చెప్పబోయింది.

"వాళ్లు నీలుని రమ్మంటున్నారు!"

గుమ్మం అవతలనుంచి గంభీరస్వరం.

ఎందుకోగాని, వచ్చేటప్పుడు దాటివచ్చిన చెప్పుల వరుస ఒక్కసారిగా నీలు కళ్ల ముందు మెదిలింది. మొదటిసారిగా నీలుకి ప్రమాదం సూచించింది. దిగ్గున లేచి నిలుచుంది.

ఆ నీలుని వాటేసుకొని బావురుమంది

నీలు పాతేసిన స్తంభంలా నిలబడిపోయింది.

మళ్ళీ గుమ్మం అవతల గంభీరస్వరం

ఆమె నేలమీద కూలబడింది. దేవుణ్ణి ప్రా ర్థించసాగింది.

నీలు ధైర్యం పుంజుకొని- తలమీదుగా కొంగు జరుపుకొని- మెల్లిగా వాకిట్లోకి వెళ్ళింది.

ఆమె అడుగు సవ్వడికై ఎదురుచూస్తున్నట్లుగా- దురుసుగా తెర పక్కకు తొలిగింది. అక్కడ సమావేశమైన వాళ్ళ కళ్ళన్నీ నీలువైపు తిరిగాయి.

వాళ్లలోనుంచి ఒకరు నీలువైపు వచ్చారు.

నీలుని సావధానంగా తీక్షణంగా చూశారు.

"వీళ్ళా? నీకు వీళ్ళుకావల్సి వచ్చారా? " హుంకరించారెవరో. మరెవరో ఛీత్కరించారు.

నీలు పల్లెత్తుమాట పలకలేదు. అన్నవారెవరో అన్నట్లు అందరి వంకా చూసింది. ఆమె తలమీద కొంగు వెనక్కి జారింది. తేట ముఖం. విప్పారిన కనుదోయి. అప్పుడే విరిసిన పారిజాతంలా.. స్వచ్ఛంగా..

వాళ్ళలో ఒకరు దురుసుగా దూసుకువచ్చారు.

"మర్యాద మంటగలిపావ్!" వేగంగా వచ్చిన మాటలతోపాటుగా, ఒకేఒక చెంప దెబ్బ.

ఆ బలానికి నీలు తల నేరుగా వెళ్ళి గోడకి కొట్టుకొంది.

నీలు నిలువునా కూలబడింది.

మొదలు తెగిన చెట్టులా.

నవరగంత పగిలిందేమోనన్నట్లు

నవనాడులూ కుంగిపోయినట్లు

నుదురంతా కుంకుమద్దినట్లు...

రక్తం!

ఎవరిని ఎవరూ ఆపడానికి ప్రయత్నించలేదు. ఏ ఒక్కరూ ఆ రక్తధారను ఆపే ప్రయత్నం చేయలేదు.

ఒక్క వివరణ లేదు.

ఒక్క క్షమాపణ లేదు.

> **కొత్తగాలి...**
>
> **రెండు మనసులు కలిస్తే**
> **పచ్చని సంసారం**
> **నిండు తనువులు జ్వలిస్తే**
> **వెచ్చని కాసారం**
>
> – జి. సూర్యనారాయణ,
> బందలాయిచెరువు, కృష్ణాజిల్లా

ఒక్క విన్నపమూ లేదు.

ఒక్క విజ్ఞాపనా లేదు.

ఒకే ఒక చెంపదెబ్బ!

ఒక చాకు బాకూ లేదు. ఒక కత్తీకటారు లేదు.

ఒక నరం చిట్లలేదు. అంతెందుకు, కాస్త చర్మమైనా గీరుకుపోలేదు.

ఒకేఒక చెంపదెబ్బ!

గురిచూసి కొట్టిన వడిసెల రాయి తగిలిన పిట్టలా-

గింగిరాలు తిరుగుతూ.. కుప్పకూలిపోయింది నీలు.

నీలు పాలిపోయిన ముఖం పారిజాతపు తెల్లటి పూరేకలలోకి, నుదుటి రక్తసిందూరం తొడిమ వర్ణంలోకి చేరిపోయాయి. ఆమె ఊపిరి పారిజాతపు పరిమళాల్లోకి..

అవ్వ లబలబలాడుతూ.. విలవిలలాడుతూ.. పరిగెత్తుకొచ్చింది.

"మీకు పుణ్యముంటుంది.. నాయనలారా.. డాక్టరును పిలవండి!" ఎవరో పిలిచినట్లుగానే ఆనాటి పారిజాతాలు విచ్చుకొనే తరుణంలో నీలు డాక్టరు దంపతుల మాటల్లోకి వచ్చింది.

"మీరంటున్నారు కానీ, నేనూ నీలుని గమనించాగా.. అటువస్తు ఇటుపోతూ, నన్నూ అలాగే వింతపడి చూసేది. ఉండబట్టలేక ఒకమారు వినతని అడిగాకూడా.." మాలతి మాటలు బరువు బరువుగా వచ్చి డాక్టరును తాకాయి.

"ఏమంది? "

"నీలుకి లోకమంతా ఆమె గదే. ఇప్పుడిప్పుడే ఆమె గది తలుపులు తెరుచుకొంటున్నాయి. లోకం పోకడలు తెలియవు కదా? అలా కన్నార్పకుండా చూడడమూ తప్పని ఆమెకు తెలియదు" అంది.

డాక్టరు మారు పలకలేదు.

మాలతి కాసేపాగి మళ్ళీ అంది, "వినత అన్నట్టే నాకూ నీలు కళ్ళల్లో ఆసక్తి, కుతూహలం కనిపించాయి. ఏదో తెలుసుకోవాలన్న జిజ్ఞాస కనిపించింది. ఒక చిన్నపిల్ల కనబడింది. తనను తాను చిత్రించుకోవడానికి కుంచెను సిద్ధం చేసుకొంటూ రంగులు సేకరిస్తున్న కళాకారిణి కనబడింది"

డాక్టర్ అయిష్టంగా అటూ ఇటూ మెసిలాడు.

మాలతి మరో లోకంలోంచి మాట్లాడుతున్నట్లు లోతుగా పలికింది.

"మీరామె కనుల్లో కోరికను ఒలికించిందంటున్నారు. నాకేమో ఆమె దాంపత్యాన్ని, కుటుంబాన్ని కలగంటున్నదనిపించేది. తన సహచరుడి స్నేహాన్నికై పరితపించినట్లుగా అనిపించింది"



మాలతి ఆగింది.

డాక్టరు ఏమీ మాట్లాడలేదు. అప్రయత్నంగా తలాడించాడొకమారు.

మాలతి కొనసాగింది.

"తెలిసీతెలియని వయసులో కుటుంబ జీవితం మొదలయ్యింది. దాంపత్యం అంటే చిరకాల స్నేహమనీ.. ఆ బంధంలోని మాధుర్యాన్ని ఇతను రుచిచూపాడేమో! అదుగోండి.. ఆ పారిజాతాల్లో ముడిచి మనకెన్ని దాంపత్యధర్మాల్ని చెప్పారో! ప్రేమగా గౌరవంగా దంపతీబంధం విరి



యాలని చెప్పకనే చెప్పలేదూ? " మాలతి నిట్టూర్చింది.

"అంతా సవ్యంగా సాగినంతసేపు బాగానే ఉంటుంది. సాగనప్పుడే ఇలాంటి వన్నీ" మాలతి కాసేపాగి మళ్ళీ అంది, "శరీరానికి మనసుకీ దాంపత్యానికీ మధ్య విస్తరించిన ఈ మానవ సంబంధం ఎంత చిత్రమైనదీ!"

మాలతి గొంతు మెల్లిగా బలంగా పలికింది.

"ఏమైనా సరే, నీలుని మనం కాపాడాలి! చూస్తూ చూస్తూ ఒక మనిషి నిండు ప్రాణం పోతుందని తెలిసీ ఎలా ఊరుకోగలం? ఏదో ఒకటి చేయాలి!"

"ఏం చేయగలం? " డాక్టరు నోరు మెదిపాడు.

"పోలీస్‌వారికి తెలియజేస్తే? "

"ఏమని? "

"ఇలా జరగబోతోందని.. "

"ఒక గాలి కబురు పట్టుకొని మనం ఏమీ చేయలేం. సాక్ష్యాలు ఏమిటంటే? " డాక్టర్ పెదవి విరిచాడు.

"మీరు లోగడ ఒకమారన్నారు. ఆ ఏరియా ఇన్‌స్పెక్టర్ మీ పేషెంటేనని. ఒకసారి మాట్లాడి చూడకూడదూ? " మాలతి ఆశగా అడిగింది.

ఏమనుకొన్నాడో ఏమో డాక్టరు కాసేపటి తరువాత లేచి, అటూ ఇటూ వెతికి ఆ ఇన్‌స్పెక్టర్ విజిటింగ్ కార్డ్ పట్టుకొచ్చాడు. మాట్లాడాడు. కానీ, మాలతితో మాట్లాడకుండా మౌనంగా ఉన్నాడు.

మాలతి ఆందోళనగా అడిగింది, "ఏమన్నారు? "

"అతను కాసేపాగి మళ్ళీ ఫోన్ చేయమన్నారు"

మాలతి నమ్మశక్యం కానట్టు కళ్ళు చికిలించింది. డాక్టర్ ముఖంలోకి సూటిగా చూస్తూ తేటగా అడిగింది. "మీ వాలకం చూస్తుంటే ఏదో దాస్తున్నారనిపిస్తోంది!"

డాక్టరు బలంగా నిట్టూర్చి మెల్లిగా అన్నాడు.

"అంతా అయిపోయింది!"

"ఏ విషయం? " గుండె చిక్కబట్టుకొని చెవులప్పగించింది.

"నువ్వన్నట్టే జరిగింది. వాళ్ళ మర్యాద వాళ్ళు నిలబెట్టుకొన్నారు!"

"అంటే.." ఆమె హతాశురాలయినట్లు కూలబడింది.

"ఇన్‌స్పెక్టర్ ఇప్పుడే సమాధి దాకా వెళ్ళి వచ్చాడట. వంటిమీద చిన్న ఆనవాలైనా లేదట. నిద్రలోనే గుండె ఆగిపోయిందని డెత్ సర్టిఫికెట్ ఉందట. ఇక ఇతనేమీ చేయలేడు!"

పారిజాతాల పరిమళం కన్నా ఘాటైన చీకటి ముసురుకొంది వారి చుట్టూ లోలోన.

ఒక్క కత్తిగాటు లేదు. ఒక నెత్తుటి బొట్టులేదు.

కానీ, కొద్దిపాటి పరిచయంతోనే వారి మనస్సుల్లో లోతైన గాటు మిగిల్చి- పారిజాతాల్లో కలిసిపోయింది నీలు.




## వీళ్ళు -

"నీలూ.." ఒకరిపై ఒకరు పోటీలు పడుతూ పిలుస్తున్నట్లే ఉంది.

నీలు ఎవరిమాటకు అందకుండా పరుగులు పెడుతున్నట్లే ఉంది.

అప్పుడు నీలు ఎక్కడ ఉంటుందో అందరికీ తెలుసు.

సరిగ్గా ఆ సమయంలో పారిజాతం చెట్టు మొదట్లో పూవులేరుకొంటూ ఉంటుంది. ఆ ఊరు ఎప్పుడో నిద్రలేచి, పాల క్యాన్లను నింపేసి- మూతలు బిగించేస్తొంది. వల్లెవాటు చివర్లు కొద్దిగా ముడి చేసి, సంచిలా చేసి, రాలిన పూలన్నిటితో నింపేసింది. పరిగెత్తుకొంటూ వెళ్ళి వాకిట్లో దిమ్మెమీద ఉంచిన ఇత్తడి పళ్ళెంలోకి తొంగి చూసింది. నీరు తగ్గాయి. అదే పరుగులో వెళ్ళి చెంబెడు నీళ్ళు తెచ్చి- పళ్ళెంలో పోసింది. మరో పరుగుతీసి గుప్పెడు గోధుమలు తెచ్చి ఆ పళ్ళెం చుట్టూ చల్లింది.

ఆ పక్కనే గట్టుమీద చతికిలబడింది. పారిజాతం పూలు వడి నిండిపోయాయి. పళ్ళెంమీద వాలి నీటిచుక్కనో, గోధుమ గింజనో ముక్కున బట్టి వయ్యారంగా ఎగిరిపోతోన్న పిట్టల సొగసుకు మురిసిపోతూ, పారిజాతం దండ గుచ్చసాగింది.

"నీలూ" మళ్ళీ కేక.

"వెళ్ళి వెల్లుల్లి తీసుకురా!" అమ్మ కేక.

"అలాగే, పుదీనా!" వదిన జత.

నీలు మారుమాట్లాడకుండా పిట్టల సోయగాల్ని పళ్ళెంపై వాటి కొనముక్కల దరువును వింటూ- పూలదండను పూర్తిచేసింది. మునివేళ్ళ మీద పరిగెత్తి- ఓ ఇత్తడి పళ్ళెంలో పూలదండను సున్నాలు చుట్టేసి- అదే పరుగులో తిన్నగా వెళ్ళి కృష్ణుడి విగ్రహం ముందు పెట్టేసింది.

"నీలూ.. ఆలస్యం అవుతోంది బేటీ..! ఇవ్వాళ పంచాయతీ. అన్నా నాన్నా చావిడి నుంచి వచ్చేలోగా రొట్టెలు చేసేయాలి. ఇంకా పిండయినా తడపలేదు. మా బంగారం కదూ? ఒక్క పరుగులో వచ్చేయి.." అమ్మ బతిమిలాడుతూ అంటున్నా ఆగని భయం ఆమె గొంతులో తొణికింది.

"అమ్మా! నువ్వు అన్నిటికీ ఊరికే ఉలుకులికి పడతావ్. చూడు, ఇట్టే వస్తా!" చద

రపు పీటమీద కూర్చుని ఇంకా తడపని రొట్టెల పిండిని దిగాలుగా చూస్తున్న అమ్మని భుజాలమీదుగా వాటేసుకొంది నీలు, గారాబాలు ఒలికిస్తూ.

"ముందు వెళ్ళు చిట్టితల్లీ.." అమ్మ నీలు చిన్నిగడ్డం పట్టుకున్నాక, నీలు పకపక నవ్వింది.

"అదీ అలా అడుగు!"

తల్లీబిడ్డల మురిపెం చూస్తోన్న నీలు వదిన ముచ్చటగా నవ్వింది. "ఈ ముదిగారం ముచ్చట పదికాలాలపాటు పచ్చగా పదిలంగా ఉండనీ!" మనసులోనే దేవుడికి మొక్కుకుంది.

నీలు మునివేళ్లమీద గిర్రున లేచింది. ఒక్క పరుగున వాకిట్లోకి వెళ్లింది.

గడప అలా దాటిందో లేదో.. అన్న ఎదురు వచ్చాడు.

"నీలూ.. నీకాలెందుకమ్మా కందడం? ఇదుగో.." తన చేతిలోని సంచిని చెల్లెలి చేతిలో పెట్టాడు.

అప్పుడే నేలలోంచి తవ్వితీసిన లేతవెల్లుల్లితోబాటు ఆలుగడ్డలు, చిక్కుళ్ళు, టమాటాలు, లేలేత పుదీనా.. అమ్మ కోరినవన్నీ అక్కడే ఉన్నాయి! నీలు బయటికి వచ్చినంత వేగంగా లోపలికి పరిగెత్తింది.

"మరీ అలా వెళ్ళి ఇలా ఎట్లా తెచ్చేవు నీలూ? " అత్తాకోడళ్ళు ముఖాలు చూసుకొన్నారు.

"ఇదుగో.. ఇలా!" ఆ వెంటనే అన్న నవ్వుతూ వంటింట్లోకి వచ్చాడు.

అతని చేతిలో లేత క్యారెట్లు, ముల్లంగి, పచ్చి బఠాణీలు.

"అయితే ఇవ్వాళ విందుభోజనం అన్నమాట!" నీలు నవ్వింది. ముల్లంగి పరాఠా, భిండ్వీ, పలావ్, గాజర్ కీ హల్వా, నవరతన్ కుర్మా.."

"పూరన్‌పోలీ.." వదిన అందించింది.

"ఆగాగు.. నాన్నొచ్చే లోపల పరాఠాలు సిద్ధం కాకపోతే- అప్పుడవుతుంది- నీ వీపు

## స్వాతిశయంపై కొరడా!

భాషలో ప్రాచీనకవుల పరిమళాన్ని పుణికిపుచ్చుకోవడమే కాక దానికి తమ స్వీయ ప్రతిభను సైతం జోడించామంటూ నాటి కవులు కొంతమంది చెప్పుకునేవారు. అంతేకాక తమ కవితా సౌరభాలను ఆస్వాదించే చదువరులు



లేరని బాధపడేవారు. తమ రచనలోని లోతైన భావాలు, ప్రయోగాలు, చమత్కారాల్ని తామే వివరించాల్సి వస్తోందని అతిశయం పోయేవారు. అలాంటి వారిని దృష్టిలో పెట్టుకుని జాషువా,

'నా కవిత్వంబునందు రత్నములు కలవు
వాని బెకిలించి చూపెడువాడు లేడు
కాలమిట్టున్నదని మొనగాడువోలె
బలుకు కవిగాడ! యేటికీ స్వాతిశయము!'

అని చురకవేశారు. అంతేకాకుండా ఆయన,

'ఏవీ యా రతనంబులు
నీవే పెకిలించి చూపి, నీ యింటికి గొం
పోవోయ్! యట్లొనర్పగ
నీ వలనన్ గాదొ! ఇంక నీల్గెదవేల? '

అని కొరడా ఝుళిపించారు.

మీద పసందైన విందు!" చెల్లెలి చెవి మెలిపెడుతూ అన్నాడతను.

"మరే, తమరికేమో కనువిందు!" నీలూ అన్న శైలిలోనే అన్నను వెక్కిరించింది.

"నీలూ.. ఇవ్వాళ బడికి వెళ్లేది లేదా? " తలవాకిట నుంచే తండ్రి పలకరింపు. అదే హూంకరింపులా.. అందరినీ తాకింది. అంతే, ఎక్కడ వేళాకోళాలక్కడ కట్టిపెట్టి ఎక్కడివారక్కడ సర్దుకొన్నారు.

★ ★ ★

పశ్చిమ తీరం.

ఎనభై దశకం కాలంలో కరిగిపోయే తరుణం.

అప్పుడప్పుడే విచ్చుకుంటున్న పల్లెమొగ్గ.

ఆరావళీ పర్వతాలు పనిగట్టుకొని పక్కకు జరిగినట్లు.. వరస తప్పి.. అటొకటి ఇటొకటి గొబ్బెమ్మల్లా నిలిచినచోట.

అటు విజయనగర్, ఇటు హిమ్మత్‌నగర్.

నట్టనడుమ చల్లారిన లావాముద్దల్లాంటి గండశిలల కొండలు. ఆ మధ్యగా దారి చేసుకొని చల్లగా పారుతోన్న సబర్మతీ నది, ఆ పల్లెపొరలను దూరాన్నించే పలకరించి.. అటునుంచి అటే పయనమవుతూ..

అది ఘామిడి.

ఆరావళీ పాదాల వాలిన పచ్చని కుచ్చిళ్ల అంచున నేసిన ఓ శుద్ధ పల్లెటూరు.

ఊళ్లో మగవారంతా ఒళ్లువిరిచి పంటసిరిని ఇంటికి తెస్తే- ఆడవారంతా ఆలమందల ఆలనాపాలనా చూసుకొని పాడిని పొంగిస్తారు.

అందరిలాంటిదే నీలూ ఇల్లు. చిన్న ఆవరణ. పశువుల కొట్టం.

పాడి పంట.. పండగ పబ్బం.. కోలాటం నృత్యగానం..

అందరిలాగానే పదిపదిహేనేళ్ళుగా వానరాల్చని మేఘమాల వంక ఎదురుచూపులు. వానచుక్క అపురూపమైంది. పంట పొలాలు, పచ్చిక బయళ్ళలాగా రాను రానూ పాడి ప్రధానమైన ఆదాయవనరుగా మారిపోయింది. అన్ని పల్లెల్లాగానే అక్కడా పాలసేకరణ విస్తరించి వేళ్లూనుకో సాగింది. ఇప్పుడక్కడ పంటపొలం కన్నా పాడిపశువులున్న వారే పెద్దమనుషులు!

సబర్మతి నానాటికి చిక్కిశల్యమైపోతూ- రైతులకు అందీ అందకుండా సాగిపోతోంది. వొట్టి మేఘాలు, ఎప్పుడూ అలా ఊరిపై సాగి, రైతులను ఊరించి.. తిప్పల్లో ముంచేసి వెళ్లిపోతున్నాయి.

ఇలాంటి నేపథ్యంలోనే- ఇంతటి విపత్కర పరిస్థితుల్లోనే- ఆ ఊరి పోతేదార్ల పంచాయితీకి నీలు తండ్రి- 'పెద్ద'గా ఎంపికయ్యాడు. ఇవ్వాళే ప్రథమ సమావేశం.

నీలు తల్లి భర్తకు తిలకం దిద్ది, హారతి ఇచ్చింది. నీలు తండ్రికి మురిపెంగా తలపాగా చుట్టడంలో సాయం చేసింది. కోడలు మామగారి పాదాలంటి ఆశీర్వచనం తీసుకొంది. కొడుకు పెద్దరికాన్ని ప్రతిఫలించే తాతలనాటి పొన్నుకర్రను వెతికి పట్టుకొచ్చి తండ్రి పక్కనే నడుస్తూ- లయబద్ధంగా నేలమీద తాటిస్తూ- సగర్వంగా మీసం సవరించాడు.

తండ్రీ కొడుకులు తనివితీరా ఆలింగనం చేసుకొని- ఆపై పంచాయితీకి తరలి వెళ్ళారు. అటూ ఇటుగా నీలు తన బడికి బయలుదేరింది. అత్తాకోడళ్లు ఆనందంగా వారిని సాగనంపారు.

నీలు బడిలోనూ ఇదే చర్చ. పాఠాల్లోకి అందరూ ఒదిగేలోపలే, ప్రధానోపాధ్యాయుల నుంచి పిలుపు అందింది, పిల్లలందరికీ.

మగపిల్లలను ఆటలకు వదలాలని.. ఆడపిల్లలు ప్రార్థనామందిరంలో కలవాలని.

అమ్మాయిలు సమావేశమందిరంలోకి వెళ్లగానే తలుపులు మూసేశారు. కొంటె మగపిల్లలు కిటికీ సందుల్లోను, తలుపుల మాటున చెవులు రిక్కించినా, ఆటవిడుపుగా పరిగెత్తుకుపోయిన వాళ్లు పోయారు.

అమ్మాయిలు కుదురుగా నేలమీద సర్దుకు కూర్చునేలోగానే, వేదిక పక్కన ఉన్న తలుపులు తెరుచుకొన్నాయి. ఊరిపెద్దలందరూ ఒక్కరొక్కరుగా వచ్చి, వేదిక మీద పరుపులపై కూర్చున్నారు. దిండుపై మోచేతులు ఆన్చి, ధీమాగా కూర్చున్న నీలు తండ్రిని చూపిస్తూ, ఆమె స్నేహితురాలు ముసిముసి నవ్వుతో నీలుని మోచే





తితో పొడిచింది. నీలు సంతోషంగా నవ్వింది. ఆపై, ఆ పక్కనే వచ్చి కూర్చున్న స్నేహితురాలి తండ్రిని, ఆమెకు చూపిస్తూ కనుబొమలెగరేసింది. ఇద్దరూ ముఖముఖాలు చూసుకొని ఫక్కుమన్నారు.

ప్రధానోపాధ్యాయులు గౌతంభట్ మోకాళ్ళపై లేచి- గొంతు సవరించుకొన్నాడు. అంతే, ఎక్కడ పకపకలు అక్కడ సద్దుమణిగాయి.

కొత్త పంచాయితీ పెద్దల పరిచయాలు సాగాయి. ఆపై, ఆ పెద్దలంతా తమ సరికొత్త బాధ్యతలను- వాటిని అమలు చేయడానికి వీరంతా పాటించవలసిన నియమావళిని వివరించసాగారు కుమారీశతకాలు మాననీ మర్యాదలతో కలగలిపి. వేదిక మీదున్న వారందరికీ వేదిక ముందున్నవారు కన్నబిడ్డలో, మనుమరాళ్ళో. అటూ ఇటూగా అందరూ బంధువులే.

అందుకే, పలకరింపులతో పరాచికాలతో ప్రారంభమై, మెల్లిమెల్లిగా సంభాషణలు చిక్కబడసాగాయి. ఒక్కోమాట గాలిలోకి సాగుతుండగానే వేదికమీది పెద్దలు నిశ్శబ్దంగా మారిపోయారు. గంభీరంలోకి కూరుకుపోయారు.

అది ఎంతటి నిశ్శబ్దమంటే అప్పటికప్పుడు అక్కడక్కడ ఏదో ఘోరాతిఘోరం జరగబోతోందేమోనన్నంత. పక్కవారిని పన్నెత్తి పలకరించడానికి కూడా ధైర్యం చాలక ఎక్కడివారక్కడ బిగుసుకుపోయేంత.

చీమ చిటుక్కుమనడంలేదు.

మాట్లాడేవారి గొంతు గదంతా నిండి- గోడల్ని దాటి, తలుపుల్ని కిటికీల్ని తాకి- కొంటెపిల్లల్నీ భయభ్రాంతులను చేశాయి!

"వాళ్లు చాలా దుర్మార్గులు. అక్కాచెల్లీ వావీవరుస ఏమీ లేవు. మీ వంటి మర్యాదస్తుల ఇంటి ఆడపిల్లల్ని మాయమాటల్లో ముంచేసి, ఇట్టే ఊరు దాటించేస్తారు. తిన్నగా బొంబాయి బజార్లలోకి చేరుస్తారు"

మాట్లాడుతున్న వ్యక్తి ఓమారు ఆగి, అందర్నీ పరిశీలనగా చూశాడు. ఆడపిల్లలంతా మరింత బిగుసుకుపోయారు. తలుపు కిటికీల చాటు కొంటెపిల్లలు సరే సరి.

ఇదే మొదటిసారి వాళ్ళ గురించి వినడం. వింటున్నకొద్దీ పిల్లలు విహ్వలులైపోయారు.

"మీ కళ్లు పొడిచేసి, ముక్కు చెక్కేసి, చేతులు విరిచేసి, కాళ్ళు విరగ్గొట్టి చింపిరి గుడ్డలు వేసి, చిప్పలు చేతికిస్తారు. అడుక్కు తినమని!"

వికలమైపోయిన తమ ఆకారాలను ఊహించుకొని ఎవరికివారు ఉలిక్కిపడ్డారు. గదంతా భయం వీరవిహారం చేసింది. వినలేనివారు చున్నీలను చెవుల చుట్టూ బిగించారు.

"సావధాన్!" ఎవరిదో హెచ్చరిక.

మళ్ళీ ఎక్కడివారక్కడ సర్దుకున్నారు నిశ్శబ్దంగా. పక్కవారిని కళ్లెత్తి చూడాలన్నా వణుకు. కాలూ చేయి కన్నూ ముక్కూ లేని ప్రాణస్నేహితురాళ్ళని వాళ్ళూహించలేకున్నారు.

"మన ఊరు ఒకమారు దాటారంటే, ఇక అంతే! ఇక పొలిమేరలో అడుగు పెట్టనివ్వం. ఆపై, మీ ఇంటి గడప తొక్కే

## కొత్తగాలి...



పువ్వుకు వాసన
కడలికి కెరటం
మనిషికి
మమత, మానవత్వం

– రఫీ, శ్రీకాకుళం

మాటే రాదు!"

అతని కంఠం తీవ్రమైంది. కళ్ళు తీక్షణ మైనాయి. ఊపిరి బలపడింది. గొంతు హెచ్చింది.

పాదాల మీద జీరాడుతున్న చనియా కుచిళ్ళను మరింత దగ్గరకు లాక్కొని, ధైర్యం పుంజుకోవడానికి మోకాళ్ళను వాటే సుకొంది నీలు. మాట్లాడుతున్న అతను పెదనాన్న వరసే. అంతటి తీవ్రత ఎన్నడూ చూడలేదు. అంత వాడి మాట లను అతనెప్పుడూ వాడలేదు! నిజమో భ్రాంతో తెలియని వింత సందిగ్ధత. ఒక తెలియని గగుర్పాటును కలిగించింది

కొత్తగాలి...

**చేపలకు**
**జేజేలు**
**పలికే**
**కొంగలు**

– ఎస్. సూర్యకుమారి,
సికింద్రాబాద్

అందరికీ మల్లే తనూ కళ్లప్పగించి- వినసా గింది.

అతను మరింత ముందుకు వచ్చి దిక్కులు పిక్కటిల్లేంత బిగ్గరగా అన్నాడు.

"జాగ్రత్తగా వినండి! అమ్మాయిలూ! మీరు వాళ్ళతో కలిసి కనబడినా, వాళ్ళతో మాట్లాడినా, వారి చేతి నీరు తాగినా, వారి గాలి మీకు సోకినా, వాళ్ళతో కలిసి పొలి మేర దాటి ఒక్క అడుగు వేసినా- ఇక మీకు దక్కేది ఇదే!" అతను చర్రున కర వాలం గాలిలోకి దూసాడు.

అప్పటివరకూ అక్కడి పరుపుపై చల్లగా ఉన్నదేమో ఎవరికీ కనబడలేదు. ఇప్పుడు ఆగ్రహోద్రేకాల భావావేశాల నడుమ ఊగి పోతున్న అతని భీకరరూపం ముందు అసలు కనబడడంలేదు.

అమ్మాయిలంతా గడగడా వణికిపో యారు. వారి నాలుకలు పిడచ కట్టుకుపో యాయి.

"ఇలా చూడండి. కళ్ళు తెరిచి తిన్నగా చూడండి. ఈ తల్వార్ మీ పొట్టలోకి ఇలా మెత్తగా దూరిపోతుంది. అంతే!" గాల్లోకి కరవాలం దూసి, చక్‌చక్‌మని ఆడించాడు. "జాగ్రత్త!" కరవాలం గాలిని పరపరా కోస్తుండగా- మాటలు వారిని మనసుని ముక్కలు చేశాయి.

"వాళ్ళతో కనబడ్డారా... ఖబడ్దార్!"

కళ్ళు విప్పార్చి భయంకరమైన హూంక రింపు. బెదిరింపు.

నీలు నమ్మశక్యం కానట్టు తండ్రి వంక చూసింది. అతని ముఖం కూడా కృతని శ్చయ భారంతో బిగుసుకుపోయి వుంది. ప్రధానోపాధ్యాయుని వంక చూసింది.

అతను అరచేతులను నేలకు అదిమిప డుతూ, పెదవిని బిగించి, గంభీరంగా తన వళ్లో దృష్టిని నిలిపాడు, తల వాల్చుకుని.

నీలూ నిర్ఘాంతపోయి, నిస్సహాయంగా మిగిలిన ఉపాధ్యాయులవైపు చూసింది.

కొందరు తమలాగే భయపడుతు న్నట్లుగా బిగుసుకుపోయి ఉన్నారు. మరి కొందరు అతనికన్నా కోపంగా తమవంక చూస్తున్నారు. ఇంకొందరు ఎటూ పాలు పోని నిస్సహాయ స్థితిలో ఉన్నట్లు పేలవంగా ఉన్నారు. అచ్చంగా ప్రధానోపా ధ్యాయునివలె. నిజమే, ఒక్క భట్‌గారే బయటివారు. మిగిలినవారంతా తమ ఊరివారే. అందరూ బంధుగణమే. తమ పెద్దల మాటే తమకు చద్దిమూట!

ఆడపిల్లలంతా పైకి లేవబోయారు. సరిగ్గా అప్పుడే నీలు తండ్రి లేచి నిలబ డ్డాడు. మళ్ళీ ఎక్కడివారక్కడ నిశ్శబ్దమైపో యారు.

నీలు నాన్న అంతే ఆవేశంలో అతని చేతిలోని కరవాలం తన చేతికందుకొని- ముందుకు నడిచాడు. కళ్ళు పెద్దవి చేసి, ఊగిపోతూ, గదంతా దద్దరిల్లేలా అన్నాడు.

"అది నా కన్నబిడ్డయినా సరే! కత్తికొక కండ!"

నీలు నిశ్చేష్టురాలయ్యింది

"జాగ్రత్త!"

ఆడపిల్లలు పళ్ళు గిట్టకరుచుకొని, పల్లెత్తుమాట పలకకుండా- గునగున బయటకు వెళ్ళారు. గుసగుసలన్నీ గొంతులోకి నెట్టేసి, వెనక నుండి వాళ్ళ అడుగుల్లోకి ఒక్కోమాట వాడి ముల్లులా వచ్చి పడుతున్నది.

వినాలంటే భయం. వినకపోయినా భయమే.

తలెత్తితే తప్పయితే ఎలాగని?

తడబడుతూ తర్జన భర్జనలన్నీ తలల్లోనే ఇంకించుకొని, తలలను వాల్చుకొని తలుపులు దాటారు.

తలుపుల మాటునున్న మగపిల్లలు కొత్త బరువు బాధ్యతలతో తలలెగరేసి, తాతలు తండ్రుల వద్ద ప్రత్యేక మర్యాదా, పరిరక్షణ, శిక్షణ ప్రారంభించారు.

ఆ ఊరిలో ఒక కొత్త అధ్యాయానికి ఆరంభం ఆ రోజు! అలా కొద్దికాలం సాగింది. ఎవరి పనుల్లో వారు మునిగి తేలుతుండగా, మాటలు కాలం మాటున మరుగునపడ్డట్టే కనబడ్డాయి.

పిల్లలంతా బడికి వెళుతూ.. ఆడుతూ పాడుతూ అక్షరాలు నేర్చుకొంటూ.. అదుగో ఇదుగో అంటుండగానే.. నీలు పదో తరగతి పట్టభద్రురాలైంది.

అదే ఈడు మగ పిల్లలకు బృంద శిక్షణ తీవ్రమైంది. మర్యాద రక్షణ వారి బాధ్యత. అదే వారి ఊపిరిగా మారింది చూస్తుండగానే. తాతలు తండ్రులు అన్నలతో కలిసి, ఊరంతా చురుకుగా చుట్టేయసాగారు. అందరిలోనూ నిబ్బరం.. నిర్భయం.

అది సరిగ్గా హసన్‌నగర్‌లో నీలు తరగతి పిల్లలు కాలేజిలో చేరడానికి నిర్ణయం తీసుకోవాల్సిన ఘడియ.

అంతకుమునుపు అసలు ఆ ఆలోచనే లేదు.

ప్రధానోపాధ్యాయులు గౌతంభట్‌గారి భార్య శేఫాలీభట్ ఆ ఏడాదే హిమ్మత్‌నగర్ బాలికల కళాశాలలో వృక్ష శాస్త్రం నేర్పడం మొదలుపెట్టింది.

పదోతరగతి పూర్తి చేయడమే ఆ బాలికలకు గొప్ప. అప్పటికే వధువులయ్యేవారు, గృహిణులయ్యేవారు. మాతృమూర్తులయ్యేవారు- ఎక్కువ.

శేఫాలీ గ్రామంలోనే ఉంటూ ఈ పిల్లలందరికీ పాఠాలతోపాటు వారి కుటుంబ సన్నిహితురాలయ్యింది. ఉన్నత విద్యావంతురాలైనా వినయసంపన్నురాలై ఉండడం ఊరివారందరినీ కట్టిపడేసింది. ఉద్యోగం చేస్తున్నా వినమ్రతతో మెసలడం- పెద్దలందరికీ గొప్ప నమ్మకం కలిగించింది. భట్ దంపతులు ఆ ఊరివారికి ఆదరణీయులయ్యారు.

భట్‌గారు, భార్యా సమేతంగా పిల్లలందరి ఇళ్ళకు వెళ్ళి, చదువును కొనసాగించవలసిన అవసరాన్ని వివరించారు.

సేద్యం పోయినా, పాడి తగ్గినా ఉద్యోగం అంటూ ఉంటే నెల తిరిగేసరికి కళకళలాడే గాంధీ బొమ్మలు కళ్ళకద్దుకోవచ్చు కదా?

పైనుంచి, గడ్డీగాదెం, కుడితీ పేడా చాకిరీ తప్పుతుంది.

శుచిగా శుభ్రంగా గౌరవంగా తిరగొచ్చు. శ్రమ తక్కువ.

అటు ఆదాయమూ ఇటు ఇంటికి మర్యాద. ఊరికి ప్రతిష్ట.

వయసుకు చిన్నవాడైనా భట్ పాదాలం టని వృద్ధుడు ఆ ఊరిలో లేడు!

భట్ మొదట్లో చాలా కంగారుపడ్డాడు, తన వయసేమిటి? తన చైతన్యమేమిటి? ఒక వృద్ధుడు తన పాదాలంటడమేమిటి? ఆ గౌరవం దేనికో అతనికీ తెలుసు. అది జన్మతః అబ్బింది. కుల గౌరవం! తన ప్రమేయంలేని ఈ ప్రాధాన్యతను మెల్లిమెల్లిగా తన భావవ్యాప్తిగా సాధనంగా మల చుకొన్నాడు. గిజుభాయికి ఏకలవ్య శిష్యుడతను. పైనుంచి అటు గుజరాతీలోనూ ఇటు హిందీలోనూ కవితలల్లేవాడు. ఆయనకు తగ్గదే ఆయన ఇల్లాలు.

## కొత్తగాలి... 

పల్లెది
పాలగుణం
పట్నానిది
పాముగుణం

– పెరుక రాజు,
నర్సింగాపూర్, కరీంనగర్

ముక్కుపచ్చలారని తన విద్యార్థినులు చూస్తుండగానే పసిగుడ్డును చంకనెత్తుకొని తన ఆశీర్వాదం కోసం రావడం అతని మనుసును ముక్కలు చేసింది. భార్యతో ఎప్పుడూ చెపుతూ ఉండేవాడు, 'ఎలా వీరిని చైతన్యవంతులను చేయడమని!'

"చిటికెడు చదువు, పిడికెడు సంస్కారం!" శేఫాలి నవ్వుతూనే అనేది.

భర్తతోపాటు ఆ ఊరికి వచ్చిన ఆమె, మొదట పాఠాలు చెపుతూ బడిలో అందరికీ చేరువయ్యింది. తన ఎమ్మెస్సీ (బోటనీ)ని పూర్తిచేసింది. నగర్‌లో ఉద్యోగంలో చేరింది. రాకపోకలతో కాస్త ఇబ్బందయినా, సాయంత్రాలు, సెలవు రోజులు ఊరిలోని ఆడవారిని, పిల్లలను పోగేసి ఏవో కార్యక్రమాలు నిర్వహిస్తూనే ఉంది, భట్‌గారి ఆలోచనలు ఆచరణలోకి పెడుతూ.

ఆడపిల్లల్ని ఊరుదాటి మరొకచోట కళాశాలలో చేర్పించడం అంటే ఎంతటి విప్లవమో వారికి తెలుసు. వారికి తెలిసిన అన్నిరకాల ఉపాయాలను, అస్త్రశస్త్రాలుగా మార్చి, మెల్లిమెల్లిగా ఆ ఆలోచనలను ఊరిలో వ్యాపింపజేశారు.

నీలు తండ్రి పంచాయితీకి పెద్ద. ఆయన నిర్ణయమే తమ నిర్ణయంగా మిగిలిన పదిమంది ఆడపిల్లల తండ్రులు సవినయంగా భావించారు.

తర్జన భర్జనలు పడి, చివరికి ఆడపిల్లలను కూడా కళాశాలలో చేర్పించాలనే అనుకొన్నారు. భట్‌గారి సతీమణి చదువు నేర్పే చోటనే. "ఇకనేం? ఏ భయమూ లేదు!" పిన్నాపెద్దా ఆడామగా నిశ్చింతగా నిట్టూర్చారు.

భట్‌గారే స్వయంగా దగ్గరుండి అందరినీ అక్కడ చేర్పించేశారు.

ఇక ఊరికి కొత్త కళ వచ్చింది.

ఉదయాన్నే పాలక్యాన్లు తీసుకెళ్ళడానికి వచ్చే వ్యాన్లలోనే, ఒక పక్కగా పరుపులు వేసి, ఆడ పిల్లలను కాలేజీ దగ్గర వదిలి వచ్చే ఏర్పాట్లు చేశారు.

సాయంత్రం ఊరికి పాలసేకరణకు బయలుదేరే ఆ వ్యాన్లలోనే, పిల్లల తిరుగు ప్రయాణం. భట్‌గారి సతీమణి ఎలాగు ఉన్నదయ్యే!

ఘామిడి గ్రామంలో జరిగిన ఈ చైతన్య రథోత్సవాన్ని చుట్టుపక్కల ఊళ్ళలో సంబరంగా చెప్పుకొన్నారు. ఘామిడి పంచాయితీ పెద్దలకు ఈ ఘనత అబ్బింది.

నీలుకి, ఆమె స్నేహితురాళ్ళకి ఇదంతా భలే ఆట విడుపుగా ఉంది. కొత్త ఊరు, కొత్త స్నేహాలు, కొత్త బట్టలు, కొత్త ముస్తా

బులు. యువరాణీల్లా రథాలెక్కి విహారానికి బయలుదేరడాలు, అమ్మల, వదినల మురిపాలు, ఇంటికి వచ్చీరాగానే ఏదో ఘనకార్యాలు చేసి, అలసిసొలసినట్లు ముదిగారాలు- సెలవు రోజుల్లో మరింత స్వేచ్ఛగా సంబరాలు, ఆటపాటలు-

భలే బాగున్నాయి.

ఇక రోజూ, మధ్యాహ్నం భోజనానికి ఎవరో ఒకరు వంతులేసుకొని, సజ్జ రొట్టెలో, పరాటాలో, ఢోక్లాలో వండితెచ్చే వారు. దారంతా పటుకుపటుకు మనిపించడానికి చక్లీలు సరేసరి. ఇక, వారింటి ఆడవారికి పిండివంటల తయారీ ఒక ముచ్చట అయ్యింది. కళకళలాడుతూ పాలవ్యానులెక్కుతున్నా తమ కన్నబిడ్డలను ఊరి పొలిమేర దాటేదాకా సాగనంపనిదే వారికి తనివితీరేది కాదు! ముఖ్యంగా నీలు తల్లికి!

ఆడపిల్లల కళాశాలకు చుట్టూ కట్టి వున్న ఎత్తైన ప్రహరీగోడలు, వాటిపై నుంచి తొంగిచూస్తున్న దట్టమైన చెట్ల తలలు. ఇవన్నీ తండ్రులకు బాగా నచ్చాయి. విద్యార్థినులు ఒకసారి లోపలికి వెళితే ఇక మళ్ళీ వీళ్ళు వెళ్ళేవరకు బయటకు పంపరు.

అంతా కట్టుదిట్టం! అయినప్పటికీ, ఊరకుండలేరు కదా, ఊరిలోని యువకులు!

తమలో తామే ఒక స్వచ్ఛంద దండును తయారుచేశారు. రోజుకొక బృందం వంతులేసుకొని, ఆడపిల్లలతోపాటు అటూ ఇటూ ప్రయాణిస్తారు. మధ్యాహ్నం రొట్టెలు, కూర, జీలకర్ర పొడి కలిపిన మంచి మజ్జిగను అందిస్తారు.

ఆ ఏడాది నవరాత్రికి, ఈ ఆడపిల్లలు తమ కళాశాలలో నేర్చుకొచ్చిన కళలన్నీ ఊళ్ళోని ఆడపిల్లలకు నేర్పారు. బడిలో కొత్త పాటలను, నాట్యాలను, నాటకాలను- నాజూకుతో కలగలపి ప్రదర్శిస్తుంటే- ఊరు ఊరంతా మురిసిపోయారు. 'ఎంతయినా చదువుకొన్నవారి తీరే వేరుకదా!' అందరూ

## చతురలో ఇది రెండో నవల



చంద్రలత

నెల్లూరులోని సిమ్స్ సెంటర్ ఫర్ చైల్డ్ హెల్త్‌లో అడ్మినిస్ట్రేటర్‌గా పనిచేస్తున్న నేను మహబూబ్‌నగర్ జిల్లా, మానవపాడు మండలంలోని శ్రీనగర్ గ్రామంలో 1969లో పుట్టాను. ఆంగ్ల సాహిత్యంలో ఎం.ఎ. చేసిన నాకు రచనా వ్యాసంగం అంటే మక్కువ. ఇంతవరకూ నేను రాసిన మూడు నవలలు, యాభైకి పైగా కథలు, నలభై వ్యాసాలు వివిధ పత్రికల్లో అచ్చయ్యాయి. మొదటి నవల 'వర్ధని' చతురలో 1996లో వచ్చింది. 'రేగడి విత్తులు' తానా నవలల పోటీలో అత్యుత్తమమైనదిగా ఎంపికయింది. 'నేను నాన్ననవుతా', 'ఇదం శరీరం', 'వివర్ణం' అనేవి నాకథా సంపుటాలు. ఇంగ్లిష్, హిందీ, మరాఠీ, కన్నడ భాషల్లోకి నా రచనలు అనువాదమయ్యాయి. 1995లో నిర్వహించిన 'విపుల' కథలపోటీలో 'నేను నాన్ననవుతా' కథకు బహుమతి వచ్చింది. ఇంకా జిల్లా, రాష్ట్రస్థాయి అవార్డులు పొందాను. 'వాళ్లూ.. వీళ్లూ.. పారిజాతాలు!' చతురలో వస్తున్న నా రెండో నవల.

చిరునామా :
చంద్రలత
16-4-232, ప్రభవ,
పొగతోట, నెల్లూరు - 524 001

మెటికలు విరిచారు.

భట్ దంపతులు ముసిముసినవ్వులు నవ్వుతూ, నలుగురితోనూ నాట్యాలు చేశారు. కోలాటాలు వేశారు. కవితలల్లి పాడారు.

నీలు, ఆమె స్నేహితులు ఎంతో సంతోషంగా ఉన్నారు.

నవరాత్రి అలా దాటిందో లేదో దీపావళి రోజులు దగ్గర పడ్డాయి.

సరిగ్గా ఏరోజో గుర్తు లేదుకానీ, ఒక అపురూప దృశ్యం నీలు కంట పడింది. హిమ్మత్‌నగర్ నుంచి మెహసానాకి వెళ్ళే రోడ్డు వాళ్ళ కాలేజి వద్దే చీలుతుంది. సరిగ్గా అక్కడే ఆ దృశ్యాన్ని చూసింది.

**కొత్తగాలి...**

**ఆస్తికులకు**
**నాస్తికులకు**
**ఇష్టమైన ఆలయం**
**గ్రంథాలయం**

– శ్రీకాళహస్తి వెంకట శేషగిరిరావు,
నెల్లూరు

తన ఈడుకి కాస్త అటూ ఇటుగా ఉన్న ఒక అమ్మాయి, ఇంచుమించు మరో ఏడాదో రెండేళ్లో పెద్దవాడయిన అబ్బాయి ఝామ్మని మోటర్ సైకిల్‌పై వచ్చి ఆగి మళ్ళీ సాగిపోవడం.

ఆ అమ్మాయి తమలాగా ఛనియాఛోళీ వేసుకొని లేదు. దుపట్టా లేదు. ఝూంఘట్ లేదు. అలాగనీ, షల్వారు కమీజు వేసుకో లేదు. అచ్చం అబ్బాయిల్లాగా ప్యాంటు, షర్టు వేసుకొంది. అది కూడా ఆమె ఆకృతికి అతికినట్లుగా! జుట్టును సరిగ్గా చెవి తమ్మె వరకు కత్తిరించి వదిలేసింది, అలలు అలలుగా.. ఆ జుట్టు కిందుగా వేలాడుతున్న పొడవాటి జూకాలు.

ఇక ఆ అమ్మాయికి ఏమాత్రం తీసిపో లేదు- అబ్బాయి!

భుజాలదాకా జులపాల జుట్టు. ఉంగ రాలు తిరిగివుంది. మెడలో వరుసలు వరుసలుగా గొలుసులు. తలాడిస్తున్నప్పుడల్లా ఎడం చెవి తమ్మె మీద తళుక్కుమంటున్న చెవికమ్మ.

ఎంత తమాషాగా ఉందో!

ఇక ఆ అమ్మాయి ఒకచేయి అతని భుజం మీద, రెండోచేయి నడుం చుట్టూ వేసి, భుజం మీదుగా వంగి అతనితో గల గల కబుర్లాడుతూనే ఉంది. ఎలాంటి జంకూ గొంకూ లేకుండా.

వాళ్ళు తిన్నగా మలుపు దగ్గర ఓ మారు ఆగి, మెహసానాకు దారడిగి, వచ్చినంత వేగంగా దూసుకుపోయారు. మెరుపు మెరిసి మాయమైనట్లుగా!

వాళ్ళ చిత్రం కళ్ళకు కట్టినట్లుగా నీలు మనస్సులో ఇంకిపోయింది. మాటిమాటికి తలపుకొస్తూ అలాగే నిలిచిపోయింది.

నిజానికి ఆ జంట అలా తటస్థపడడం కలో మాయో కూడా నీలుకి తెలియలేదు. రాధాకృష్ణుల చిత్రం పలుమార్లు చూసింది. గుర్రమెక్కి వచ్చే రాజకుమారుడు, సుందర సుకుమార రాకుమారి ఎదురుచూపులు కథలు కథలుగా విని వుంది. ఆ ప్రేమను వివాహాన్ని పాటలుగా పాడుకొనేవారు. నాట్యాలు చేసేవారు.

ఇక, అడపాదడపా ఆ గోడమీద ఈ గోడమీద అంటించి ఉన్న సినిమా బొమ్మలు చూసింది. అంతగా పట్టించుకో లేదు.

కానీ, ఏ రాధాకృష్ణులో వేషభాషలు మార్చుకొని కళ్ళెదురుగా కదిలిపోయినట్లుగా ఏ రాచప్రేమికుల చిత్రపటమో జీవం పోసుకొని మూర్తిమంతమై తన ముందుగా సాగివెళ్ళినట్లుగా అనిపించింది.

మొట్టమొదటిసారిగా ఒక సున్నిత మనోహర భావనకు నిలువెత్తు రూపాన్ని చూసింది. ఆ అవ్యక్త అనుభూతి అణువ ణువునా వ్యక్తపరుస్తూ తరలివెళ్లిన ఆ జంట కోసం- ఆ దారంట సాగే ప్రయాణి కులలో వెతకసాగింది, తనకు తెలియకుం డానే.

వారయితే కనబడలేదు కానీ, అంతకు మించిన అందమైన దృశ్యాలెన్నో ఆమె కంటబడ్డాయి. ఎక్కడో వికసిస్తోన్న పారి జాతాల సుమసౌరభం ఆమె చుట్టూ మెల్లిగా విస్తరించసాగింది. ఉక్కిరిబిక్కిరి చేయసాగింది.

కళాశాల అవ్వగానే పాలవ్యాన్ ఎక్కి, స్నేహితురాళ్ళతో చక్లీలో మరమరాలో పటుకుపటుకు మనిపిస్తూ- గలగల కబు ర్లాడే నీలు- ఇప్పుడు అప్రయత్నంగానే తన చూపుల్ని ఆ వ్యాన్ కిటికీ అద్దాల నుంచి రోడ్డుమీద సాగే వాహనాలవైపు, వాహ నాల పైని మనుషులవైపు సారిస్తోంది. గోడలపై పలకరించే రంగురంగుల తారలు ప్రాణం పోసుకొని, ఆమెతోపాటు ప్రయాణించసాగారు.

నీలు కట్టుబొట్టు, మాట మన్ననలో ఏదో తెలియని మార్పు చోటు చేసుకోసా గింది, నిశ్శబ్దంగానే!

★ ★ ★

ఆరోజు సాయంకాలం కళాశాల వది లాక, పాలవ్యానుల రాకకోసం ఎదురు చూస్తున్నారు.

నీలు యథాలాపంగా అటూ ఇటూ తేరి పారజూస్తోంది.

అందరూ గుంపుగా నిలబడి గలగల కబుర్లాడుకొంటున్నారు. శేఫాలీ కూడా వారితో జత కలిసింది.

ఒక ఘామిడి అమ్మాయి తన చిన్నాచి తక ఆరోగ్య సమస్యలన్నిటినీ ఏకరువు పెడుతోంది.

ఉండు! నీకో బ్రహ్మాండమైన చిట్కా చెప్తా! చిటికెలో వస్తా! శేఫాలీ గబగబ వెళ్ళి, ఓ చెట్టు వద్ద ఆగింది. వాళ్లెవరూ ఇన్నాళ్లుగా తమ కాలేజీ దక్షిణం గోడవా రగా గుంపులుగా పెరిగిన చెట్లను దగ్గరగా గమనించలేదు.

చెట్టు వంక శ్రద్ధగా చూస్తూ నిలబడ్డ శేఫాలీ వద్దకు ఆసక్తిగా బిలబిలలాడుతూ పిల్లలంతా చేరారు.

"రాత్ రాణీ!" అందరూ ఆశ్చర్యం, ఆనందం కలగలిసిన గొంతుతో సంబ రంగా అరిచారు.

"అందుకే, పగలు వచ్చిపోయే మన కంట పడలేదు!"

"ముక్కున పడలేదు అను!"

> **కొత్తగాలి...**
>
> **నీళ్లు లేకుండానే**
> **మునిగి తేలుతున్నా**
> **ప్రేమలో పడ్డాను కదా!**
>
> – పి. సునీల్,
> పెద్దకొట్టాల, నంద్యాల

అందరూ పగలబడి నవ్వారు.

"రోజూ పొద్దున్నే ఈ లేత ఆకులు రెండింటిని నాలుగు మిరియాలు వేసు కొని, కషాయం చేసుకొని తాగు! నీ ఋతు రుగ్మతలన్నిటినుంచి రక్షణ దొరుకు తుంది"

"నిజంగా? " అడిగిన అమ్మాయి ఆశ్చర్య పోతూ ఆ ఆకుల్ని తన అరచేతిలో అపు రూపంగా తడిమింది.

"అవునట! ఈ రహస్యం నాకు బస్తర్ ప్రాంత మహిళలు చెప్పారు. వారి అనుభ వసత్యం!"

ఆ అమ్మాయి అరచేతిలోని చిన్ని గరుకు చిగురును తాకి చూసి- అందరూ మరింత ఉత్సాహంతో అరిచారు.

"హర్‌సింగార్!" ఓ హిందీ అమ్మాయి అంది.

"ఘాలీ!" మరో బెంగాలీ అమ్మాయి అంది. "శేఫాలికా"! అంతలోనే మళ్ళీ అంది.

"శేఫాలికా" అమ్మాయిలంతా అల్లరిగా అరుస్తూ శేఫాలిని చుట్టుముట్టారు.

"మేడం, మీ పేరులోనే రాత్‌రాణిని ముడిచిపెట్టారన్న మాట!" ఒకమ్మాయి ముక్కువిరిచి ముచ్చటగా అన్నతీరుకు అందరూ పకపక నవ్వారు.

శేఫాలి ఒక్కసారిగా సిగ్గుపడింది.

"అందుకేనా మీకీ చెట్టంటే ఇష్టం? "

"కావచ్చేమో కానీ, వృక్షశాస్త్ర విద్యార్థినిగా మూలికలపై కొంత పరిశోధన చేశాగా. పైనుంచి మన చుట్టూ ఉన్న ప్రతి మొక్కా ఎన్ని కథలని చెపుతుందో.. కదిలిస్తే చాలు!

"నిజమే.. నిజమే.." అందరూ తలూపారు.

"మేడం, నిజంగానే పారిజాతానికి ఔషధ గుణాలు ఉన్నాయా? మనం పూజకు వాడే పవిత్రమైన పూలిచ్చే చెట్టనే మాకు తెలుసు ఇన్నాళ్ళు"

"ఔషధ ప్రాధాన్యం చేతనే పవిత్రత ఆపాదించబడిందేమో నీలూ- ఔషధ గుణాలన్నీ కాలానుగుణంగా మరుగున పడిపోయాయి.. పవిత్రత మిగిలిపోయింది" శేఫాలీ ఓ క్షణమాగి అంది, "బాగ్‌బెహరా ప్రాంతీయులు కేశ సంరక్షణకు ఈ గింజలపొడిని నీటితో రంగరించి వాడతారు. ఆవనూనెతో ఈ ఆకురసాన్ని రంగరించి చర్మవ్యాధుల్ని అరికట్టుకొంటారు. ఛత్తీస్‌గఢ్ ప్రాంతీయులు జీర్ణసంబంధ వ్యాధులకు పారిజాత పూల కషాయాన్ని వాడతారు. మూలశంకకు ఈ కషాయం తిరుగులేని మందు. ఆకులతో చేసిన పొడిని తేనెతో రంగరించి క్రమం తప్పక తీసుకొంటూ పొడిదగ్గును నయం చేసుకొంటారు. దుర్గ్, పఠాన్ ప్రాంతీయులు జీర్ణకోశ వ్యాధులతో పాటు కొన్ని మొండిజ్వరాల నివారణకు మరికొన్ని మూలికలతో కలిపి వాడతారు. నడుంనొప్పి, కీళ్ళనొప్పులు, సియాటిక్ నొప్పులను తగ్గించడంతోపాటు కాలేయ, జీర్ణకోశ, రక్షణను ఇస్తుంది. రోగనిరోధక శక్తిని పెంపొందిస్తుంది. అద్భుతమైన భేదిమందు"

"ఆధునిక వైద్యం ఒప్పుకుంటుంది? "

"ఇవన్నీ జీవశాస్త్ర విద్యార్థినిగా నేను నేర్చుకొన్న అంశాలే. ఈ ఆధునిక ఔషధాలన్నీ స్థానిక జ్ఞానాన్ని మూలం చేసుకొని కొనసాగించిన శాస్త్రీయ పరిశోధనా ఫలాలే"

అందరూ మరింత శ్రద్ధగా వినసాగారు.

"మనదేశం అనేకానేక వనమూలికలకు పుట్టినిల్లు. మన ప్రకృతి జ్ఞానం ప్రాచీనమైనది. ఆయుర్వేదానికి ఆ అనుభవ జ్ఞానమే కదా మూలం? మనం నాగరికులమవుతూ ఆ అనుభవ జ్ఞానాన్ని పోగొట్టుకొంటూ వస్తున్నాం. తెలిసీ తెలియక అపురూపమైన మూలికలన్నిటినీ చేజేతులా అంతరింపజేసుకొంటున్నాం. తరతరాల అనుభవసారాన్ని చేజార్చుకొంటున్నాం!" శేఫాలీ నిట్టూర్చింది.

ఆమె ఇంత గంభీరంగా మాట్లాడడం వారికి కొత్తగా ఉంది.

"చూడండి. పవిత్ర భావనతోనో పారవశ్యంతోనో ఓ మొక్క నాటి పెంచుతున్నామే కానీ, దాని మూలికా విలువలను మనం మరిచిపోయాం!" శేఫాలీ మౌనంగా ఉండి మళ్ళీ అంది, "నిజమే, ఆ పారిజాతం తన బలవత్తరమైన సమ్మోహక శక్తి వలననే ఇంకా ఈ భూమిపై

నిలిచి ఉంది!"

శేఫాలీ ఒక్కసారిగా అందరూ మౌనంగా ఉండడం గమనించింది.

"అరరే! పదండి! తలా ఓ ఆకో, కాయో తీసుకోండి!"

ఇక అంతే. శేఫాలీతో పాటు అందరూ తలా ఓ చెయ్యేసి- పారిజాతాల చెట్ల ఆకులు, గింజలు, కాయలు- చేతికందిన వన్నీ కోసేసి- చెట్టును దులిపేశారు. నీలు చూపులు వారి అడుగులతోపాటు సాగాయి.

ఎండుటాకులు, రాలిన రెమ్మలు, అక్కడక్కడా మొలిచిన గడ్డి, గరికలో చెల్లాచెదురుగా పడివున్న వాడిన పారిజాతాలు. అమ్మాయిలు తమ ఉత్సాహంలో వాటిని తొక్కుతూ తిరుగుతున్నారు.

నీలు అప్రయత్నంగా పక్కకు అడుగేసి, తన పాదాల కింద పరిశీలనగా చూసింది.

తనకు తోచినన్ని పూలను సేకరించింది. అక్కడక్కడా పుడకలతోపాటు పడివున్న కాయల్ని తన చేతిలోకి తీసుకొంది. పరిశీలనగా చూసింది. హృదయం ఆకారంలో చక్కగా మలచినట్లున్నాయి.

"మన రేరాణిని పాశ్చాత్యులు ఏమంటారో తెలుసా? విషాదమల్లి అని!" దీక్షగా కాయల్ని పరిశీలిస్తున్న నీలుతో బిగ్గరగా అంది శేఫాలీ!

"అంటే, ఏడుపుగొట్టు చెట్టన్న మాట!" ఒకమ్మాయి తన కవితాత్మను ప్రకటించేసింది!

"నిజం! ఇది ట్రీ ఆఫ్ సాడ్‌నెస్.. ట్రీ ఆఫ్ సారో"

"నిజం.. నిజం! ఇది విషాదమల్లి.. ఆమె రాత్‌రాణి గాదు. ఒక అందమైన రాకుమారి" అప్పటివరకూ మౌనంగా ఉన్న ఒకమ్మాయి మెల్లిగా అంది.

అప్పటికే పాలవ్యాన్ హారన్ విని, తిరుగుప్రయాణమైన వారందరూ ఆ అమ్మాయి పలికిన తీరుకు కుతూహలంగా, ఆమె చుట్టుముట్టారు.

గుంపుగా ముందుకు నడుస్తూ ఆ అమ్మాయి కొనసాగించింది.

"ఆమె ఒక అందమైన రాకుమారి. ఆమె సూర్యుణ్ణి ఎంతో గాఢంగా ప్రేమించింది. కాని సూరీడు ఆమె ప్రేమను తిరస్కరించాడట. ప్రేమభగ్నమై ఆమె ఆత్మత్యాగం చేసిందట. ఆమె చితాభస్మం నుంచి, చిగురేసి ఓ మొక్క మొలిచిందట. ఆమె తన దుఃఖాశ్రువులన్నిటినీ మొగ్గలుగా దాల్చి, రేయంతా ప్రేమగా పుష్పించి, సూర్యుడి రాకకై పడిగాపులు గాచి, తొలి సూర్యకిరణం సోకక మునుపే, తన ప్రేమను కన్నీటిబొట్లుగా రాల్చుతుందట. అందుకే నేలమీద పడినా దేవుని మెడలో చేరేంత పవిత్రమైనవి ఆ పూలు.."

ఆ అమ్మాయి ఆపకుండా చెప్పింది. అందరూ ఊపిరి బిగబట్టి ఆసక్తిగా విన్నారు. ఆశ్చర్యం, ఆసక్తి కలగలసిన ఒక వింత అనుభూతి వారిని కమ్మేసింది.

నీలు తెలియని దిగ్భ్రమకు లోనయింది. తనెంతో ఇష్టపడే రాత్‌రాణీ వెనక ఇంత విషాదభరిత గాథానురక్తి ఉంటుందన్న భావనే, ఆమెను విస్మయురాలిని చేసింది.

"ఆ రాకుమారి ఎవరో నాకు తెలుసు!" శేఫాలీ అందర్నీ లోకంలో పడేసింది

"పారిజాతక"

అందరు హుషారుగా నవ్వారు.

"అలా- ఆ చెట్టును పారిజాతం అని పిలవడం మొదలెట్టామన్న మాట. ఇక శ్రీకృష్ణుడి పారిజాతాపహరణం, సత్యభామ రుక్మిణిల సంవాదం మీకు తెలిసిందే కదా? "

"తెలియదు మేడం- చెప్పండి" నలుగురయిదుగురు అన్నారు.

"ముందు వ్యానెక్కండి. దారంతా చెప్పుకుందాం" శేఫాలీ వారిని ఉత్సాహపరి

చింది. ఇకనేం శేఫాలీ పరమోత్సాహంతో, ప్రేమ, శృంగారం, విరహం, దాంపత్యం, బంధం- మిళితమైన ఆ పారిజాతం కథ లన్నీ కమ్మగా చెప్పసాగింది. అమ్మాయిలు సరదాగా వాటికి ఘామిడి మజిలీ కథలు అని పేరు కూడా పెట్టుకొన్నారు.

కథల మధ్య మధ్యలో శేఫాలీ చటు క్కున సమాచారం అందించేది.

"మీకు తెలుసా- దక్షిణాదివారు రేరాణిని పవడపుమల్లె అంటారు. దీని కాడ పగ డంతో చెక్కినట్లుగా ఉంటుంది కదా- అందుకు!"

అమ్మాయిలు అర్థాలు అడిగి తెలుసుకొం టున్నారు. పరమార్థాలు కూడా విడమరిచి చెపుతోంది శేఫాలి.

"ఒక చెట్టు చుట్టూ ఎన్ని ఊహల అల్లు కుంటాం కదా?" నీలు ఓమారు అప్రయత్నంగా వ్యాఖ్యానించింది.

"ఊహూ! జీవితాలు అల్లుకుంటాయి!" శేఫాలి నవ్వింది.

పదేపదే శేఫాలి చెబుతోన్నది చెబుతు న్నట్లుగానే ఉన్నది.

నీలు విన్న కథలే మళ్ళీ మళ్ళీ వినసా గింది. విన్న ప్రతిసారీ ఏదో కొత్త భావ నతో, ఆపై తొలి పొద్దులో పారిజాతాల మాల గుచ్చుతున్నప్పుడల్లా మునుపు లేని ఉద్వేగభావం ఏదో ఆమెను ఆవరించసా గింది. మరింత శ్రద్ధగా ఆ మాలలను గుచ్చి, పళ్ళెంలో వృత్తాలుగా పరిచింది.

ఒంటరిగా గుంపులుగా, ఒకరి తరువాత ఒకరు, ఒకరికి తెలియకుండా ఒకరు- రోజుకోమారన్నా ఆ పవడపు మల్లిని పల కరించి వస్తున్నారు. నీలు ఓమారు అలా పారిజాతం చెట్ల వద్ద నిలుచుని ఉండగా, ఓ కొత్త సంగతి గమనించింది.

గోడలో పగులు.

ఎవరో పనిగట్టుకొని పగలకొట్టి మరీ, రాళ్ళు పేర్చినట్లుంది. నీలు కుతూహలంగా అక్కడ నుంచి ఎగిరెగిరి చూసింది. అవత లివైపు సన్నని కాలిబాట ఉంది. ఎప్పుడైనా ఈ దోవను విద్యార్థులు వాడేవారేమో! నీలు రాళ్ళపైకి ఎక్కడానికి ప్రయత్నిం చింది.

"నీలూ.. వద్దొద్దు! ఆ రాళ్ళు కదిలించ వద్దు! అక్కడ తేళ్ళు జెర్రులు ఉండొచ్చు!" దూరం నుంచి పరిగెత్తుకుంటూ వస్తోన్న ఓ అమ్మాయి భయంగా కేకేసింది.

"తేళ్ళూ జెర్రులేం ఖర్మ! ఇవి పారిజాతం చెట్ల పొదలు. ఆ సువాసనకి ఏకంగా పాములే చేరి ఉండొచ్చు!" ఆట పట్టిస్తూ పకపక నవ్వింది నీలు.

"నా మాట విను, నీలు!" ఆ అమ్మాయి మొన్న రాకుమారి కథ చెప్పిన అమ్మాయి తమ ఊరి అమ్మాయి కాదు.

## కొత్తగాలి...

**నిజం**
**నిప్పులాంటిది**
**అబద్ధం నీళ్లు**
**చల్లనంత వరకే**

– ఈ వేమన,
శ్రీకాకుళం

"మేం ఘామిడీ వాసులం! మాకేం భయం?" నీలు నవ్వుతూనే ఆమె దగ్గరగా వచ్చింది. తన మాట మన్నించి రాళ్ళగుట్ట నుంచి ఈవలగా వచ్చినందుకు ఆ అమ్మాయి చాలా సంతోషించింది. ముఖ మంతా విప్పార్చి నవ్వింది. వారిద్దరి నడుమ స్నేహసౌరభాలు వికసించసా గాయి. నాలుగడుగులు వేశాక, వెనక్కి తిరిగి-

నీలు ఠక్కున అడిగింది, "నువ్వారోజు పారిజాత రాకుమారి కథ చెప్పావే- అది

నీకెలా తెలుసు? అది పురాణాల్లోది కదా? నీకు ఇవెలా తెలుసు? "

"అన్నయ్య చెప్పాడు"

ఆ రోజు తరువాత తరగతి గదిలోనూ ప్రయోగశాలలోనూ హిమ్మత్‌నగర్ అమ్మాయే నీలు బెంచ్‌మేట్ అయ్యింది.

పరీక్ష నాళికలో బంగరుతునకలు మెరిసిప్పుడు, ఇద్దరూ కలిసి చేసిన హడావుడి ఇంతని కాదు. మైలతుత్తపు నీలిరంగంటే ఇద్దరికీ ఎంత ఇష్టం కలిగిందో- అదే రంగులో నీలు దుపట్టా కొనుక్కుంది. ఆ అమ్మాయి గాజులు వేయించుకొంది. ఇక కుళ్ళిన కోడిగుడ్ల వాసనొచ్చే వాయువుకు

కొత్తగాలి... 

సముద్రానికవతల రాక్షసులు
రామాయణకాలం
కుటుంబంలోనే రాక్షసులు
భారతకాలం
ప్రతీ మనిషిలోనూ రాక్షసులు.. కలికాలం

– మిథున్, మార్టేరు, ప.గో.జిల్లా

ఇద్దరూ ఒకేలాగా- స్పందించారు. భళ్ళున వాంతి చేసుకుని!

ఆమ్లాలు బుసబుస పొంగినపుడు- బున్‌సెన్ బర్నర్‌లు నీలిమంటలు రువ్వినపుడు- ఒకరికొకరు అండగా నిలిచారు.

ఒకరోజు సాయంకాలం పాలవ్యాన్ వచ్చేలోగా, పక్కన నిలబడి కబుర్లాడుతుంటే, ఆ అమ్మాయి పానీపూరి తోపుడు బండి వద్ద నిలేసింది.

నీలుతోపాటు ఒకరిద్దరు ఘూమిడి అమ్మాయిలు జత చేరినా, ఏ మాత్రం సందేహించకుండా- డబ్బులు తనే ఇచ్చేది.

కొందరు ఘూమిడి అమ్మాయిలు వెనకాడారు.

వారివి సవాలక్ష సందేహాలు.

"నీలూ.. మనం శాకాహారులం!" నీలుని హెచ్చరించారు కొందరు.

"ఇదీ శాకాహారమేగా? "

నీలు వారి మాటలను తేలికగా కొట్టేసింది.

"ఎందుకొచ్చిన గొడవ చెప్పు? అందులోనూ వాళ్ళచేతి సొమ్ము తినడమా? " ఒకమ్మాయి అనేసింది, నమ్మశక్యం కానట్లుగా.

పానీపూరి రుచి మరిగిన పిల్లలు కొందరు- నోట్లో నీరూరుతుంటే- నీలుని వెనకేసుకొచ్చారు.

నిజానికి నీలుకి ఇదెంతో కొత్తగా ఉంది. ఆ హిమ్మత్‌నగర్ అమ్మాయి స్వయానా తన అద్దాల పర్సులోంచి డబ్బులు తీసి- స్నేహితుల కోసం ఖర్చు పెట్టడం- నీలుకి నచ్చింది.

తనకూ అలాగే చేయాలని ఉంది.

ఆ రోజు సంధ్యవేళ అమ్మ దగ్గర వదిన దగ్గర అడిగి చూసింది. ఎవరి దగ్గరా నయాపైసా లేదు. ఈ సత్యం ఆమెను నిర్ఘాంతపరిచింది.

సేద్యం కుంటుపడిన ఆ కాలంలో పాడిపైననే తమ తరమంతా ఆధారపడింది. ఆ పాడిని పండించే అమ్మ చేతిలో, వదిన చేతిలో- నయాపైసా లేకపోవడం నీలు అంచనాకి అందలేదు.

'పోనీ నాన్ననో అన్ననో అడుగుతా' నన్న నీలు ఆలోచనను ఆమె అమ్మ వదినలు ఆదిలోనే తుంచేశారు.. "లేనిపోని ఆరాలు, ఆపై సవాలక్ష ఆంక్షలు- ఎందుకమ్మా అవన్నీ" అంటూ.

ఏ బాటసారికో చాటుమాటుగా మజ్జిగ చుక్క నమ్మి, పదో పరకో నిలిపి- నీలుకి ఇచ్చారు. పుట్టింటివారు పండక్కో పబ్బానికో వారికిచ్చిన తృణమో ఫణమో- పోగు

చేసి- నీలు చేతికివ్వసాగారు.

పిల్లల చిన్న చిన్న సరదాలు తీర్చకపోతే ఎలా? అని.

ఆపై నీలు స్వయంగా తన ఘూమిడి మిత్రురాళ్ళకు పానీపూరి, భేల్‌పురి, రగడా సమోసాలు- వేడివేడిగా తినిపించసాగింది.

ఇక ఎవరికి ఏం అభ్యంతరం ఉంటుంది?

పైనుంచి, రోజంతా పాఠాల అలసట, పాలవ్యాన్‌లో పల్లెకు తిరుగు ప్రయాణంలో హూనమవ్వబోయే వొళ్ళు- వీటి మధ్యలో ఈ ఛాట్ సరదా- ఓ కమ్మని ఆటవిడుపు అయ్యింది. వారితోపాటు ఎప్పుడైనా నీలు ఆ హిమ్మత్‌నగర్ అమ్మాయికి ఓ ప్లేట్ తినిపిస్తే వారు పెద్దగా పట్టించుకోవడం మానేశారు. ఒకమారు ప్రయోగశాలలో అయస్కాంత క్షేత్రాలు కొలుస్తుండగా, మెల్లిగా కదిలించింది నీలు.

"జౌనబ్బా, నీ దగ్గర అంత డబ్బెలా ఉంటుంది? "

"అన్నయ్య ఇస్తాడు!" ఆమె హుషారుగా అంది.

మరొకమారు ఘూమిడి విద్యార్థులంతా పాలవ్యానెక్కి బయలుదేరబోతున్నా, ఇంకా పుస్తకాల సంచి తగిలించుకొని వంటరిగా నిలబడ్డ ఆమెను చూసి, నీలు దగ్గరగా వెళ్ళింది. హుషారుగా వీడ్కోలు చెపుతున్న ఆమెను అడగకుండా ఉండలేకపోయింది.

"ఇవ్వాళ ఇంటికి వెళ్ళవా? "

"అన్నయ్య వస్తాడు!"

"కొత్త చెప్పులు- భలే ఉన్నాయి!"

"అన్నయ్య తెచ్చాడు!"

వారికి తెలియకుండానే మెల్లిమెల్లిగా ఆ 'అన్నయ్య' వారి కబుర్లలో ఓ భాగమైపోయాడు. అతనితోపాటే వారి బొంబాయి బంధుమిత్రులు, ఆపై బొంబాయి వింతలు విశేషాలు, హిమ్మత్‌నగర్ నుంచి అహ్మదాబాద్‌కు అక్కడి నుంచి బొంబాయికి ప్రయాణాలు. ఆ అమ్మాయి ఎంతో జనరంజకంగా చెపుతుండేది.

పైనుంచి, అన్నయ్యతోపాటు తాను దర్శించిన ప్రదేశాలు, చేసిన సరదాలు, ఆటలు, సరదా కబుర్లు- అన్నయ్య తెచ్చిన కానుకలు, పంపిన గ్రీటింగ్స్, అన్నయ్యతో తగువులు, అలకలు, బతిమిలాటలు- ఇలా ఆమె చెపుతూ ఉంటే, నీలుతోబాటు అందరూ ఆశ్చర్యంగా వినేవారు.

చివరికొకరోజు పాలవ్యాను ఎక్కబోయేలోగా, ఆ అన్నయ్య రయ్యిన రానే వచ్చాడు. ఠక్కున వీరి ముందు సడన్ బ్రేకేసి, బైక్ ఆపి, ఒక కాలుని నేలపై ఆన్చి, విలాసంగా నవ్వాడు.

"ఇతనే మా అన్నయ్య!" అమ్మాయిలందరికీ కలిపి ఒక పరిచయం గాల్లోకి విసిరేసి, గబుక్కున అతని వెనక ఎక్కింది ఆ హిమ్మత్‌నగర్ అమ్మాయి.

హెల్మెట్ తీసి, విలాసంగా నవ్వేసి, తల పంకించి, మళ్ళీ హెల్మెట్‌ను ధరించి- బైక్‌ని కిక్‌స్టార్ట్ చేశాడు.

మోటార్ సైకిల్ ఝూమ్మని దూసుకుపోయింది.

ఈ అమ్మాయి అందరికీ చేయి ఊపింది వీడ్కోలంటూ.

అతన్ని చూడగానే ఘూమిడి అమ్మాయిలంతా భయంతో వణికిపోయారు. ఒక గుంపులా చేరి గుసగుసలాడారు. పంచాయితీ పెద్దలంతా చేసిన హెచ్చరికలను వారు గబగబ మననం చేసుకొన్నారు. గ్రామసభకు వ్యతిరేకంగా వ్యవహరించడంలో తలెత్తే పరిణామాలను మాట్లాడుకొన్నారు.

అన్నమాట తన చెవికే వినపడేటంత మెల్లిగా అందో అమ్మాయి.

"అమ్మో! ఇంకేమయినా ఉందా? ఇక వాళ్ళ జోలికి మనం పోకూడదు!"

నీలు కూడా అందరితోపాటు అంగీ

కారంగా తలూపింది.

అయినా, ఆ హిమ్మత్‌నగర్ అమ్మాయి కాలేజీలో అనుక్షణం అనుయాయి కదా?

శేఫాలీకి ఎలా తెలిసిందో ఏమో- నీలు ముభావంగా ఉండడాన్ని ప్రశ్నించింది.

"ఏమీ లేదు. ఆడపిల్లల రాజకీయాలు! నేను మరోచోట కూర్చుంటా. మీరు నిశ్చింతగా ఉండండి!"

నీలు అంటీ ముట్టనట్లుగా వ్యవహరిస్తున్నా, ఆమె ధైర్యం ఇంకా బలమైనది. తన తండ్రి గురించి తనకున్న అపారమైన విశ్వాసం, అతనికి తనపైన ఉన్న అచంచలమైన నమ్మకం. పొద్దున్న తలపాగా

## కొత్తగాలి...

**నూలు చావులు**
**సెజ్ చావులు**
**మైక్రో చావులు**
**రాస్తూ ఉంటే రావులు రావులు**

*- తల్లాప్రగడ నాగేష్,*
కాకినాడ

చుట్టడం దగ్గర నుంచి రాత్రి తులసి ఆకు వేసిన వేడిపాలు అందించేవరకు ఆయన నిరంతరం కలవరించే తన పేరు- నీలుకి తనమీద తనకు ఎక్కడా లేని ఆత్మవిశ్వాసాన్ని ఇచ్చింది.

కులపెద్దగా మంచి మాట అంటూ కట్టడి చేయాలనుకొంటాడే కానీ, తన తండ్రి మనసు వెన్న అని నీలు మురిసిపోయింది.

మానవ సహజంగా ఉన్న కుతూహలమో, ఇంకా వీడని బాల్య చాపల్యమో- వద్దన్న పని చేయడంలో నీలు సిద్ధహస్తురాలు.

ఇంతకుమునుపు కన్నా ఆసక్తిగా, మరింత శ్రద్ధగా అతని రాకపోకల్ని గమనించసాగింది. ఆ రోజు అకస్మాత్తుగా బైక్ ఆపి మెహసానాకు దారడిగిన యువకుడు ఇతనేనేమో అన్న భ్రాంతి కలిగింది. అతనికన్నా ఇతను మరింత నాగరికంగా కనబడసాగాడు. మెల్లిమెల్లిగా ఆ బైక్, హెల్మెట్- వాటితోపాటు అతను, అతని బొంబాయి ప్రయాణాలు, విశేషాలు- నీలుని నిశ్శబ్దంగానే చేరసాగాయి. క్రమక్రమంగా నీలులో నిండిపోసాగాయి.

పురికొసలు ముడేసిన పాలవ్యాన్లు ఒకదానితో ఒకటి కొట్టుకొంటుంటే- కుదుపుల్లో మలుపుల్లో పాలవ్యాన్- తమను ఎత్తెత్తి వేస్తుంటే- ఇరికిరుకుగా ఒకరిపై ఒకరు తోసుకుంటూ కిక్కిరిసి కూర్చోడం- నీలుకు నచ్చడం మానేసింది.

నిత్యం అవే ముఖాలు- అవే మాటలు- అదే భయం- అదే ప్రయాణం.

ఎటువంటి సాహసం, అద్భుతం లేని ప్రయాణాలు. ఎటువంటి మార్పులేని ప్రయాణాలు. మరో రెండేళ్ళు. ఆపైన చదువు కొనసాగిస్తే మరో మూడేళ్ళు.

ఆ ఊహకే ఆమె ఉక్కిరిబిక్కిరి కాసాగింది.

ఉదయంపూట నిండు క్యాన్ల నుండి ఒలికే పాలు.

సాయంత్రం ఖాళీ క్యాన్ల డమడమలు.

ఇవన్నీ నిత్యకృత్యమైపోయాయి. ఏ మార్పు లేకుండా ఒక నిర్ణీత జీవన విధానంలో తను బిగించబడినట్లు ఆమెకు తోచసాగింది.

కులాసాగా విలాసంగా తన హిమ్మత్‌నగర్ స్నేహితురాలిలా- స్వేచ్ఛగా మోటార్‌సైకిల్ ఎక్కి, ఝామ్మని లోకమంతా చుట్టేయాలన్న చిన్న కోరిక బలపడసాగింది.

తమ వ్యాన్‌కు ముందు వెనుక సాగే రక్షక బృందం ఆంక్షలు మితిమీరసా

గాయి. పైనుంచి గ్రామంలో తమమీద ఫిర్యాదుల చిట్టా- ఆ దరిమిలా బెదిరింపుల కొరడా- నీలుకి ఊపిరాడడం లేదు. కట్టడిలేని ఒక అనుభవం కోసం నీలు తహతహలాడసాగింది.

స్వేచ్ఛా జీవితంమీద ఆమెలో తలెత్తిన ఊహలు ఇంతై ఇంతింతై- ఆమెనంతా ఆక్ర మించేశాయి.

ఒకరోజు నీలు అనుకున్నంత పనీ చేసింది!

ఘామిడి గ్రామం అదిరిపడింది!

ఇల్లిల్లు హాహాకారాలతో దద్దరిల్లింది!

కరవాలాలు కస్సున గాలిలోకి లేచాయి.

శేఫాలీభట్ పెద్దల ముందు నిస్స హాయంగా తలదించుకుంది.

పాలవ్యాన్ డ్రైవర్ పంచాయతీ పాలబ డ్డాడు.

వ్యాన్‌కు అటూ ఇటూ వెళ్ళే రక్షక బృందం- బిత్తరపోయింది.

ఊరివారి ముందు సంజాయిషీ ఇచ్చుకో వాల్సిన అవమానం- వారిని దహించివే సింది. పంచాయితీ పెద్దల పరుషవా క్యాలు వారి పౌరుషాన్ని రెచ్చగొట్టాయి. దెబ్బతిన్న అహం- వారిలో కట్టలు తెంచు కొన్న కోపంలా మారింది.

తమ వారిముందు తాము సిగ్గుతో తల దించుకోవాల్సి వచ్చిన ఓటమి- వారిని ఆగ్రహోదగ్రుల్ని చేసింది. తాము కళ్లలో వత్తులు వేసుకొని కాపలాలు కాసినా, తమ కళ్లనే కప్పి, తమ ఊరి ఆడపిల్లను మాయం చేసిన వాళ్లను కరవాలానికి బలి చేయనిదే తాము పొలిమేర తొక్కబోమని భీషణ ప్రతిజ్ఞ చేశారు. రక్తతిలకాలు దిద్దు కొని- నేల దద్దరిల్లేలా తలోవైపు పరు గులు తీశారు.

కనుమూసి తెరిచేంతలో తమ కనురెప్ప లను కత్తిరించి వేసిన ఈ ఘోర అఘాయి త్యానికి, నీలు నాన్న- దిమ్మెరపోయాడు.

కన్ను మిన్ను కానకుండగా కావరమె క్కేలా ఇంటి ఆడపడుచులను పెంచినం దుకు- తండ్రి తల్లిని- అన్న వదినను నిందించి- తీవ్రంగా దండించారు.

వాళ్లిద్దరూ గుండెలవిసేలా ఏడ్చినా- తలలు బాదుకొని మొత్తుకున్నా- వారి కన్నుల్లో కాలువలు పారినా- కనబడిన వాళ్లందరి కాళ్లవేళ్లా పడినా- తండ్రీకొడు కులు వారిద్దరి మీదా ఎలాంటి కనికరం చూపలేదు. ఎవరినీ చూపనీయలేదు.

ఊరు ఊరంతా అత్తా కోడళ్లను ఈస డించింది.

అంతేకాదు. ఆ తీవ్రత అటు తల్లి పుట్టింటి వారినీ- ఇటు వదిన పుట్టింటి వారినీ తాకింది. ఉరుకులు పరుగుల మీద బంధుమిత్ర సమేతంగా కట్టెలు, కరవాలా లతో ఘామిడి గ్రామం చేరారు. కూతు ళ్లను, తమ వంతు నిందించి, దండించి- అల్లుళ్లకు బాసటగా నిలబడ్డారు. అందరూ కలిపి నీలుని వెతకటం మొదలెట్టారు.

ఈలోగా శేఫాలీ అందచేసిన సమా చారం ప్రకారం- నీలుతో చనువుగా ఉండే హిమ్మత్‌నగర్ అమ్మాయి- ఇంటికి ఒక బృందం చేరుకుంది.

ఆ అమ్మాయి తనకేమీ తెలియదని ఏడ్చి మొత్తుకొన్నా వినకుండా- రక్షక బృందం ఆ అమ్మాయిని జుట్టుపట్టి వీధిలోకి బర బరా ఈడ్చుకొచ్చింది. నడివీధిలో నిలబెట్టి- నిలదీశారు.

"ఆఖరుసారి నీలు పారిజాతం చెట్లవైపు వెళ్లడం చూశానంతే!"

ఆమె బెక్కుతూ అంది.

అప్పటిదాకా ఏమీ తెలియదని ఇప్పుడు ఎటువెళ్లానో చూశాననడం- వారి కోపం నసాళాన్నింటింది. అంతే, ఆమె నవరగం తలు పగిలేలా చెంపలు వాయించారు. అడ్డం వచ్చిన వారందరినీ- అక్షరాలా నరికి పారేశారు. అందితే కట్టె, అందకుంటే కర



వాలం. ఆ ఇంట్లోని సామానంతా చిందర వందర చేశారు. ఇంటిలోని వారందరినీ భయభ్రాంతులకు గురిచేశారు.

ఇంటిముందు కుండీలను పగలకొట్టారు. ఇంటి కిటికీల అద్దాలను బద్దలు కొట్టారు.

అంతే, నీలు ఎటుపోయిందో వారికి తెలిసిపోయింది.

పారిజాతం చెట్ల గుబుర్ల వెనుక గోడలోని పగులు, పగులులో పేర్చిన రాళ్ల గుట్ట, ఆవలగా సన్నని కాలిబాట- అన్నీ గడగడా వణుకుతూ ఆ అమ్మాయి నోట తొణికాయి.

'కుప్పకూలిపోయిన ఆ అమ్మాయిని వదిలి- అందరూ ఎనిమిదో నెంబర్ రహదారి పట్టారు!

ఇక, ఆ అమ్మాయి సంబంధీకులు, బంధువులు- పటపట పళ్లు నూరారు. కత్తులు, కటార్లు ఆకురాతి పైకెక్కాయి.

తమందరి కళ్లముందే తమ ఊరి ఆడపిల్ల చెంప ఛెళ్లుమనిపించి- తమను వెర్రి వెంగళాయిలను చేసిన వారందరి వివరాలను సేకరించసాగారు.

బృందాలుగా.. విడివిడిగా.

ఎంత ప్రయత్నించినా ఏ ఒక్కరూ సమాచారం ఇవ్వలేదు.

స్పృహ తప్పి పడి ఉన్న ఆ అమ్మాయి వెంటనే ఏ సమాచారం ఇవ్వలేకపోయింది. ఆమె కాస్త తేరుకొనేసరికి, ఈ జంజాటంలో చిక్కుకోవద్దని తల్లి ఆమెను

ఆవేశంగా తమ వారందరినీ జమ చేశారు. మంతనాలు చేశారు. వారిలోని ఒక బృందం జాతీయ రహదారి కెక్కింది. మరొక బృందం కాలేజీవైపు బయలుదేరింది.

ఒక భీషణ మారణహోమానికి తెరలేచింది.. ఆ తరువాతి దశాబ్దాల తరబడి.

★ ★ ★

ఘామిడి గ్రామంలోని అమ్మాయిలందరినీ ఇంటి గడప దాటకూడదని పంచాయితీ కట్టడి చేసింది. ఊరివారిందరూ పదేపదేవచ్చి, ఒక్కొక్క అమ్మాయినీ బెదిరించి, "జాగ్రత్త!" అంటూ కళ్లురిమి పోతున్నారు.

ఆడపిల్లలు వణికిపోయారు. జ్వరపడ్డారు. పలవరింతల్లో పడ్డారు. నీలు తలుపుకు వచ్చినప్పుడల్లా, ఉలికులికి పడుతున్నారు. "తాము అలాంటి వారం" కామని, కాబోమని అటు ఇంటిలోని వారికి ఇటు పంచాయితీ వారికి- వెయ్యిన్నొక్క ప్రమాణాలు చేశారు. ఇంటి మూలల్లోకి ముడుచుకొని పోయారు.

భట్ దంపతులకు మాట్లాడే అవకాశమే లేకుండా పోయింది. వారిని ఏమైనా దూషిస్తే పాపం చుట్టుకుంటుందని- నరికి పారేస్తే బ్రహ్మహత్య పాతకం అనీ- ఊరివారు ఆగారే కానీ- అంతపని చేసేవారే.

భట్ దంపతులు జరిగిన పరిణామాలకు నిర్ఘాంతపోయి, నెమ్మదిగా కూడదీసుకొంటున్నారు. తమను ప్రాణాలతో వదిలిన గ్రామస్థుల మూఢ విశ్వాసాలకు నవ్వాలో ఏడవాలో కూడా వారికి తెలియడం లేదు. వారి మూఢత్వంలో అమాయకత్వంలో- కోపం, అవమానం, ఓటమి- కలగలసి- వారు తీసుకొంటున్న నిర్ణయాలకు, చేస్తున్న ప్రతీకార జ్వాలా దహనానికి- వారు మౌనసాక్షులుగా నిలవలేకపోతున్నారు.



ప్రాధేయపడి రహస్యంగా ఒట్టేయించుకుంది. నీలుతో స్నేహానికో- ఇప్పటికే తాను చేసిన తప్పిదానికో- తల్లికిచ్చిన మాటకో- ఆ అమ్మాయి ఇక నోరు విప్పలేదు.

వాళ్లమ్మ అందరి కాళ్లావేళ్లా పడి చల్లబరచాలని ప్రయత్నించింది. కారాలు మిరియాలు నూరుతున్నవారికి ఈ మంచి మాటలు ఎలా సహిస్తాయి?

మరింత ఆగ్రహోదగ్రులైనారు అక్కడి మగవారు.

'ఇవాళ ఇది జరిగింది. రేపు మరోటి. ఉపేక్షించేది లేదని' భీష్మించారు.

అమ్మను, బిడ్డను ఇంట్లోకి తరిమి, ఆ అమ్మాయి తండ్రి కూడా వారిని చేరాడు.

భట్‌గారి బడిలో చదివే ఎనిమిదో తరగతి అమ్మాయి నుంచి హిమ్మత్‌నగర్ వెళ్లే కాలేజి యువతి వరకూ- క్షణాల్లో వరుళ్లను నిర్ణయించేశారు. ఆ బడి ఆవరణలోనే సామూహిక వివాహ వేడుకను నిర్వహించాలనీ- పంచాయితీ ఖర్చులతో కట్నకానుకలు, చీరెసారెలు, పెళ్లిఖర్చులు, విందు- నిర్వహించాలనీ నిర్ణయం ప్రకటించేశారు. అమ్మాయిల చదువులన్నీ కట్టగట్టి అటకమీద పడేశారు.

అవి బాల్యవివాహాలనీ, బట్టతలకీ మోకాలికీ ముడిపెట్టవద్దనీ భట్ దంపతులు ఎంత ప్రాధేయపడినా ఎవరూ వారి మాట పట్టించుకోలేదు.

ఇవి ఆవేశంతో తీసుకోవలసిన నిర్ణయాలు కావని- సావధానంగా మాట్లాడుకోవచ్చనీ- చెప్పబోతే- ఏ ఒక్కరూ చెవిన బెట్టలేదు.

నీలు క్షేమసమాచారాలు తెలుసుకోవడం ఇప్పుడు ప్రధానమని- ముందు సంబంధిత అధికారులకు తెలియపరిచి- వారి సహాయ సహకారాలను తీసుకోవాలని వారు చేసిన సూచనలను- అట్టే వినిపించుకున్న నాథుడు లేడు! నీలు ఏమయిందో- ఎటుపోయిందో తెలియని తల్లి- తల్లడిల్లిపోతోంది.

## కొత్తగాలి...

**నీవంతుగా**
**నువ్వు నాటు ఒకచెట్టు**
**అది నిన్ను**
**కాపాడుతుంది ఒట్టు**

– పట్ల యాదగిరి,
*గండాల, నల్గొండ జిల్లా*

'బిడ్డ తిందో తినలేదో- కునుకు తీసిందో తీయలేదో, ఎవరి వద్ద ఉందో- ఎటువంటి వారి పంచన చేరిందో, స్వయంగా వెళ్ళిందో- ఎవరన్నా దౌర్జన్యంగా తీసుకువెళ్ళారో, మాయలో పడిందో- మానభంగమే జరిగిందో..

అమ్మ గుండె పగిలిపోసాగింది.

ఇటు భర్త, కొడుకులకు అటు పుట్టింటి పురుషులు తోడయ్యాక, ఆమె సందేహాలను వ్యక్తపరుచుకొనే అవకాశమే లేకుండా పోయింది. ఆడవారంతా భయాందోళనల గుప్పెట్లో ప్రాణాలుగ్గబట్టి ఉన్నారు ఎవరికి వారు. ఇక వారితో ఆమె మనసు విప్పి ఎలా మాట్లాడుకోగలరు?

తలబాదుకుంటూ, గుండెలు బాదుకుంటూ తనలోతనే మౌనంగా ఏడవసాగింది. ఆమెను వాటేసుకొని ఆమె కోడలు.

ఎంత ఏడ్చినా ఏం లాభం?

వెళ్ళినవాళ్ళు వెళ్ళినట్లే వెళుతున్నారు.

ఒక్క వార్త ఇంటికి చేరడంలేదు.

నీలు ఆచూకీ ఎంతకీ తెలియలేదు.

"పసిబిడ్డ. తెలిసో తెలియకో పొరపాటు చేస్తే, కాస్త పెద్దమనసు చేసుకొని కనికరం చూపండని" కనబడ్డ వాళ్ళందరి కాళ్ళు పట్టుకొని- కన్నీరు మున్నీరవుతోంది ఆ కన్నతల్లి. కనిపించని ఆ దేవుళ్ళకు ఆమె చేస్తోన్న విన్నపాలకు అంతేలేదు.

నీలు వదినకి ఎటూ పాలుపోవడం లేదు. పెద్దదిక్కయి మంచీచెడు చెప్పాల్సిన అత్తే, నోరు మెదపలేక తల్లడిల్లిపోతుంటే- తనేం చేయగలదు? కంటికి మింటికి ఏకధారగా ఏడవడం తప్ప.

రాత్రంతా గుండెలవిసేలా, కడుపుచించుకొని- ఏడ్చి ఏడ్చి- సొమ్మసిల్లి పడిన వారికి- సరిగ్గా వారి వాకిట పారిజాతం చెట్టు కన్నీరు చిందిస్తూ- జలజల పూలు రాల్చేవేళకు- ఎదురుచూస్తోన్న వార్త- అందింది.

'నీలు పల్లెలో అడుగు పెట్టింది'

ఊరంతా గుప్పుమంది.
శవాలు ఊపిరి పీల్చుకొన్నాయి.
తల్లీ వదినా ఉలిక్కిపడిలేచారు.
ఒక్క ఉదుటున వీధిలోకి పరుగులు పెట్టారు.
ఊరు ఊరంతా పంచాయతీవైపు పరుగులు పెడుతున్నారు. వారి వెనుకగానే, తల్లీవదినా తమ గుండెలు బిక్కబట్టుకొని- ఒకరికి ఒకరు ఆసరా చేసుకొంటూ- అక్కడికి చేరుకొన్నారు.
బడి ఆవరణంతా ఇసుక వేస్తే రాలని జనం.
వేదిక ఇంకా ఖాళీగానే ఉంది.
నీలు ఎక్కడ ఉందో- అసలు అక్కడ ఉందో లేదో- చెప్పేవారు ఎవరూ లేరు. తల్లీ వదినా అందరితో పాటే- నడుమ చోటు చేసుకొని- ఒక పక్కన చతికిలపడ్డారు.
"ఈ పంచాయతీకి తామెంత గౌరవమర్యాదలతో నడిచివచ్చేవారు ఎప్పుడూ! ఇదేమి గతి పట్టింది మనకు-" అత్తాకోడళ్ళు మెల్లగా రోదించారు.
"నీలు.. నీలు.." వారి గుండెలు గుబగుబలాడుతున్నాయి.
నీలు జాడ ఇంకా లేదు.
పెద్దలంతా పక్కన గదిలో చేరి తర్జనభర్జనలు పడుతున్నారు. నీలు పంచాయతీ పెద్దకు కూతురు కావడం- బొంబాయి పొలిమేరలు కూడా చేరకమునుపే వీరికి పట్టుబడడం- తెలిసీతెలియని వయసులో చేసిన తొలి తప్పిదం కావడం- వీటన్నిటినీ దృష్టిలో ఉంచుకొని తమ నియమాలను సడలించుకోవచ్చునని- గౌతంభట్ బలంగా వాదించాడు.
తలపండిన పెద్దలు కొందరు అది సబబేనని తలాడించారు.
అందరూ మౌనంలోకి కూరుకుపోయారు.
అంతలోనే ఈ వార్త ఎలా బయటకు పొక్కిందో, యువకులంతా కత్తులు కటార్లతో గయ్‌మంటూ పెద్దల్ని నిలేశారు.
"న్యాయం ఎవరికైనా న్యాయమే!"
"ఊరందరిదీ ఒక దారయితే ఊరి పెద్దది మరో దారా? నియమం అంటూ పెట్టుకొన్నాక ఎవరైనా పాటించవలసిందే!" వాళ్ళు గర్జించారు.
ఆ గది చీమ చిటుక్కుమనేంత నిశ్శబ్దమైంది.
మొట్టమొదటిసారిగా యువకులంతా గౌతంభట్‌పై విరుచుకుపడ్డారు.
"ఇది మా స్వకుల కట్టడి! ఏమి చేయాలో మాకు తెలుసు! మహరాజ్- మీరిక మర్యాదగా పక్కకు తప్పుకోండి!"
ఆ మాటల తీవ్రతకు గౌతంభట్ నిశ్చేష్టుడయ్యాడు.
"నీలు నా విద్యార్థి. మీలో ఎంతోమందికి నేను ఉపాధ్యాయుణ్ణి-" గౌతంభట్ తేరుకొని సావధానం చేయబోయాడు.
"అందుకు మీకు పాదాభివందనం చేస్తాం! ఇప్పుడు మాత్రం గౌరవంగా గది బయటకు నడవండి!" ఒక యువకుడు స్థిరంగా అన్నాడు.
గౌతంభట్ నిస్సహాయంగా అందరివైపు చూశాడు.
శాంతపరచబోతోన్న పెద్దలపై ఉద్రేకంగా కళ్ళురిమారు యువకులు. తమ చేతి కర్రలను కోపంగా నేలకు తాటించారు.
'ఇంత చదువు చదివీ- ఎందుకు కొరగాకుండా పోయిందే- ఛ!' గౌతంభట్ ఏడుపు దిగమింగుకుంటూ- తన విద్యార్థులచేత మెడబట్టి బయటకు నెట్టించుకోకముందే, గడపదాటాడు.
'కింకర్తవ్యం? ' అనుకొంటూ.
గౌతంభట్‌కు ఏంచేయాలో తోచలేదు.
ఆ ఊరినుంచి బయటకు వెళ్ళే మార్గం ఒక్క పాలవ్యాన్ మాత్రమే. మిగిలినవి

స్వంత వాహనాలు. ఉన్న ఆ ఒక్క రోడ్డును రక్షక బృందం కాపలా కాస్తుందట. హిమ్మత్‌నగర్ నుంచి వచ్చే ఆపదను ఎదుర్కోవడానికి. కట్టెలు కత్తులతో. సంసిద్ధంగా ఒక వలయం ఏర్పడి వుందట అన్ని మార్గాలోనూ.

ఇక, ఆ రోడ్డుమీద వ్యానులో వెళ్ళడం వీలుకాదు. మరో మార్గం, ఏ ఒంటె బండిలోనో సైకిల్‌మీదనో వడాలి వరకు వెళ్ళి, అక్కడ బస్ కానీ వ్యాన్ గానీ ఎక్కితే ఈదర్ చేరుకోవచ్చు. అక్కడికి అదే దగ్గరి పోలీస్‌స్టేషన్.

ఘామిడి చుట్టుపక్కలకు ఎక్కడా టెలిఫోన్ సౌకర్యం రాలేదు. పోస్టాఫీసు ఉన్నా- టెలిగ్రాం పంపేపని.

జరగబోయే ఘాతుకాన్ని ఆపలేని తన నిస్సహాయతకు గౌతంభట్ తల బాదుకొన్నాడు. గోడవారగా చేరగిలబడి, మోకాళ్ళలో తలపెట్టుకొని, బిగ్గరగా ఏడ్చాడు.

ఈ బడిని తన కలల ఒడిగా మలిచాడు. ఇక్కడే మానవత్వపు విలువలను పిల్లలకు బోధించాడు. మంచీమర్యాద, శాస్త్రం తర్కం, జ్ఞానం కళలు- ఎన్నిటినో వారికి నేర్పించాడు. ఈ రోజు తన విద్యార్థులే తనను పరాయివాణ్ణి చేశారు.

ముందు ఈ ఘాతుకం ఆపాలంటే, బాహ్యప్రపంచానికి జరగబోయే ఘోరమేమిటో తెలియపరచాలి. ముందు ఈ వార్తను బయటి ప్రపంచానికి ఎలా చేరవేయాలో- బయట నుంచి ఎలాంటి సాయం పొందాలో- అర్థం కాలేదు. తన ఆలోచన సాగినట్లుగా గబగబ- అన్ని కోణాల్లో తర్కించుకొన్నాడు. కారణం ఏదైనా చిన్నా పెద్దా మొక్కిన తన కాళ్ళకు, ఈ ఊరంతా ఒక శక్తిని ఒక దిశానిర్దేశాన్ని ఇచ్చినట్లుగా అతను భావించాడు.

చటుక్కున లేచి, రహస్యంగా ఆ ప్రదేశం నుంచి తప్పుకున్నాడు. ఎవరికంటా పడకుండా పొలాలకు అడ్డంపడి, ఈదర్ వైపుగా సాగాడు. ఏదో శక్తి ఆవహించినట్లు పరుగులు పెట్టాడు. తన అడుగుల శబ్దానికి తనే ఉలిక్కిపడుతున్నాడు, ఎవరైనా తరుముకు వస్తున్నారేమోనని. అంతలోనే తన భ్రమకు తనే సర్దిచెప్పుకొంటూ- క్షణం చేజారినా జరగబోయే అనర్థాన్ని ఆపగలిగే అవకాశాన్ని కోల్పోతానని- అతను పరిగెత్తుతూనే ఉన్నాడు. ఇప్పటివరకూ ఎవరి కంటపడని నీలు తలపుకు రాగానే, మరింత ఉద్వేగంతో పరిగెడుతున్నాడు.

అక్కడా ఇక్కడా కాదు.

మరో పాతికమైళ్ళు పైగా వెడితేగానీ తార్రోడ్డు తగలదు. వాహన సంచారం ఉండదు. పైనుంచి, ఇరుగుపొరుగు గ్రామస్థుల కంటపడినా, అతనిని ముందుకు వెళ్ళనివ్వరు. పెరిగిన సెనగ చాళ్ళలో- నక్కి నక్కి- వంగి వంగి- పరుగులు పెడుతున్నాడు పసితనం మూర్తీభవించే నీలు పాలనవ్వులను, విప్పారిన కళ్ళను తలుచుకొంటూ.

కళ్ళు తేలిపోతున్నా, కాళ్ళు మొరాయిస్తున్నా- అంతరాంతరాల్లోని శక్తిని పుంజుకొంటూ.

పొలిమేరలు తొక్కకుండా
పొలాల్లో దాక్కుంటూ
గౌతంభట్ పరిగెడుతూనే ఉన్నాడు.

★ ★ ★

అందరూ ఊపిరి బిగబట్టారు.

నీలు తల్లిని నీలు వదిన పొదివి పట్టుకొని అక్కడికి తెచ్చింది.

ఆడంగులు మెల్లిమెల్లిగా వారివైపు కదిలారు. నిశ్శబ్దంగానే వారితో గుసగుసలాడారు. తమ తలల మీది ముసుగులను గడ్డాల కిందికి జార్చారు.

అప్పటికే ప్రతి ఇంటిలోని ఆడపిల్లను అక్కడికి రప్పించారు. వారి తలమీద ముసుగులు తొలగించమన్నారు. జరగబో

యేది కనులారా చూడకుండా, ఎవరైనా కళ్ళు మూసుకున్నట్లు కనబడితే, వారి కళ్ళు పొడిచేస్తామన్నారు.

కిక్కిరిసిన బడి ఆవరణలో కుక్కిన పేనుల్లా కూర్చుంది స్త్రీగణం. వారిచుట్టూ పహారా కాస్తూ పల్లె పురుషులు. వారి అడుగుల్లో అడుగులేస్తూ పల్లె బాలురు.

అక్కడ ఒక చిత్రమైన వాతావరణం నెలకొంది.

అక్కడ ఏం జరగబోతోందో అందరికీ తెలుసు.

జరుగుతుందా? లేదా? అన్న మీమాంస కానీ, ఎలా జరుగుతుందన్న ఉత్కంఠ కానీ, ఇలాగే జరిగితీరాలన్న ప్రణాళికగానీ, జరగకపోతే ఎలా అన్న ఉద్వేగంకానీ, జరిగాక ఏమిటి అన్న అంచనా కానీ- ఎవరికీ లేదు.

నిజానికి- అవన్నీ కలగలసిన ఒక వింత స్తబ్ధత వారందరినీ కబళించివేసింది.

భయం.

ఎటు చూసినా, వేలపడగలతో బుసలు కొడుతోంది.

అంతే.

జరగబోయేదానిని జరగకుండా ఆపవచ్చునన్న ఒక్క ఆలోచనను ఆ భయం కొండచిలువలా మింగేసింది. వారి ఇంగిత జ్ఞానం ఇగిరిపోయింది. మానవత్వం మాటే లేదు.

కట్టడి దాటితే తమకు కూడా నూకలు చెల్లుతాయన్న వాస్తవం మాత్రం వారికి తెలుసు. వారి భయం వారిని ఎంత ఘోరంగా, క్రూరంగా, సంకుచితంగా మార్చివేసిందో- ఎంతటి స్వార్థపరుల్ని చేసిందో- మరెంత నిర్వీర్యులను చేసిందో- గ్రహించగలిగే స్థితిలో వారు లేరు.

జరగబోయే దానికి సజీవ సాక్షులుగా వారక్కడ మిగిలి వున్నారు.

"సావధాన్! సావధాన్!"

పొన్నుకర్ర బలంగా తాటిస్తూ, బిగ్గరగా అరిచారెవరో!

ఇక చీమ చిటుక్కుమంటే ఒట్టు.

పంచాయితీ పెద్దలు ఒక్కొక్కరే వేదిక మీదికి రాసాగారు.

తన గడ్డం ఛాతీపై వాల్చి, తలపై టన్నుల భారం మోస్తున్నట్లుగా, అడుగులు లెక్కపెడుతూ- బరువుగా వేదిక మీదికి నడిచొచ్చాడు నీలు తండ్రి.

అందరి రోమాలు నిక్కబొడుచుకున్నాయి.

తమ పంటి కింద కొంగు అంచునో- తలపాగా చెంగు చివరనో నొక్కిపట్టి- చెవులు రిక్కించి- అతని వంక నిశ్చేష్టులై చూస్తున్నారు. అతను ఏమంటాడో- ఏమి

## వాణి అంటుపడుతుందా?

ఓసారి జాషువా రైల్లో ప్రయాణిస్తున్నారు. అదే కంపార్ట్‌మెంటులోని ఓ పండితుడు ఆయన్ను కవిత్వాన్ని వినిపించమని కోరాడు. జాషువా కవిత్వాన్ని విన్న తర్వాత, 'భేష్! భేష్! మీ కవిత్వం అద్భుతం, మీదే కులం?' అని ప్రశ్నించాడు ఆ పండితుడు.



'నేను క్రైస్తవుణ్ణి. కవికి, కళకూ కుల మతాలున్నాయా!' అన్నారు జాషువా. 'అయ్యయ్యో! వాణి అంటుపడ్డది' అంటూ పండితుడు మరోచోటికి పోయి కూర్చున్నాడు.

అప్పటి తన ఆవేదనను జాషువా వెంకటగిరి రాజావారికి ఇలా నివేదించుకున్నారు-

'నా కవితా వధూటి
వదనంబు నెగాదిగ జూచి రూపు రే
ఖా కమనీయ వైఖరులు గాంచి
భళీ భళి యన్నవాడె మీ
దేకులమన్న ప్రశ్న వెలయించి
చివాలున లేచిపోవుచో
బాకున గ్రుమ్మినట్లగును
పార్థివచంద్ర! వచింప సిగ్గగున్'

చేస్తాడో, చెప్పబోయే తీర్పేమిటో చేయ బోయే తీర్మానం ఏమిటో- ఎవరికీ అంతు చిక్కడంలేదు.

ధీరగంభీరంగా ఉన్న ఆయన వదనం ఎలాంటి ఊహలకు తావివ్వడంలేదు. మిగి లిన పంచాయితీ సభ్యులు కూడా ఏ మూలో కాస్త మెత్తబడ్డారు.

'ఏమీ జరగదులే!'

ఎవరికి వారు భరోసా ప్రకటించుకొ న్నారు. నిశ్శబ్దంగానే నిబ్బరం కూడాదీసు కొన్నారు.

"నీలుని తీసుకురండి!"

ఎవరో కీచుగొంతుతో అరిచారు.

★ ★ ★

> ## కొత్తగాలి...
>
> **ఎన్నికల్లో పోటీకి**
> **గాంధీజీ నామినేషన్ వేశాడు**
> **పరిశీలించి తిరస్కరించేశారు**
> **స్కామ్ అర్హతలు లేవు మరి!**
>
> – పాయసం సుబ్రహ్మణ్య మహర్షి,
> నెల్లూరు

అప్పటివరకూ గాలివెలుతురు లేని గదిలో వంటరిగా పడివున్న నీలుని- రెక్క లుబట్టి ఎవరో బయటకు లాక్కొచ్చారు.

వెలుగు ఒక్కసారిగా.

నీలు కళ్ళు చిట్లించి, మనుషుల్ని పోల్చు కోసాగింది.

"అన్నా.. మామయ్యా.. చిన్నానా.." ఆత్రంగా గబగబా పలకరించబోయింది.

ఎవరూ స్పందించలేదు.

పై నుంచి "పద!" అంటూ గద్దించారె వరో.

నీలు కళ్ళు నులుముకుంటూ అడిగింది, "ఎక్కడికి చిన్నానా? " అంటూ.

"సావధాన్! సావధాన్!" లయబద్ధమైన కర్ర తాటింపు నీలు చెవిని తాకింది. అది సరిగ్గా సుముహూర్తానికి ముందు, పెళ్ళివే దికపై వినబడే మంగళప్రదమైన మాట.

అప్రయత్నంగా నీలు మనసులో నీలు అన్న పెళ్ళి మెదిలింది. సిగ్గుల మొగ్గయి తలను వాల్చేసిన వయ్యారి వదిన గుర్తొ చ్చింది. తలమీది ముసుగును తొలగించి, అన్నకు వదిన ముఖారవిందాన్ని తాను చూపడం, పాపిట సిందూరాన్ని దిద్దడం, ఆపై ఆడపడుచుగా తను అందుకున్న కట్నకానుకలు, అమ్మా నాన్న తీర్చిన తన గారాలు- గుర్తుకొచ్చాయి.

"సావధాన్! సావధాన్!" మరింత బిగ్గ రగా వినబడిందా గొంతు.

రాత్రంతా తిండీతిప్పలు, నిద్ర ఏమీ లేక పోయినా, నీరసించిపోతున్నా- నీలులో ఏదో ఉత్సాహం ఒక్కసారిగా ఉత్తేజపరి చింది. కుతూహలంగా ఆ వినబడే వివాహ వేదికవైపు గబగబ నడచింది. ఒక్కసారిగా గుంపులు గుంపులుగా కనబ డిన ఊరిజనాన్నంతా చూసి- బిత్తరపోయి, రక్కున ఆగింది. ఆపై, కాలు సాగలేదు.

తనను అక్కడకు తీసుకువచ్చిన వారిని అడిగింది.

"ఎందుకొచ్చారు వీరంతా? "

వాళ్ళెవరూ మాట్లాడలేదు.

"నేను ఇంటికి పోతా! అమ్మ దగ్గరకి. నాకు బాగా ఆకలిగా వుంది. నన్ను వెళ్ళ నీయండి. నాలుగు పరాటాలు వేడివేడిగా తిని, హాయిగా నిద్రపోవాలి. నన్ను ఇలా పట్టుకువచ్చారని నాన్నకు తెలిసిందో- మీ సంగతి తేలుస్తారు! అన్న అసలు ఊరు కోడు! నేను వెళతా!"

వాళ్ళు కళ్ళురిమి, కర్రలు తాటించి, హుంకరించారు.

"ఇలా పాచిముఖంతో పంచాయితీకి వచ్చానని తెలిస్తే, నాన్న కోప్పడతారు.

నేను వెళతా!"
నీలుని భుజం తట్టి, ఆమె తండ్రివైపు చూపించారు.
నీలుకి ఒక్కసారిగా ఏదో తెలియని భయం కమ్మేసింది. అక్కడ వేదికమీద ఆసీనులైన వారినందరినీ ఆత్రంగా పరిశీలించింది.
నడిమధ్యలో- నాన్న!
ఒక్కసారిగా నలభై ఏళ్ళు పైబడ్డట్లు- వడలిపోయి వున్నాడు.
నీలు పలకరింపుగా నవ్వబోయింది. గబగబ తండ్రి వద్దకు వెళ్ళబోయింది.
తోడొచ్చినవారు.. ఆమె రెక్కలు పట్టి నిలిపేశారు.
నీలు గింజుకుంది. గిలగిల కొట్టుకొంది.
"ఎంతకు బరితెగించావ్! మన పంచాయితీ కట్టుబాటు తెలియదా? పల్లె పొలిమేర దాటుతావా? అదీ.. వాళ్ళ కుర్రాడి వెనకజేరి!"
నీలుకి విషయం స్పష్టంగా అర్థమైపోయింది.
అదే వేదిక మీద, తమందరి సమక్షంలో.. సంబరంగా తమ తండ్రి పంచాయితీ పెద్దగా ప్రమాణం చేసినరోజు మనసులో మెదిలింది. అంతే! ఉన్నచోటే కుప్పకూలిపోయింది.
ఒక్కసారిగా ఆడవారిలో హాహాకారాలు చెలరేగాయి.
నీలు స్నేహితురాళ్ళు గొల్లుమన్నారు.
"సావధాన్! సావధాన్!" కర్రతాటింపు. కానీ సద్దుమణగలేదు.
"ఖబడ్దార్! ఖబడ్దార్!" అన్నివైపుల నుంచి కరవాలాల ఝుళిపింపు.
ఎక్కడివారక్కడ గొంతులు నొక్కుకొన్నారు.
నీలు తండ్రి లేచి నిలబడ్డాడు.
అందరికీ చేతులు జోడించి నమస్కారం చేశాడు.
వేదిక నేలపై నుదుటిని తాటించి, గౌరవ వందనం చేశాడు.
చేతులు జోడించి, కళ్ళు మూసుకొని ప్రార్థన చేశాడు.
సొమ్మసిల్లి పడివున్న నీలుని- వేదిక మధ్యగా లాక్కొచ్చారు.
మరోమారు హెచ్చరిక జారీ అయింది.
అమ్మాయిలంతా తలమీద ముసుగులు తొలగించాలని, ఎవరూ కనురెప్ప వేయడానికి వీలులేదని.
సోలిపోతోన్న నీలును బలమైన యువకులు, రెక్కలు పట్టి నిలబెట్టారు. నీలు తన కాళ్ళమీద తను అలా నిలబడిందో లేదో-
ఆమె తండ్రి చేతిలోని కరవాలం కస్సున నీలు కడుపులో దిగబడింది.
నీలు ఒక్కసారిగా కళ్ళు విప్పింది.
తండ్రి వంక కనులారా చూసింది.
చిత్రంగా నవ్వింది!
ఇంతలో చిన్నకేక, నీలు తల్లి స్పృహకోల్పోయి నేలకొరిగింది.
"అమ్మా..!" అంటూ నీలు గుండెలు చీల్చుకొని పిలిచిన చివరి పిలుపును ఆమె అందుకోనేలేదు.
నీలు ఊపిరి పారిజాత పరిమళాల్లో కలిసిపోయింది.
నీలు చివరి పాలనవ్వు పూరేకుల సోయగాల్లోకి చేరిపోయింది.
కరవాలానికి అంటిన నీలు వెచ్చటి నెత్తురు పారిజాతం నాజూకు కాడలకు పగడపు రంగులద్దింది.

★ ★ ★

పడుతూ లేస్తూ- ఉరుకులు పరుగుల మీద పోలీసులను వెంటబెట్టుకొచ్చిన- గౌతంభట్‌ను నిశ్శబ్దంగా ఉన్న పల్లె పలకరించింది.
ఎవరి పనుల్లో వాళ్ళు మునిగి ఉన్నారు. పాడి పని చేసుకొనేవారు పాడి పనిలో- పంట

పొలాల్లో పని చేసేవారు పంట పొలాల్లో.

అంతా మామూలుగానే ఉంది.

తను వెళ్ళేటప్పుడు సమావేశమైన బడి ఆవరణలో మచ్చుకొక్క మనిషి కూడా లేడు. అక్కడంతటి పంచాయితీ జరిగిన ఆనవాళ్ళైనా లేవు.

ఒక క్షణం తనేమయినా భ్రమకో భ్రాంతికో గురయ్యానా? అని అనుకోకుండా ఉండలేకపోయాడు గౌతంభట్.

ప్రశ్నార్థకంగా చూస్తోన్న పోలీసు అధికారులను సావధానపరచి, అతిథి మర్యాదలు పూర్తిచేసేలోగా-

సబర్మతి వద్దున దహనసంస్కారాలు ముగించి- శుచిస్నానం చేసి వస్తోన్న నీలు తండ్రి కనిపించాడు. పోలీసు జీపు వచ్చిందన్న వార్త విని, అతనే వచ్చాడో ఏమో కానీ, నేరుగా వచ్చి పోలీసు అధికారిని పరామర్శించాడు.

నిబ్బరంగా, నిదానంగా అతను నడిచి వచ్చిన తీరు, జంకు గొంకు లేకుండా నిర్భయంగా పోలీసు అధికారితో మాట్లాడుతున్న వైనం, అటు గౌతంను, ఇటు అధికారిని సంశయంలో పడేశాయి.

పైనుంచి, నీలు తండ్రి తనే వచ్చి పోలీసు అధికారిని కలుద్దామని అనుకున్నాననీ- తమ ఘూమిడి గ్రామంలో సామూహిక వివాహవేడుకకు అతనిని ముఖ్యఅతిథిగా ఆహ్వానించాలని. ఎలాగు శ్రమ తీసుకొని వారే తమ ఊరికి వచ్చారు కనుక, ఆ కార్యక్రమానికి కూడా తప్పక హాజరుకావాలని- నింపాదిగా, గౌరవంగా ఆహ్వానించాడు.

"మొదట నేనెందుకు వచ్చానో ఆ పని కానివ్వనీయండి!" అధికారి గంభీరంగా అన్నాడు.

"తప్పకుండా! మీవంటి నిజాయితీగల అధికారికి మా సహకారం ఎప్పుడూ ఉంటుంది!" నీలు తండ్రి సవినయంగా భరోసా ప్రకటించాడు.

"ఇక్కడొక హత్య జరిగిందని విన్నాను!"

"హత్యా? మా గ్రామంలోనా? నేను పుట్టి బుద్ధెరిగాక అసలలాంటి పదమే వినలేదే!" నీలు తండ్రి ఉద్వేగాన్ని అణుచుకుంటూ- ప్రశాంత వదనంతో అమాయకంగా అన్నాడు.

"మరి ఈ మాష్టారు ఏదో ఫిర్యాదు చేశారు!" అధికారి కళ్ళు చిట్లించాడు.

"ఆయన చిన్నాచితక కథలు, కవితలు రాస్తాడు లేండి సార్! అన్నిటికీ కథలల్లడం వారికి మామూలేగా!" వెనకనుండి ఎవరో పరాచికాలాడారు. అక్కడ చేరిన నలుగురూ ఫక్కుమన్నారు.

"ఈజిట్? " అధికారి భట్‌వైపు తిరిగి నొసలు చిట్లించాడు.

గౌతంభట్‌కు చిరచిర మండుకొచ్చింది.

"అయితే, నీలుని పిలవమనండి!"

"ఒక్కగానొక్క ఆడపిల్ల. పుట్టినప్పటి నుంచి తెరలు వచ్చి కాళ్ళు చేతులు కొట్టుకొనేది. మొన్న నదిలో నీళ్ళు ముంచను బోయి, తెరలు కమ్మి, కాలుజారి పడిపోయింది. నదివార కొట్టుకుపోతే, ఈ తెల్లవారు ఝామునే దొరికిన శవానికి దహన సంస్కారాలు పూర్తిచేసి వస్తున్నాం!

"పాపం, బిడ్డపోయి ఆయనేడుస్తుంటే- ఈ మాష్టారు లేనిపోని కథలల్లి మిమ్మల్ని తోడు తీసుకొచ్చారా? " ఓ పెద్దమనిషి విడ్డూరం ప్రకటించాడు.

ఆపై, ఎంత కూపీలాగాలని ప్రయత్నించినా- గౌతం మాటలకు ఊరివారి మాటలకు పొంతన కుదరలేదు. పైనుంచి, నీలుకి ఎలా వాయ కమ్మేదో- తెరలు వచ్చేవో- వర్ణించి వర్ణించి చెప్పారు.

పైనుంచి "ఈ పట్నాల నుంచి వచ్చే పంతుళ్ళకు మన పల్లె వ్యవహారాలేం తెలుస్తాయి చెప్పండి సార్! మీరూ మా కులంలో పుట్టి పెరిగినవారే కదా? ఆ



కుల మర్యాదలు వీరికి ఏం అర్థమవుతాయి లెండి? ఏదో జరిగితే మరేదో ఊహించుకొన్నట్లున్నారు. కథలు కథలుగా" చివరి మాట నొక్కిపట్టి- అన్నాడు నీలు తండ్రి.

అక్కడ హత్యాకాండ జరిగినట్లు పోలీసువారు ఏ కోశాన నిర్ధారించలేకపోయారు. పైపెచ్చు పొరపాటు పడ్డందుకు పంచాయితీ పెద్దలకు క్షమాపణ చెప్పారు. పై అధికారులకు సంజాయిషీ ఇవ్వవలసి వస్తుందేమోనన్న ఆలోచనతో వణికిపోయారు. కల్లబొల్లి ఊహలతో తమ విలువైన సమయాన్ని వృథా చేసినందుకు గౌతంభట్‌ను చీవాట్లు పెట్టారు. పెద్ద మనుషులపై అభాండాలు వేస్తే పరువు నష్టం దావా వేయించాల్సి వస్తుందని- వారే హెచ్చరించారు.

హేళనగా నవ్వుతున్న గుంపు ముందు గౌతంభట్ అవమానంతో దుఃఖంతో కూలబడ్డాడు.

"ఎవరి మర్యాదను వారే నిలబెట్టుకుంటే మంచిది!" అధికారి నర్మగర్భితంగా అన్నాడు.

ఘామిడి గ్రామ సామూహిక వివాహాలకు తాను ముఖ్య అతిథిగా వస్తానని, ఆ అధికారి మాట ఇచ్చి- మరోమారు గౌతమ్ భట్‌ను మందలించి- వెళ్ళిపోయాడు.

అంతే- ఎక్కడివారక్కడకి సర్దుకొన్నారు.

వారి మర్యాద వారికి మిగిలింది!

అక్కడ ఎలాంటి అసాధారణ అంశం జరగలేదని- పొరపాటు లేదా తొందర పాటు సమాచారం తప్పుదారి బట్టించింద ని- రాసుకొని పోలీసు బృందం గ్రామం దాటింది.

ఆ సాయంత్రమే, "అది హత్యాకాండ! అవి బాల్య వివాహాలు!" అంటూ ఆక్రో శిస్తూ, గౌతంభట్ సకుటుంబ సమేతంగా ఘామిడి గ్రామం వదిలిపోయాడు.

ఇక, నీలు తండ్రి ఆరోజు పోలీసుజీపు పొలిమేర దాటిందో లేదో- గిర్రున వెనక్కు తిరిగి చరచర ఇంటివైపు వెళ్ళాడు.

ఎన్నడూ ధీరగంభీరంగా ఉండే అతను ఏదో ఉద్వేగం కమ్మినట్లు ఉరుకులు పరు గులు పెడుతున్నట్లు వీధివెంట వెళు తుంటే, దారంట పోయేవారు పలకరించ బోయి భంగపడిపోయారు. అతనిని పరా మర్శించబోయిన వారికి మాటలు లేవు.

అన్నిటికీ అందరికీ అతీతంగా, అతను చరచర నడుచుకుంటూపోయి, వాకిట్లో ఆగి, అలుపు దీర్చుకొన్నాడు.

సరిగ్గా అక్కడే ఉంది పారిజాతం చెట్టు. ఆ చెట్టు చుట్టూ పూలు ఏరుకుంటూనో- ఆ చెట్టు చెంతనే గట్టుమీద కూర్చుని ఆ పూలను అల్లుకుంటూనో, ప్రతిరోజు ఉదయం కనిపించేది. అతనిని గలగల పలకరించేది, అతని చిట్టితల్లి.

కర్కశంగా కరవాలం దూస్తోన్న తన వంక ఆమె చూసిన ఆ ఆఖరిచూపు- వాడి బాణమై సూటిగా హృదయాన్ని తాకింది.

ఆదరించాల్సిన తండ్రి అంతమొందిస్తు న్నాడన్న అపనమ్మకం, ఆ పసిముఖంలో పాలనవ్వుల అమాయకత్వం, జీవించాలన్న బలమైన జీవితేచ్ఛ- భవిష్యత్తు గురించి ఆమె కన్నకలలు- అన్నీ కలగలసి ఒక్కసా రిగా అతన్ని కుదిపివేశాయి.

కన్నబిడ్డను కడుపులో పెట్టుకోవాల్సిన వాడు, కట్టుబాట్లను ఎదిరించలేని పిరికిత నంతో కాటికి సాగనంపి- వట్టి చేతుల్తో ఇంటికొస్తున్నాడు!

నీలు తండ్రి ఆ వాకిట్లోనే కుప్పకూలిపో యాడు.

నీలు ముఖంలోని అమాయకత్వంతో కలగలసిన అపనమ్మకం- అతన్ని శూలంగా గుచ్చుకొంటోంది. ఛెళ్ళున ఎవరో చరిచినట్లయింది. గాలానికి గుచ్చి ఒడ్డున పడేసిన చేపలాగా గిలగిలలాడిపోయాడు.

అతని మనసు చెదిరింది. గుండె పగి లింది. భళ్ళున బద్దలయ్యాడు.

పారిజాతం మొదలు వాటేసుకొని ఒక్క సారిగా ఏడవసాగాడు. నీలు నిత్యం తిరు గాడిన ఆ చోటును తడిమి తడిమి ఏడవ సాగాడు. ఆమె మునివేళ్ళు స్పృశించిన ఆ నునులేత కొమ్మలను రెమ్మలను పదేపదే తాకుతూ, ఏడవసాగాడు. ఆమె ఎప్పుడూ కూర్చునేచోట నేలపై దొర్లి దొర్లి ఏడవసా గాడు.

నీలు అన్నా వదినలు వచ్చి, అతనిని ఎంత ప్రాధేయపడినా, అతను ఏడుపు ఆపలేదు. బంధుమిత్రులు వచ్చి ఎంత బతిమిలాడినా- అతను వాకిటిలో నుంచి కదలలేదు. ఇరుగుపొరుగు చేరి, ఎంత నచ్చజెప్పినా- అతని ఇంటి లోపలికి అడుగు పెట్టలేదు.

ఎండయినా, వానయినా, రేయయినా పవలైనా- అతను ఆ పారిజాతం చెట్టు మొదట్లోనే ఉంటూ ఉన్నాడు.. తనలో తాను మాట్లాడుకొంటూ, తనను తాను ఓదార్చుకొంటూ. అప్పుడప్పుడే నవ్వుతూ, ఎప్పుడేనా వెక్కుతూ..

ఇక, ఆ వాకిటి ముందునుంచి అటూ ఇటూ వచ్చిపోయేవాళ్ళు, "పాపం! మతి చలించింది!" అంటూ ఓ మారు నిట్టూర్చి, మరోమారు అతనిని పలకరించడానికి ప్రయత్నించి, ఆపై వారి దోవను వారు

వెళ్ళిపోయేవారు.

కొద్దికాలం గడిచేసరికి, ఆ మాట అనే వాళ్ళు కూడా లేకుండా పోయారు.

కన్నబిడ్డ పోయింది. పెద్దరికం పోయింది. మతిపోయింది.

అన్నిటికీ సజీవ సాక్షీభూతంగా అతను మిగిలిపోయాడు.

పారిజాత పరిమళాల్లో నీలు పాల న వ్వులు వెతుక్కుంటూ.

అతను బతికే ఉన్నాడు.

అతను బతుకుతూనే ఉన్నాడు.




## పారిజాతాలు

ఇదంతా చదివాక-

మీ మనస్సు ద్రవించి, మీరు ఓ కన్నీటి బొట్టు రాల్చివుండొచ్చు!

లేదూ, మన చుట్టు నిత్యం అనేక కథల్లో లాగానే లెమ్మన్న ఉదాసీనత కలిగి వుండొచ్చు.

ఇక, ఇవి కట్టుకథలనీ, కల్లబొల్లి కబుర్లనీ, కంటితుడుపు రాతలనీ- అనిపించినట్లయితే- కాస్త నా మాట కూడా వినండి.

కథలల్లేవారు మా పారిజాతాల పరిమళాలను ఒడిసి పట్టుకోవాలని, కాలాల తరబడి ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. కలాలను ఒలికిస్తూనే ఉన్నారు. ఆ నోటా ఈ నోటా పలికిస్తూనే ఉన్నారు.

మనకు తెలుసు కదా- అదేం సులువు పని కాదు.

పోనీయండి.

వారి ప్రయత్నం వారిని చేయనివ్వండి.

ఆ సున్నిత సుందర రూపము, సుమధుర సమ్మోహక పరిమళంతో పాటు- గరుకు చిగురులతో నిండిన జీవితాన్ని మీకు పరిచయం చేయద్దూ?

చూడండి.

ఆకుపచ్చని నేను,

నాలోని శక్తిని, సౌందర్యాన్ని- కలగలిపిన నాలోని సమస్త సామగ్రిని- ఆ సిందూర వర్ణపు కాడలోకి సృజియించేది- తెల్లటి వెలుగు పూరేకులతో స్వచ్ఛంగా విచ్చుకోవడానికే కదా?

అచంచల విశ్వాసాన్ని, అజరామర ప్రేమను, అందమైన జీవితాన్ని- అపురూపంగా ఆవిష్కరించుకోవడానికే కదా?

నన్నెంత ప్రేమిస్తారో మీరు!

నన్నంత పవిత్రంగానే పరిగణిస్తారు.

ప్రేమకు పవిత్రతకు నడుమ నలిగే ఓ నాజూకు సంబంధంలోనే బహుశా నేను పుట్టి ఉంటాను!

నిజానికి,

నేను ఏ సముద్ర మథనంలో పుట్టానో- నేనే నందనవనంలో పెరిగానో- నన్నే దేవలోకాల నుంచి తెచ్చి ఈ భూమిపై నాటారో- నా కోసం ఎన్నెన్ని దేవ మానవ యుద్ధాలు జరిగాయో, ఎన్నిమార్లు అపహరించబడ్డానో, ఎంతమంది సవతులు నా కోసం పోరాడారో-

ఇవేవీ మా తాతముత్తాతలు మాకు ఏనాడు చెప్పలేదు.

కానీ, ఆ హిమవత్పర్వతాల పాదాల నుంచి దక్షిణాది కడలి తీరాల వరకూ - నేను విస్తరించివున్నాను. ఉత్తరం.. దక్షిణం.. తూర్పు.. పడమర.. ఆ నడుమ విస్తరించిన- ఆ సేతు శీతనగం నా ఇల్ల

యిపోయింది ఏనాడో!

నిజానికి, ఎక్కడ మనసు పరిమళించసాగిందో అక్కడ నేను పుష్పిస్తూ వుంటాను. ఆ ప్రేమ సౌరభంతోనే నా పుప్పొడి దిగంతాలకు వ్యాపిస్తుంది. సందెవేళల నాపై వాలే మిత్రకీటకాల నాజూకు అరికాళ్ళకు నా పుప్పొడిని పారాణిగా అద్దుతాను. వాటితోపాటే గాలిలో అలవోకగా స్నేహ గంధాలను విస్తరింపజేస్తూ- నేను మొగ్గగా మారుతాను. తొలి పొద్దులో పూవుగా రాలి, హృదయమై పండుతాను.

ఎండిన నా గుండె ముక్కలయినపుడు నేల వాలుతాను. ఆ మట్టి నన్ను తనలో

**కొత్తగాలి...** 

**వాడికి**
**జీర్ణశక్తి బాగా ఉంది**
**కొండల్ని సైతం**
**మింగేస్తున్నాడు!**

*– జి.వి.ఎస్. ప్రియంవద,*
*శ్రీకాకుళం*

కలుపుకోక, మరొక మొక్కలా సజీవపరుస్తుంది

ఎన్నిమార్లు గుండెలు బద్దలు కొట్టుకొన్నా- మరలా జీవితురాలినయ్యేది- ఆ ప్రేమమీది అపార నమ్మకంతోనే. ఆ సహృదయ మానవ స్నేహబంధం మీది అచంచల విశ్వాసంతోనే.

పురాణ పురుషులు యుద్ధాలు చేశారన్నా- మహారాణులు సతీసాధ్వీలు కొంగులు బిగించారన్నా- స్వయాన ఆ వెన్నదొంగ నన్ను దేవలోకాల నుంచి అపహరించి తెచ్చి ఈ మట్టిలో నాటారన్నా- నా చుట్టూ మీరు ఇన్నిన్ని కథలు, కావ్యాలు, పురాణాలు అల్లుకొన్నారన్నా- నేనేమీ పొంగిపోవడం లేదు.

కానీ, ఆ కోటల్లోంచి తోటల్లోంచి మీ వాకిట్లలోకి చేరి- ఆపై మీ హృదయసీమల్లోకి బాటలు వేసుకొంటూ- ముద్దుగా మురిపెంగా- జీవిస్తున్నానే- అందుకు నాకు సంతోషం!

కావాలంటే ఒకమారు మీరు మీ హృదయంతో స్పృశించి చూడండి.

నా ఆకుల పొత్తిళ్ళ నుంచి రాలే ప్రతి పువ్వు ఒక నాజూకు గొంతుకతో మిమ్మల్ని పలకరిస్తుంది. ఒక సౌశీల్యభరిత సౌకుమార్యంతో పరామర్శిస్తుంది.

అదుగోండి.

ఆ పూవులో ఒదిగి ఎవరో పిలుస్తూనే ఉన్నారు.

ఆ ఆకృతిని మీరు గుర్తెరిగినట్లే ఉన్నారు.

ఓ ప్రకృతిని మీరు గుండెల్లో నింపుకొన్నట్లే ఉన్నారు.

సన్నని లోగొంతుకలో మెల్లిగా మొదలయ్యింది. బిగ్గరగా దిక్కులు పిక్కటిల్లేలా అలా పిలుస్తూనే ఉన్నారే!

ఆ ప్రకంపనాలు- గాలిలో, నేలపై ,నీటిలో, ఆకాశంలో- రగిలిన అగ్గిలా- విస్తరించిపోతున్నాయి. అణువణువునా.. అంతరాంతరాల్లోకి.. మీకు వినిపిస్తోందా?

లేదూ?

మరోమారు ప్రయత్నించండి.

కలాలతో నన్ను నాటారు. కన్నీళ్ళతో నన్ను పెంచారు.

ఒకసారి కనులు మూసుకొని, మనసు తెరిచి వినండి.

ప్రయత్నిస్తూనే ఉండండి.

అదుగో- ఆ పిలుపు- ఎవరో పిలుస్తున్నారు. పిలుస్తూనే ఉన్నారు.

"నీలూ... నీలూ..."

★ ★ ★

విరిసీ విరియని ఉదయం.

తూరుపు తీరం.

ఎనభై దశకం ముడుచుకొనే వేళ. తొంభైలలోకి విచ్చుకొనే తరుణం. ఎదిగీ ఎదగని పట్టణం.

"నీలూ.. నీలూ.. నీలూ.."

★ ★ ★

అది వెలిగీ వెలగని ఉదయం.

అది పశ్చిమ తీరం.

ఆరావళీ పర్వతాలు పనిగట్టుకొని పక్కకు జరిగినట్లు- వరస తప్పి- ఆపై ఒక టొకటిగా విస్తరించినచోట. చల్లారిన లావా ముద్దల్లాంటి కఠిన శిలలు. మధ్యలో చల్లగా సాగుతున్న సబర్మతి. ఆ సబర్మతి- ఆరావళీ పాదాల అంచున- ఓ శుద్ధ పల్లెటూరు.

"నీలూ.. నీలూ.. నీలూ.."

★ ★ ★

అవునండి. నేను మీరు ఎరిగిన నీలు గురించే మాట్లాడబోతున్నాను. ముందు తూరుపు తీరపు నీలూ కుటుంబం ఏమయిందో నేను చెబుతాను. ఆ తరువాత పశ్చిమతీరపు నీలు కుటుంబం సంగతి చెపుతా!

ఈ సర్వసాక్షి కథకులు అంతా చెప్పగలరేం అనుకోవచ్చు. కానీ, ఇవి కథలు కావుకదా? జీవితాలు. ఎంత చెప్పినా, ఎంతో మిగిలిపోయే వుంటుంది. ఆ మిగిలినదాంట్లో- నేను చెప్పేది కొంత!

సరే,

తూరుపు తీర నీలు కుటుంబం గురించి మొదట నన్ను చెప్పనీయండి.

ఆ తరువాత ఆమె భర్తకు గల్ఫు నుంచి వచ్చే అవసరం పెద్దగా కనబడలేదు. పెద్దామె పిల్లలను చూసుకొంటోంది. అటు దాయాదుల సాయంతో బీడీల పనిని చక్కబెడుతోంది. దానిపై వచ్చే ఆదాయం అతను లెక్కజేయదగ్గదేమీ కాదు.

అయితే, ఆ అవసరాన్ని అతను త్వర

లోనే సృష్టించుకొన్నాడు. మరోపెళ్ళి చేసుకొన్నాడు. ఆమె కూడా అక్కడి అమ్మాయే. ఆమెకూ పద్నాలుగేళ్ళన్నా నిండాయో లేదో, ఆమె తండ్రి అతని పాత స్నేహితుడు. బీడీల ఫ్యాక్టరీ వ్యవహారాలను అల్లుడి తరపున ఇట్టే అందిపుచ్చుకొన్నాడు. దాంతో అతను తెరిపినపడ్డాడు.

అచ్చం తండ్రిలా ఉండే నీలు కూతురు పెద్దామె పెంపకంతో తండ్రి అజమాయిషీలోకి సహజంగానే ఒదిగిపోయింది. అందరి మర్యాద నిలబెట్టడమే తన మౌలిక ధర్మమని ఆమెకు పసివయస్సులోనే అర్థమయ్యేటట్టు చేశారు.

## కొత్తగాలి...

**నాలుగు రోజులకే రోడ్డు**
**నాలుగు ముక్కలయింది**
**గుత్తేదారుకు**
**నాలుగు రాళ్లు మిగలగా**
**ప్రజలకూ నాలుగు రాళ్లే మిగిలాయి**

*– రఘుపాత్రుని శ్రీనివాసరావు, శ్రీకాకుళం*

మర్యాదబద్ధురాలై ఉండడం అంటే అమ్మలా ఉండకపోవడమేనని ఆమెకు నూరిపోశారు. అనేక ఆంక్షలను ఆమె అణుకువగానే అర్థం చేసుకుంది. గది పరదాలలోకి పరిమితం చేసుకుంది. అయినప్పటికీ, "నువ్వు కూడా మీ అమ్మలాగానే.." అన్న మాటను వమ్ము చేయడానికి ఆమె నిత్యపోరాటం చేయవలసి వచ్చింది.

మాట్లాడే మాట, నడిచే నడక, కట్టేబట్ట- అన్నిటికీ కట్టుబాట్లే. స్నేహాలు, సరదాలు- ఆమె ఎరుగనే ఎరగదు. నీలుకు దక్కిన ఆ కొద్దిపాటి స్వేచ్ఛాభరిత బాల్యం కూడా నీలు కూతురికి అందలేదు. రోజు రోజుకీ మరింత అణుకువగా, మరింత మర్యాదగా తనను తాను తీర్చిదిద్దుకోసాగింది.

కొత్త అమ్మ వచ్చాక ఆమె మరీ తన గదిలోకే ముడుచుకొని పోయింది.

అయితే చిత్రంగా, ఆమె నీలులాగే స్పందించసాగింది. తమ వాకిటి పారిజాతం చెట్టంటే ఆమెకు ఆరోప్రాణం. తల్లిలాగానే పూలమొక్కలు పెంచుతూ ఉండేది. తల్లి విని ఆనందించిన పాటలన్నీ ఆమెకు కంఠతా వచ్చు. శ్రావ్యంగా పాడగలదు.

తనలో తనే రహస్యంగా పాడుకొనేది. ఊహ పెరుగుతున్నకొద్దీ తన పాటకు పారిజాతాల పరిమళాన్ని అద్దుకోసాగింది. అదీ ఎవరికంటా పడకుండానే. ఎవరి చెవినీ సోకకుండానే!

పిల్లలతో ఇట్టే కలిసిపోగలదు. తమ్ముడంటే ఆమెకి ఆరో ప్రాణం. వాడికి వచ్చే ఆయాసాలన్నిటికీ తనే తల్లిలా శుశ్రూషలు చేసింది. తల్లిలాగానే గాలిపటాలు చేయించాలనీ, కాగితం పడవలు చేసి, వాడిని నవ్వించాలని ప్రయత్నించింది. మొదట్లో అసలు కుదిరేవి కావు. తమ్ముడు చాలా ముడుచుకుపోయాడు. తల్లిలేని ఆ గది వాడికి ఊపిరాడనివ్వలేదు. ఏదిఏమైనా ఎప్పుడూ అమ్మ డొక్కలో ముడుచుకొని ఉండేవాడు, ఇప్పుడు తనలోతానే కుంచించుకుపోయి ఉంటాడు.

ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడడు. పెద్దామె వంక నిరాసక్తిగా చూసేవాడు. అక్కతోనే కాస్త ఆట పాట. ఒకరినొకరిని ఓదార్చుకుంటూ, ఒకరికొకరు ధైర్యంగా ఉండేవారు.

కానీ, అతనికి అయిదారేళ్లయినా నిండాయో లేదో- ఒక కొత్త అవతారం ఎత్తాడు. అప్పుడప్పుడు వచ్చిపోయే తండ్రి, పెళ్ళి పేరంటాలతో కొద్దికాలం ఇక్కడే

ఉన్నాడు. ఆ కాలంలోనే కొడుకుకు బాగా సన్నిహితుడయ్యాడు. మోటార్ సైకిల్ మీద ఊరంతా చుట్టేయడం, సినిమాలు, మగవాళ్ళ కబుర్లలో ప్రేక్షకపాత్ర పోషించడము- ఆమాటా ఈమాటా చెవిలో పడడం- తనకు తెలియకుండానే- ఒక కొత్త రూపం దిద్దుకోసాగాడు.

తండ్రి మెప్పు పొందడం కోసం అతను విపరీతంగా ప్రాకులాడతాడు. తండ్రి చెప్పినవి చెప్పినట్లుగా పాటించసాగాడు. మంచో చెడో తెలియని వయస్సులో- అక్క మీద కొత్త అమ్మమీద- ఒక నిఘా అధికారిలా వ్యవహరించడం మొదలుపెట్టాడు.

అక్కపై నిఘావేసి, అజమాయిషీ చేసి, నిర్బంధ మర్యాద జీవితాన్ని, ఆమె చేత అమలుచేసే బాధ్యత తనమీద వేసుకొన్నాడు.

పెళ్ళి ముచ్చట్లు తీరాక ఏడాదికో రెండేళ్ళకో వచ్చివెళ్ళే తండ్రి, ఏం చదువుతున్నావ్? బడికి సరిగ్గా వెళుతున్నావా? నీ స్నేహితులెవరు? నీ ఇష్టాయిష్టాలేమిటి? పెద్దయ్యాక ఏమవుతావ్? లాంటివి అడిగే పొరపాటు ఎన్నడూ చేయలేదు.

"మీ అమ్మ ఎవరితో మాట్లాడుతోంది? ఎక్కడెక్కడ తిరుగుతోంది? మనింటికి ఎవరెవరు వస్తున్నారు? మీ అక్క ఎక్కడెక్కడికి వెళుతుంది? ఏమేం చేస్తుంది? ఎలాంటి బట్టలు వేసుకుంటుంది? వీధిలోకి వెళుతుందా? ఎవరితోనైనా నవ్వు ముఖంతో మాట్లాడుతోందా?" తదితర- అనేకానేక ప్రశ్నల 'బిట్ బ్యాంక్'ను ఆ పిల్లవాడి మెదడులోకి ఎక్కించేశాడు.

పిల్లవాడిచ్చే అవును లేదా కాదు అన్న సమాధానాన్ని బట్టి, పిల్లవాడికి అందే కానుకల జాబితా ఉండేది.

తండ్రికి నచ్చే సమాధానాలే చెప్పడంతో పిల్లవాడు ఇట్టే ఆరితేరిపోయాడు.

బోలెడంత ఖరీదైనవీ, కళ్ళు మిరమిట్లుగొలిపేవి- అతనికి నిత్యం కానుకలుగా

## మే - 2011
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **పిసుపాటి దాక్షాయణి**
   - బండ్లగూడ, హైదరాబాద్
2. **కె. సుధాకర్‌రెడ్డి**
   - కోట, నెల్లూరు జిల్లా
3. **వి. సీతా నరసింహారావు**
   - కరెన్సీనగర్, విజయవాడ
4. **ఎన్. కోటేశ్వరరావు**
   - టి. అగ్రహారం, నెల్లూరు జిల్లా
5. **వి. తారారాణి**
   - గోవిందరావుపేట, వరంగల్ జిల్లా

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. ఆర్.కె. నారాయణ్ | 6. శ్రీపాదసుబ్రహ్మణ్య శాస్త్రి |
| 2. మధు | 7. వి.కె. గోకాక్ |
| 3. డా. రాన్ | 8. రోమా రోలా |
| 4. గఫూర్ | 9. కోలపల్లి ఈశ్వర్, కిషన్ |
| 5. జయరాజు | 10. లారాదత్తా |

అందుతూ ఉండేవి. అలాగే, కొత్త అమ్మ అయిష్టాన్ని మూట గట్టుకున్నాడు.

ఉన్న ఒక్కగానొక్క తోబుట్టువును దూరంగా ఉంచాడు.

తండ్రి ప్రోత్సాహం, పెద్దామె ఎగతీతతో ఆ పిల్లవాడు- నానాటికీ కరడుగట్టిన మర్యాదా రక్షకుడిగా పరిణామం చెందాడు. చివరికి, ఆ సూత్రాలన్నిటినీ పెద్దామెపై కూడా ప్రయోగించసాగాడు!

అవ్వ- అమ్మ- అక్క.

ఈ ముగ్గురిపైనా నిఘా అతని ప్రధాన

బాధ్యత అయి కూర్చుంది.

అతనికన్నా ఏడాదో ఏడాదిన్నరో పెద్దదయిన అక్క, అతనితో స్నేహం పెంపొందించుకోవాలని- అతనిని సావధానపరచాలని ప్రయత్నిస్తూ ఉంది.

అమ్మలాగే అక్క- అన్న తండ్రి వాక్యం అతనిని చిత్రమైన భావనలో ముంచి ఉంచింది.

నీలు కూతురు పుష్పవతి అయిన రెండు నెలల తరువాత, గల్ఫులో ఎవరితోనో పెళ్ళి కుదిర్చేశాడు ఆమె తండ్రి.

అప్పటికి ఆమెకు పదమూడో ఏడు దాటి మూడు నెలలు. అతని అల్లుడికి ఇది ఎన్నో పెళ్ళో ఎవరికీ తెలియదు.

## కొత్తగాలి...



ప్రేమ
మోహనరాగం
పెళ్ళి
మౌనరాగం

– చక్కా చెన్న కేశవరావు,
కావలి

కానీ, అతను నీలు తండ్రి వయస్సువాడు. తండ్రిని మించి ఆమెపై నిఘా కొనసాగించాడు!

నీలు కూతురు తను తన అమ్మలాంటిది కాదని నిరూపించుకొనే అలవాటులో- కిమ్మనకుండా పెళ్లికి ఒప్పుకుంది. ఆపై ఆమె కాపురం ఎలా సాగిందో, ఆమె జీవితం ఎలా గడిచిందో- మనకు చెప్పేవారెవరూ లేరు. అలాగే ఆమె ఏయే అనుమానాల పుట్టలని దాటిందో- ఎన్నెన్ని అవమానాల ·గుట్టలని ఢీకొందో- మనకు తెలియదు.

కానీ, అక్కడ తన గది కిటికీ అంచున- వెళుతూ వెళుతూ తనతో తీసికెళ్ళిన పారిజాతం విత్తులు నాటేసి, ఓ మొక్కను మొలిపించి, దానికి పూలు పూయించే ప్రయత్నం చేస్తోంది!

ఎక్కడబడితే అక్కడ జీవించడానికి, మాదేమయినా అధమాధమపు మానవ జాతా? మాకు తగ్గ నేల, నీరు, గాలి, వాతావరణం ఉండొద్దూ? నీలు కూతురి తాపత్రయం కాకపోతే? అప్పుడప్పుడూ ఆమెను చేరే తమ్ముడి వార్తలకు- మౌనంగా ఆ పారిజాతం కుండీ దగ్గరే వంటరిగా కూర్చుని ఏడ్చేది. ఆమెను ఓదార్చడానికా అన్నట్లు, ఆ మొక్క నాలుగు గరుకు ఆకులతో పలకరించింది. ఆ మాత్రానికే ఆమె ఉబ్బితబ్బిబ్బయింది. తల్లిని తడిమినంత ఆప్యాయంగా తడిమింది.

ఇంతలోనే ఆమె ఒక బిడ్డకు తల్లయింది.

అప్పటికి ఆమెకు పద్నాలుగో ఏడు నిండిందో లేక పదిహేనో ఏడులో అడుగు పెట్టిందో- అంతే. ఆ కానుపు ఆమెకు ప్రాణగండమైంది. బిడ్డను రక్షించాలా? తల్లిని రక్షించాలా? అని డాక్టరు అడిగినపుడు- ఆమె భర్త మరోక్షణం ఆలోచించకుండా- 'బిడ్డని' అన్నాడు.

అచ్చం తన తల్లిలాంటి నీలాల కళ్ళున్న ఆ పాపకు- నీలు పేరే పెట్టమని కోరుతూ- ఆమె ఊపిరిని వదిలింది.

ఆ పాపకు 'నీలు' పేరు పెట్టారో లేదో తెలియదు.

కొద్దిగా ఊహ రాగానే, ఆ పాప నీలు కూతురు తెచ్చుకొన్న పారిజాతం విత్తనాలను గ్రీన్‌హౌస్‌లో నాటేసి- పూలు పూయించే ప్రయత్నం మొదలెట్టింది, అచ్చం అమ్మలాగే. అమ్మమ్మలాగే పాటలు పాడసాగింది. తన పాటకు పారిజాత పరిమళాలు అద్దసాగింది.

★ ★ ★

తల్లి కాలం చేసినప్పుడు నీలు కొడుకు ఎంతగా ఏడ్చాడో.

ఆ తల్లడిల్లిన పసిమనసును అటు తండ్రిగానీ ఇటు అవ్వగానీ ఓదార్చనైనా ఓదార్చలేదు. పైనుంచి చాలా నిర్దయగా ప్రవర్తించారు. నిర్మానుష్యంగా వ్యవహరించారు.

నీలు కొడుకు ఒక్క కన్నీటి బొట్టు రాల్చకూడదని తీవ్రమైన కట్టడి చేశారు. ఆమెను మాట మాత్రం ఆ ఇంట తలవకూడదని- హెచ్చరిక చేశారు.

లోలోన కుమిలిపోవడం- తనలో తాను కుంచించుకు పోవడం- ఆ బిడ్డకు అప్పుడే మొదలయ్యింది. అప్పుడప్పుడూ అక్కాతమ్ముళ్ళు, మిద్దెమీద నీటి ట్యాంక్ కింద జేరి, రహస్యంగా తమ దుఃఖాన్ని పంచుకొనేవారు.

అణకువవతి అయిన అక్క, అవ్వతోనూ, కొత్త అమ్మతోనూ ఇట్టే కలిసిపోయింది. ఆపై, ఆమెతోనూ ఇదివరకులా కలవలేక పోయాడతను. సరిగ్గా అప్పుడే, అతను తండ్రికి చేరువ అయ్యాడు. తండ్రి ప్రోద్బలం, ప్రోత్సాహం అతనిని ఒక గదిలో కూర్చోబెట్టాయి.

ఇక, కొత్త అమ్మ అన్నదమ్ములు బీడీ ఫ్యాక్టరీ అజమాయిషీని తమ చేతిలోకి తీసుకొన్నప్పుడు నీలు కొడుకు బడిపిల్లాడు. అతనికి పది పన్నెండేళ్ళ వయస్సు వచ్చేనాటికి, ఆ ఫ్యాక్టరీకి వారు పూర్తి యజమానులయిపోయారు.

వీటన్నిటి నడుమ నీలు కొడుకు సహజంగానే అల్లరి చిల్లరిగా తయారయ్యాడు. చదువబ్బలేదు. అందిన అరకొర చదువు

ఉపాధి చూపగలిగేది కాదు. ఇక, చేతికం దిన చిన్నాచితక పనులు చేయడం మొద లెట్టాడు.

తండ్రి తనకు తరచు పంపే వీడియో క్యాసెట్లకు మరికొన్ని జతచేసి ఒక వీడియో లైబ్రరీ మొదలుపెట్టాడు. త్వర లోనే, పైరసీ క్యాసెట్ల వ్యవహారంలో జైలు దాకా నడిచివచ్చాడు. ఆపై, దాచినా దాగని నీలి చిత్రాల క్యాసెట్లు అతనిని జైలుదాకా నడిపించాయి. తరుచూ ఏవో తంటాలలో పడుతూనే ఉండడంతో, అది వదిలేసి- ఆటోనగర్‌లో చిన్న మెకానిక్ షాప్ మొద లెట్టాడు. అదీ నడవలేదు. నిజానికి, అతనే నడపలేకపోయాడు. అదీ మూసేశాడు.

## కొత్తగాలి...

**మనిషి కోసం**
**మనిషి చేత**
**సృష్టించబడింది**
**మనీ**

– శ్రీకాళహస్తి వెంకటశేషగిరిరావు,
నెల్లూరు

తానే బస్సులు నడపాలనుకొన్నాడు. అతని వద్ద అంత పెట్టుబడిలేదు. చివరికి, అద్దె కొక ఆటో తీసుకొని నడుపుతున్నాడు.

ఈ పనులన్నీ కొత్త అమ్మ అన్నదమ్ము లకు ఎక్కడా లేని అవమానాన్ని కలిగిం చాయి, ఆపై విపరీతమైన కోపాన్ని. వారిని అడ్డుకొనో పిల్లవాడిని వెనకేసుకుని రానో పెద్దామె కూడా జీవించిలేదు. దాం తో వారు నీలు కుటుంబానికి చెందిన బీడీ ఫ్యాక్టరీకి పూర్తిస్థాయి యజమానులయ్యి, నీలు కొడుకుని మెల్లిగా దూరంచేస్తూ వచ్చారు.

అసలు అతను స్వతంత్రంగా చేయాలని ప్రయత్నిస్తున్న చిన్నాచితక పనులకు మాటిమాటికి అడ్డువస్తున్నదీ- చీటికిమా టికి అతనిని జైలుదాకా పంపుతున్నదీ- వీరేనని వీధంతా అనుకునేవారు. అయినా, పట్టుబడినవాడే దొంగ. పైనుంచి, ఎక్కడ బాంబులు పేలినా, జైలు భర్తీ చేయడానికి సరిపడే ఛోటా నేరగాళ్ళలో ఒకడిగా మిగి లిపోసాగాడు.

పైనుంచి, బావమరుదుల దాకా పతన మవుతోన్న కొడుకు గురించిన సమాచారం చిలువలు పలువలుగా అతని తండ్రికి చేరుతోంది. నీలు కొడుకు గ్రహించే లోపలే అతని తండ్రి అతనిని ఒంటరివాణ్ణి చేశాడు. ఇక, నీలు తల్లి ఎన్నడో కాలం చేసింది. నీలు తోబుట్టువులతో నీలు భర్త ఏనాడూ సంబంధం పెట్టుకోలేదు. కొడు కునూ పెట్టుకోనివ్వలేదు. ఏనాడన్నా మంచీచెడూ మాట్లాడబోయినా, నీలు కొడుకు వారిని దరిచేరనివ్వలేదు.

నీలు ఉండి ఉంటే, తన బిడ్డలను ఎలా పెంచుకొనేదో తెలియదు కానీ, ఒక్కగా నొక్క అక్క కడచూపు కూడా అందకుండా చనిపోయిందన్న వార్త అతనికి ఎప్పటికో తెలిసింది. తెలిసినప్పుడు కూడా ఏ రకం గానూ స్పందించలేనంతగా అతను కరడు గట్టిపోయి వున్నాడు. కసి తేలిపోయాడు.

తండ్రి పసివయసులో నింపిన విషకుం భమో- నీలు గురించి ఆ నోటా ఈ నోటా విన్న లోకాభిరామాయణమో- నీలు కొడు కుకి సమస్త స్త్రీలోకం మీదా ఎక్కడాలేని చులకనభావం. దానికితోడు ద్వేషం, కోపం కలగలసి- 'సామూహిక మర్యాద రక్షకుడి' గా పరిణితి చెందాడు.

మనలాంటి మామూలు వాళ్ళం అత నొక వీధిరౌడీ అనో బజారుగుండా అనో అంటామేమో. కానీ, అతనికై అతను స్వచ్ఛంద సైనికుడిలా భావించుకోసా గాడు. చిన్నతనాన అక్కమీద కొత్త అమ్మ

మీద అమలు పరిచిన అజమాయిషీని, కట్టడిని- వీధిలోని అందరు ఆడవారిపై ప్రసరింపజేశాడు. ఆపై అనువైనచోటల్లా అమలుపరచసాగాడు.

తండ్రి మెప్పుకోల్చుకై తాపత్రయపడి, చేసినవి తప్పులని ఎప్పుడైనా అనిపించినా, ఒప్పుకోలేనంత లోతుల్లో అతను మునిగి పోయాడు. తల్లి మాటెత్తితే తల్లడిల్లిపోయే వాడు. అవమానపడేవాడు. ఆమెవలననే లోకమంతా తనను చిన్నచూపు చూస్తోం దని, హేళన చేస్తోందని, పగలబడి నవ్వు తోందని- పసి వయసులో తండ్రి నేర్పిన పాఠాలని బలంగా విశ్వసించాడు తన జీవితాంతం.

తల్లి చేసిన తప్పేమిటో తండ్రి విడమ రిచి చెప్పినా, అర్థమయ్యే వయస్సు కాదది. ఇప్పుడు మెల్లిగా లోకం తెలిసివస్తున్నా, నిజమేమిటో చెప్పేవారు లేరు. అర్థం చేసు కొనే అవసరం అతనికి ఎదురుకాలేదు.

ఓనాడు, ఇలాంటి చెడమరిగిన కొడు కుతో తనకు సంబంధాలు లేవని, తండ్రి తెగేసి చెప్పాడు. ఇంటి నుంచి ఫ్యాక్టరీ నుంచి- శాశ్వతంగా అతనిని దూరం చేశాడు. సమస్త కుటుంబ సంబంధాలను తుడిపివేశాడు.

తండ్రి ప్రవర్తనతో నీలు కొడుకు నిర్ఘాం తపోయాడు.

అతను నేర్పిన విద్యలలో తాను ఆరితే రానని- తననూ అందరితోపాటు గల్ఫుకు తీసుకుపొమ్మని- మధ్యవర్తుల ద్వారా చెప్పించాడు, తను పక్కన నిలబడి.

'ఇలాంటి పనులు అక్కడ చేసి తన పరువు తీస్తే ఏంకాను?' తండ్రి ఈసడిం చాడు. 'అక్కడి చట్టాలు బలమైనవి. కాళ్ళు చేతులు నరికిపారేస్తారు!'

నీలు కొడుకు కుప్పకూలిపోయాడు. తండ్రి తిరస్కారం, తండ్రి హేళన, తండ్రి ఛీత్కారం- అతన్ని ఛిన్నాభిన్నం చేశాయి. మధ్యవర్తుల చొరవతో కొంత మనోవర్తి ఏర్పాటు చేసి, తండ్రీ కొడుకుల సంబం ధాన్ని శాశ్వతరద్దు చేశారు!

తన సంశయాల్లో, తన సందిగ్ధాల్లో తను కూరుకుపోయి- నీలు కొడుకు కుంచించుకుపోయాడు!

కుమిలిపోతూ కుదేలవుతూ నిత్యం ఎవ రికీ దగ్గర కాలేకపోయాడు. ఎవరినీ దగ్గర కానివ్వలేకపోయాడు.

ఒక దుర్భరమైన వంటరితనాన్ని ఆవ హింపజేసుకొని- అందులోనే జీవిస్తు న్నాడు. జీవిస్తూనే ఉన్నాడు.

ఎప్పుడైనా ఆదమరిచి అలా నడిచివెళు తున్నప్పుడు, అదాటున పారిజాత పరి మళం అతనిని పలకరించబోయినప్పుడు-

> **కొత్తగాలి...**
>
> **జడకైనా, ముడికైనా**
> **వేసేందుకు జుట్టుండాలి**
> **కవితైనా, కథైనా**
> **చెప్పేందుకు సరుకుండాలి**
>
> – ఎన్.కె. నాగేశ్వరరావు,
> పెనుగొండ, ప.గో. జిల్లా

అది తన ఇల్లేమో- అక్కడ తన అమ్మ ఉందేమో- తనను తలదువ్వి- మడత నల గని బట్టలేసి- నుదుటన ముద్దాడి- ఆ పారిజాతం చెట్టుదాకా వచ్చి- బడికి సాగ నంపుతుందేమో-

తనకు జ్వరం వస్తే- మందేసి- పాల బువ్వ తినిపించి- పాట పాడి- తన ఒళ్ళో నిద్రపుచ్చుతుందేమో- అనుకుంటాడు.

అంతలోనే, తన చిట్టి చేతుల్తో అమ్మ లాగా గాలిపటాలు చేసి తనను ఆడించా లనీ- కాగితం పడవలతో బుజ్జగించాలనీ ప్రయత్నించిన అక్క- గుర్తొస్తుంది.

తల విదిల్చుకొని- తల వాల్చుకొని- తన దారిన తాను పోతాడు, నిండా ఇరవై ఏళ్ళు లేని నీలు కొడుకు.

ఇక అతని సంగతి కూడా చెప్పనీ యండి. అతనంటే నీలూ అన్ని శిక్షలు అనుభవించడానికి కారణమైన అతను.

ఆవేళ అకస్మాత్తుగా అంతర్ధానమైన 'అతను', అత్తగారింట చేరిన ఆలుబిడ్డలను కలుసుకొన్నాడు. ఏడుపులు, మొత్తుకోళ్లు సర్దుబాట్లు- అయిపోయాక, అప్పటికే హైదరాబాద్ శివార్లలో పొలాలు కొని, ద్రాక్ష తోటలు వేస్తోన్న పెద్ద బావమరిది, చెల్లెలికి ఓ నాలుగెకరాలు కొనిచ్చి, వారి కుటుంబాన్ని అక్కడికి చేర్చాడు.

నాలుగేళ్ళు అందరూ అజ్ఞాత జీవితం గడిపినట్లు గడిపారు. అంతలోనే అతను ద్రాక్ష వ్యవసాయం తెచ్చే ఫలసాయంకన్నా మించిన లాభసాటి వ్యాపారాన్ని ఆకళింపు చేసుకొన్నాడు.

తన పొలాన్ని స్థలాలుగా మార్చి విక్రయించాడు.

స్థలంలో నుంచి స్థలం- ధనంలోంచి ధనం వద్దన్నా వచ్చిపడ్డాయి.

నగర శివార్ల నుంచి నగరంలోని ప్రముఖుల నివాస స్థలాల నడుమకు చేరారు. పిల్లలకు మంచిబడి. కుటుంబానికి సకల సౌకర్యాలు సమకూర్చుకున్నారు. వివిధ వ్యాపారాలలో పెట్టుబడి పెట్టాడు. డబ్బు డబ్బును కూడబెట్టింది. ధనంతోపాటే పరపతి- పరపతితో పాటే ప్రతిష్ఠ- అతనింటికి చేరాయి.

త్వరలోనే రాజకీయాల్లోకి చేరాడు. క్రియాశీలక వ్యవహర్త అయ్యాడు. అటు పదవి, ఇటు ప్రతిష్ఠ రెండు చేతులా డబ్బు. కోరుకొన్న విలాసవంతమైన భద్ర జీవితం.

కూతురు చూస్తుండగానే ఓ ప్రతిష్ఠాత్మకమైన కళాశాల నుంచి ఇంజినీరింగ్ పట్టా పుచ్చుకుంది. ఓ భారీ పారిశ్రామికవేత్త ఏకైక కూమారుడితో అంగరంగ వైభవంగా పెళ్లి జరిపించాడు.



కొడుకు అమెరికాలో చదువుకొంటున్నాడు. అదవ్వగానే ఆర్థిక మంత్రిగారి చిన్నమ్మాయితో వివాహం చేయ నిశ్చయించారు.

నందిహిల్స్ నుంచి జూబ్లీహిల్స్- అన్ని ప్రాజెక్టులలో ఒక అందమైన ఇల్లు వారికి స్వంతమైనా శ్రీనగర్ కాలనీలోని మూడో మలుపులో వీధి చివరి ఇంట్లోనే ఉండాలని అతని భార్య పట్టుదల.

అక్కడే, అతను స్వయానా గోడవారగా ఒక వరుసలో పారిజాతం చెట్లు నాటి,



పెంచి పెద్దవి జేశాడు. వాటి మధ్యలో మచ్చలేని తెల్లటి తెలుపు పాలరాతి మందిరం నిలిపాడు. అందాల మురళీకృష్ణుడి ప్రతిమ తెచ్చి ఉంచాడు. చూడడానికి వేయికన్నులు చాలవు. అందునా పారిజాతాల పూలు విరబూసే కాలంలో పూర్ణిమ నాడు చూడాలి అక్కడి అందాలను!

అందుకేనేమో, అందరూ మరిచిపోయినా అతని సతీమణి మాత్రం రహస్యంగా నీలుకి కృతజ్ఞతలు చెప్పుకుంటుంది. 'ఆనాడలా జరగకపోయి వుంటే, ఈనాడిలా తాము ఈ వైభోగాన్ని అనుభవించేవారమా' అని!

ఏమైనా కానివ్వండి. ఎవరైనా సరే- శ్రీనగర్ కాలనీలోని మూడో మలుపు తిరుగుతూ- ఒక్కక్షణం- పరవశత్వానికి, సమ్మోహనానికి, మైమరుపునకు- గురికావలసిందే!

సరిగ్గా అలాంటి మైమరుపులోనే అతని భార్య జీవించసాగింది.

అదే అతను ఆశించింది!

★ ★ ★

పదండి.

పశ్చిమ తీరానికి పయనమవుదాం.

అక్కడి నీలు కుటుంబాన్ని పలకరిద్దాం.

ఎప్పటిలాగానే ఆరోజు నీలు తండ్రి పారిజాతం చెట్టు మొదట్లో సొమ్మసిల్లి పడివున్నాడు నిద్రో మెలకువో తెలియని



## సమాజమేగతి బాగుపడునోయ్!

'అయోమయం' అనే కవితలో అటు సంప్రదాయాన్ని గుడ్డిగా అనుసరించేవారినీ, ఇటు సామాజిక రుగ్మతలను విస్మరించి ప్రణయ కావ్యాదులు రాసే భావకవులనీ జాషువా తీవ్రంగా అధిక్షేపించారు.



'ప్రణయకవి యొకండు, పాషాణ కవి యొక్క
డేడ్చు కవి యొకండు నేకమగుచు
నొండొరులను యోదార్చుకొనుచున్న
బాగుపడునె భావి భరత జాతి' అంటూ

జాషువా సామాజిక స్పృహలేని కవిత్వాన్ని ఘాటుగా విమర్శించారు.

స్థితిలో.

అతనెందుకో పైకి లేవబోతూ, తనపై రాలిన పుడకలను, ఎండుటాకులను, కాయలను దులుపుకోబోతుండగా గమనించాడు.

ఒక్కో పగిలిన కాయ నెర్రెలు విచ్చిన హృదయంలా తోచిందతనికి. అందులో రెండే రెండు విత్తులు! జీవించడానికి తపిస్తున్నట్లుగా!

నీలు తండ్రి ఆ పగిలిన హృదయాలన్నిటినీ పోగుజేశాడు.

తన తలపాగాను విప్పి, ఆ పొడవాటి బట్టను నడుం చుట్టూ పట్టీలా చుట్టుకొన్నాడు. భుజం మీదుగా వల్లెవేసుకొన్నాడు. ఆ పారిజాతం కాయలన్నిటినీ అందులో భద్రం చేయసాగాడు.

"హే పగ్లా! ఏం ముల్లె దాచావ్!" దారినపోయే అల్లరిపిల్లలు అతని నడుం పట్టీని లాగి, పీకి వేళాకోళం చేసేవారు.

అతను మారు మాట్లాడకుండా కాసిన్ని గరుకు పారిజాతం ఆకులను వారి మీదకు విసిరేవాడు.

నీలు తల్లి తలవాకిటకు వచ్చి, అతనిని ఏనాడు కన్నెత్తి చూడలేదు. పన్నెత్తి పలకరించనూలేదు.

నీలు వదిన ఒక ఇత్తడి పళ్లెంలో సజ్జరొట్టెలు, మిరపకాయలు, తీపిమామిడి పచ్చడి- ఒక ఇత్తడి చెంబునిండా జీలకర్ర పొడి వేసిన మజ్జిగ, సాస్‌ను తెచ్చి- పారిజాతం చెట్టు మొదట్లో పెట్టి వెళ్లేది, ప్రతి పూటా తులసి మొదట్లో నీళ్లు పోసినంత శ్రద్ధగా.

అతనికి బుద్ధిపుడితే ఆ మజ్జిగ తన పొట్టలో పోసుకొనేవాడు. లేకుంటే, ఆ చెంబెడు పారిజాతం చెట్టుకే పోసేవాడు.

కొడుకు అతని దగ్గరకి రాబోయినా, పలకరించబోయినా - ఎవరో అపరిచితుణ్ణి చూసినట్లు వెర్రిచూపులు చూపులు చూసేవాడు. అతనితో ఏదో ప్రమాదం పొంచి వుందని- రక్షించమని బిగ్గరగా కేకలు వేసేవాడు. అరిచిగోల చేసేవాడు.

కొడుకు నిస్సహాయుడై, దుఃఖాన్నంతా దిగమింగుకొని, దొడ్డిదోవలోనే ఇంటికి రాకపోకలు కొనసాగించసాగాడు.

మంచీచెడు చూడవలసిన బాధ్యత కోడలిపైన పడింది.

అప్పుడే వెక్కివెక్కి ఏడ్చాడనీ, అంతలోనే పగలబడి నవ్వాడనీ- గాలిలో సున్నాలు చుడుతున్నాడనీ, మేఘాల్తో మాట్లాడుతున్నాడనీ- అర్థాంతరంగా పళ్ళెం విసిరేశాడనీ- అదనీ ఇదనీ- ఆమె మామగారి వార్తలను లోపలికి మోసుకు వచ్చేది.

ఒక ఉదయం ఆమె అలవాటు ప్రకారం ఇత్తడి పళ్లెం, చెంబులతో వాకిట్లోకి వెళ్లేసరికి, మామగారు కనిపించలేదు. గోడవారగా, చెట్లచాటున చూశాక కానీ, తెరిచి

వున్న గేటును ఆమె గమనించలేదు. ఏడుస్తూ కేకలు పెడుతూ ఇంట్లోకి పరిగెత్తింది, పళ్లాన్ని నేలమీద విసిరేసి.

నీలు తండ్రి అంతర్థానమయ్యాడు.

వీధిలో పంచాయితీలో, బడిలో, బావుల్లో, పొలాల్లో పశువుల కొట్టాల్లో- ఎక్కడ వెతికినా కనబడలేదు. చుట్టుప్రక్కల పల్లెల్లో ఎక్కడా అజాపజా లేదు.

ఏ అర్ధరాత్రిన వెళ్లాడో- ఏ అపరాత్రిన పొలిమేర దాటాడో- ఎంతకూ అంతు చిక్కలేదు. ఒడి నిండా పారిజాతం విత్తనాలను తప్ప అతను మరేమీ తీసుకెళ్లలేదు.

ఎక్కడికి పోయింది- ఎక్కడికి చేరింది- ఎవరికీ తెలియలేదు.

కానీ, అక్కడోచోట విత్తనం నాటుతూ కనబడ్డాడనీ, ఫలాన కొండ మొదలులో పారిజాతం మొక్కకు పాదుజేస్తుంటే చూశామని- ఆ నోటా ఈ నోటా ఇంటికి ఓ వార్త చేరేది.

కొడుకు ఉరుకులు పరుగులు పెట్టో, ఒంటె బండెక్కో అక్కడికి చేరేసరికి, అక్కడి నుంచి తండ్రి మటుమాయం.

తండ్రి ఊరు వదిలివెళ్లాక, కొడుకుకూ ఘామిడి గ్రామంలో ఉండబుద్ధి పుట్టలేదు. తాతలనాటి భూమిని అమ్మేసి, బంధుమిత్రులను వదిలేసి, గాంధీనగర్ పయనమయ్యాడు. గాంధీనగర్ శివార్లలో రెండెకరాలు, నాలుగు ఆవులతో సంసారం మొదలు పెట్టాడు.

కాస్త కుదుట పడేసరికి, అతను ఓ తండ్రయ్యాడు.

ఆ పసిపాప అచ్చుపోసినట్లుగా నీలు రూపలావణ్యాన్ని- నీలాల కన్నులను పుణికి పుచ్చుకొంది. నీలు వదిన తన బిడ్డకు నీలు పేరే పెట్టాలని పట్టుబట్టింది.

ఆ పాప బుడిబుడి అడుగులు వేయడం మొదలెట్టగానే, తిన్నగా వాకిట్లో గోడవారగా నాటిన పారిజాతం చెట్టు వద్దకు నడిచింది.

ఆ చిట్టితల్లి నేల రాలిన పూలను చూసి పాలనవ్వులు విరజిమ్మింది. ఆ పగడపు కాడలను తన చిన్ని వేళ్ళతో సున్నితంగా పట్టుకొంది. పువ్వు పువ్వునూ నవ్వులతో పాటు నాయనమ్మ దోసిట్లో పోసింది.

చాలాకాలం తరువాత నీలు తల్లి ముఖాన సన్నని నవ్వు కదలాడింది. అది గమనించిన చిన్నినీలు మళ్ళీ మళ్ళీ ఆ రాలిన పూలను ఆమె దోసిలి నింపింది.

నీలు తల్లి నింపాదిగా లేచింది. పారిజాతాల పూలమాలను గుచ్చింది. పాపతో చిన్ని కృష్ణుడి మెడలో వేయించింది.

పాప అమ్మానాన్నల ఆనందానికి అవధులు లేవు.

## కొత్తగాలి...

**నాన్నా!**
**గది ఖాళీచెయ్!**
**నా కొడుక్కి**
**పెళ్లయింది!**

*– డాక్‌యార్డ్ లక్ష్మీనాయుడు,*
సింహాచలం

ఆపై, ఆ ఇంట పంటసిరి నాట్యమాడింది. పాడి పొంగి పొర్లింది. ఇల్లు కళకళలాడింది. పారిజాతం విరగబూసింది.

అంతేకాదు, సబర్‌కాంత జిల్లాలో ఈదర్ తాలుకాలో- సబర్మతీ నదీ తీరాన గానీ, ఆరావళి అంచుల్లో కానీ, రోడ్డు వారగా, వీధి మొదట్లో, కొండ పాదాల్లో అడవిసీమలో.. అక్కడ.. ఇక్కడ.. ఎక్కడైనా- అదాటున పారిజాత పరిమళం పలుచని గాలితోపాటు మమ్మల్ని పలకరించిందే అనుకోండి-

అది నీలు తండ్రి నాటిన విత్తై ఉండాలి!

అతను అక్కడక్కడే సంచరించి వెళ్ళి ఉండాలి!

గుర్తుంచుకోండేం!

★ ★ ★

అరరే!

అటు చూడండి.

అక్కడెవరున్నారో గుర్తుపట్టారా?

అక్షరాలా మన నీలు మాష్టారు గౌతం భట్, వారి సతీమణి శేఫాలీ సమేతంగా.

ఇన్నాళ్ళూ ఏమయ్యారో- ఓమారు పలకరించి వద్దాం రండి.

వాళ్ళు ఇద్దరూ, మరికొంతమంది ఉపాధ్యాయులతో పాటుగా- వరుసలు వరుసలుగా నిలబడ్డ పిల్లలతోపాటు నిదానంగా

## కొత్తగాలి... 

**ఆలోచనలు**
**పురుడు పోసుకుంటే**
**కాగితం మీద**
**అక్షర జననం**

**– పినిశెట్టి శారద,** రాజమండ్రి

ముందుకు వెళుతున్నారు.

అది సబర్‌కాంత జిల్లా. విజయనగర్ ప్రాంతం. ఆరావళీ పర్వతాల అంచు.

సముద్రం ఒడ్డున చేరిన పిల్లలు తమ చిట్టిపాదాల మీద కట్టిన పిచ్చుక గూడుల్లా ఇసుక గుడుల్లా ఎంత చక్కగా ఉన్నాయో ఆ కొండలు!

బోర్లేసిన త్రిభుజాల్లా!

ఎవరో పనిగట్టుకొని మూలమట్టాలతో కొలిచి మలిచినట్లు!

నున్నని గండశిలలు- నల్లగా తిన్నగా చక్కగా- నిగనిగలాడుతూ ఉన్నాయి.

సరిగ్గా, ఆ కొండమలుపులో సాగుతోన్న సన్నని బాటను చూడండి. అదే హల్దీ ఘాట్! రాణాప్రతాప్ కురుక్షేత్రం అన్న మాట!

ఆ ఛిత్తోడ్‌గఢ్ సింహం తన ఆపత్కాలంలో రాజ్యం వదిలి- ఈ విజయనగరం ప్రాంతంలోని కొండగుహల్లోనే తలదాచుకొన్నాడట. ఆ నిడుపాటి కొండల మీదనే తన ప్రియాతిప్రియమైన చేతక్(అశ్వం)పై స్వారీ చేస్తూ- ప్రాతఃకాల కవాతులు చేసేవాడట. తన అఖండ భిల్లు సేనాదళానికి ఇక్కడి నుంచే తర్ఫీదు ఇచ్చేవాడంటారు. ఇప్పటికీ, ఆ గిట్టల ధ్వని ఇక్కడ ప్రతిధ్వనిస్తుందని ఇక్కడివారు చెపుతుంటారు.

అదుగోండి- ఆ బస్సులోనే ఈ పిల్లలు, వారి ఉపాధ్యాయులు ఇక్కడికి వచ్చారు. పెద్ద సైనుబట్ట మీద తాటికాయంత అక్షరాల్లో రాశారు- "గర్వీ గుజరాత్- బడి పిల్లల చారిత్రక పర్యటన" అని!

అదన్నమాట సంగతి.

మన గౌతంగారి బృందం చారిత్రక పర్యటనలో ఉన్నారన్నమాట. అందుకే, ఇంత మరుగున పడిన ఈ విజయనగర్ ప్రాంతానికి వచ్చారన్నమాట! మరిచిపోయిన చరిత్రపుటల్ని తాకి వెళ్ళను వచ్చారన్నమాట!

పిల్లలు రాజబాట వదిలి కాలిబాట పట్టారు. వారితోపాటు ఉపాధ్యాయులు. గలగలగల కబుర్లాడుతూ- పకపక నవ్వుతూ- దట్టమైన చెట్ల నడుమకు సాగిపోతున్నారు.

"పిల్లలూ- చూశారా ఆ గుహను? యుద్ధంలో గాయపడ్డ రాణాప్రతాప్‌ను చేతక్(అశ్వం) ఇలాంటి గుహలోకే తీసుకొచ్చిందట! అక్కడే తన భార్యాపిల్లలతో రాణా అజ్ఞాతవాసం గడిపాడట"

"పిల్లలంటే-? "

"పాప- బాబు- మీ అంతవారే!"

"టీచర్, వాళ్ళు ముందే వచ్చారా?

# సున్నితమైన వేట




అమెరికా పోలీసులు పారిపోయే నిందితులను పట్టుకునేందుకు లేసర్ గన్‌లను ఉపయోగిస్తున్నారు. సగటున ఇరవై డాలర్ల ఖరీదు చేసే ఇవి ఎలక్ట్రిక్ షాక్ కలిగించి మనిషిని అచేతనం చేస్తాయంతే. ఇది సన్నటి షాక్ ఇస్తుంది. దీంతో ఎవరైనా స్పృహ కోల్పోతారంతే.

ఆరిజోనాలోని స్కాట్స్‌డేల్ అనే ఊళ్ళో లేసర్ ఇంటర్నేషనల్ ఇన్ కార్పొరేషన్ వీటిని తయారుచేస్తోంది. వీటి వల్ల నేరస్తుడికి కాని, పోలీసులకు కాని ఎలాంటి హాని కలుగదు. 2005 జూలై నించి 2007 జూన్ దాకా లేసర్ గన్ ఉపయోగించిన సందర్భాల మీద యుఎస్ జస్టిస్ డిపార్ట్‌మెంట్ ఓ సర్వే చేసింది. 962 మంది మీద వీటిని ప్రయోగిస్తే వారిలో కేవలం ముగ్గుర్నే హాస్పిటల్‌లో చేర్చారు. మరణం మాత్రం సంభవించలేదు. ఇద్దరు మరణించినా అది లేసర్ గన్ వల్ల కాదని, వారికున్న రోగాల వల్లనే అని తేలింది. 99.7 శాతం మందికి ఎలాంటి గాయాలు కూడా కలగలేదని తెలిసింది.



అయితే అమ్నెస్టీ ఇంటర్నేషనల్, హ్యూమన్స్ రైట్స్ ఆర్గనైజేషన్స్ వీటి వాడకానికి వ్యతిరేకంగా నిరసన తెలియచేశాయి. పోలీసులు ఉపయోగించే లాఠీలు, కుక్కలు, గుర్రాల కంటే లేసర్ గన్స్ మంచివని లేసర్ ఇంటర్నేషనల్ సంస్థ తరపున స్టీల్ డర్టిల్ అనే ప్రతినిధి చెప్పాడు.

పోలీసులే కాక సాధారణ పౌరులు ఉపయోగించే లేసర్ ఆయుధాలు కూడా అమెరికన్ మార్కెట్‌లో లభ్యమవుతాయి. అమెరికన్ పోలీసులు మాత్రం లేసర్‌గన్ ఆత్మరక్షణకి, నేరస్తులని పట్టుకోడానికి ఎంతో ఉపయోగపడుతున్నాయని చెబుతున్నారు.

రాణా వచ్చాక తీసుకు వచ్చారా? " ఓ పాప ఆరా తీసింది.

"వాళ్ళు సొరంగ మార్గంలో వచ్చి గుహలో దాగి వున్నారు. చేతక్ తిన్నగా వాళ్ళవద్దకు రాణాను తీసుకెళ్ళింది" ఆ టీచర్ కళ్ళారా చూసినంత నమ్మకంగా సమాధానం చెప్పింది.

"తరువాత? "

"ఏముంది? ఇక్కడ ఆడవిలో భిల్లు నాయకుడు వచ్చాడు. ఆకుపసర్లు, మందులు వేసి- రాజుగారి గాయాలు నయం చేశారు. 'పాపం, ఆ పిల్లలు ఆడుకోకూడదు, అరవకూడదు, నిశ్శబ్దంగా ఉండాలి. వంట చేయకూడదు. మంట వేయకూడదు"

"అరరె-"

"ఓసారి ఏమయిందంటే-"

"ముందు వంట ఎందుకు చేయకూడదో మంట ఎందుకు వేయకూడదో చెప్పాలి టీచర్!" ఓ బాబు పట్టుపట్టాడు.

"బడుద్ధాయ్- చుట్టూ శత్రుసైనికులు! దొరికిపోరూ? " పక్కనున్న పిల్లాడు నెత్తిన చరిచి మరీ చెప్పాడు.

"ఒకసారి ఏమయిందో - అది చెప్పండి టీచర్-"

"రాణా కుటుంబం కందమూలాలతో బతుకుతూ ఉన్నారు. వాళ్లకు భోజనం సరిగా లేదు. రాణీగారు ఎలాగో రెండు రొట్టెలు చేయగలిగారు. పిల్లవాడి రొట్టెను కోతి లాక్కెళ్ళింది. ఇక చిన్నపాప తన రొట్టెను తమ్ముడికి ఇచ్చి- ఆకలితో అసువులు బాసింది-"

"అయ్యో!"

"కటిక నేలమీద పడుకొంటాం. కందమూలాలు తింటాం. దేశమర్యాదను కాపాడుతాం. దేశమర్యాదే మా స్వేచ్ఛ! జై

చండీ!" అంటూ రాణా మరింత పట్టుదలతో ముందుకు సాగాడు. అక్బర్ సైన్యాన్నే ఎదిరించి- స్వతంత్ర రాజ్యం స్థాపించాడు-"

పిల్లలంతా చప్పట్లు కొట్టారు.

"జై చండీ!" ఒకరు సరదాగా అన్నారు. అందరూ అల్లరిగా అరుస్తూ- ముందుకు పరిగెత్తారు. చేతక్‌ను స్వారీ చేస్తున్నట్లు- కత్తులు ఝళిపిస్తున్నట్లు- కదం తొక్కుతూ. ఆ ఉత్తేజాన్ని ఉల్లాసాన్ని- ఉపాధ్యాయులంతా నవ్వుతూ చూస్తున్నారు. ఆ ఉరుకులు పరుగుల ఉత్సాహం అంతా ఒక్కసారిగా చల్లబడింది. ఎక్కడి

**కొత్తగాలి...**

**అమ్మలో కమ్మదనం**
**నాన్నలో వెన్నదనం**
**కలబోతే**
**అన్నయ్యంటే**

– నేమాన సుభాష్ చంద్రబోస్,
శ్రీకాకుళం

వారక్కడ నోటమాట కరువైనట్లు దిగ్భ్రాంతులై నిలబడిపోయారు.

కళ్లెదురుగా కనబడుతోన్న నిలువెత్తు చరిత్రను నిశ్చేష్టులై చూడసాగారు. కనురెప్ప వాల్చకుండా ఊపిరి బిగబెట్టి.

అక్కడ, ఎవరో పనిగట్టుకొని కత్తెరతో కత్తిరించినట్లుగా- ఒక గుడి. ఆ గుడి శిఖరం నిలువునా- నిట్టనిలువునా - నిటారుగా ధ్వంసం చేయబడి వుంది.

ధ్వసం కాగా మిలిగిన గుడిశిఖరం, స్తంభాలు, తోరణాలు పైన శిల్ప సంపద సజీవ చేతనా మూర్తమై వారిని పలకరించింది.

వారందరిలోని ఉత్సాహం ఉద్వేగంగా - ఆపై ఉద్రేకంగా మారింది.

ఆ ప్రాంతాన్ని ఎవరెవరు ఏయే కాలాలలో ఎలా ధ్వంసం చేశారో ఏమేమి కొల్లగొట్టారో అన్ని వివరాలు అటు గుజరాతీలోను ఇటు హిందీలోను - ఆపై ఇంగ్లీషులోనూ చక్కగా వ్రాసి - ముఖ్యమంత్రి ముకుళిత హస్తాలతో చిరునగవు మోముతో- సవినయంగా ప్రకటిస్తోన్న భారీ పోస్టర్లు దారికి అటూ ఇటూ.

ఒక్కో పదం. ఒక్కో వాక్యం-

ఆ పిల్లల మెదళ్లలోకి మెత్తగా నాటుకో సాగింది.

ఒకరికి తెలియకుండా ఒకరు పళ్లు కొరికారు. ఎవరికి వారు పిడికిళ్ళు బిగించారు. ఒకరిని చూసి ఒకరు కళ్లురిమారు.

వారిలో కొందరు నడుంపై లేని మొలతాళ్లు సవరించుకోబోయారు గుటకలు మింగుతూ. మరికొందరు తలమీదుగా ఉత్తుత్తి ముసుగును సరిచేసుకొన్నారు ఊపిరి బిగబడూతూ.

గౌతంభట్ తీవ్ర దిగ్భ్రాంతికి లోనయ్యాడు.

ఎక్కడినుంచో పలుచని పారిజాతపరిమళం నేనున్నాంటూ అతనిని పలకరించింది. ఒక్కసారిగా అతనిలో జ్ఞాపకాల తుట్టె కదలాడింది. అయోమయంగా అవతలి వైపున్న శేఫాలీ ముఖంలోకి చూశాడు.

అతని ముఖంలో వేగంగా వచ్చిన మార్పును గమనించి, శేఫాలీ అతని దగ్గరకు రాసాగింది.

గౌతం మెల్లిగా నేలమీద కూర్చున్నాడు. శేఫాలీ మెల్లిగా అతని పక్కన చేరింది.

"తప్పుదోవన పడ్డాం శేఫాలీ"

గౌతం ఎప్పటికో అన్నాడు ఒక్కో అక్షరం వత్తిపడుతూ.

శేఫాలి ఏమీ మాట్లాడలేదు. మౌనంగా వినసాగింది. గౌతం నెమ్మదిగా బరువుగా ఒక్కోమాట మాట్లాడుతున్నాడు.

"బడి పిల్లల చారిత్రక పర్యటనకు ప్రభుత్వం ప్రత్యేక ఏర్పాట్లు చేసింది- ప్రతి విద్యార్థికీ రోజుకు రెండు వందలయాభై రూపాయలు పర్యటన వేతనం ఇచ్చిందీ- మనకు ప్రత్యేక వేతనం ఇచ్చిపంపిందీ- ఇందుకా? ఎక్కడికి వెళ్లాలో- ఏ చరిత్రను చూపాలో- ఏ వివరణలు ఇవ్వాలో - ఇదంతా ఎంత ప్రణాళికాబద్ధంగా జరిగిందీ!" గౌతం తనలో తను మాట్లాడుకున్నట్లు అన్నాడు.

శేఫాలి మెల్లిగా ఒక్కో వాక్యాన్ని అర్థం చేసుకొంటూ- తలాడించింది.

"అదుగో- ఆ బోర్డుల మీది వాక్యాలు చూశావా శేఫాలీ? అవన్నీ- అరరే - పిల్లల మెదళ్ళలోకి ఇంకిపోతున్నాయే!"

"అవును గౌతం - హృదయాల్లోకి కూడా!" శేఫాలీ వెలవెలబోతూ అంది.

గౌతం యధాలాపంగానో యాధృచ్ఛికంగానో మాట్లాడడం లేదని శేఫాలికి అర్థమైపోయింది. గౌతం ముఖం నెత్తురు చుక్క లేనంతగా పాలిపోయింది. మాట్లాడడానికి మాటలు పెగలనంతగా అతని నోరు పొడారిపోయివుంది.

శేఫాలీ మౌనంగా క్యాంప్ వాటర్ బ్యాటిల్ మూతలోకి నీరు వంపింది. ఆ ప్లాస్టిక్ కప్పును అతని చేతికి అందించింది.

ఒక గుక్క నీరు మింగుడు పడ్డాక గానీ- గౌతం గొంతు పెగలలేదు.

"శేఫాలీ! మనం ఇక్కడికి ఇందుకా వచ్చింది"

"కాదు!" శేఫాలీ ఖాళీ కప్పును తీసుకొని మౌనంగా వాటర్ బాటిల్‌ను బిగించసాగింది.

"ఏమిటిదంతా? " గౌతం గొంతులోని తడి, వత్తిడి - అతని ముఖంలో కదలాడిన భావం శేఫాలిని నిలువునా కుదిపివేసింది.

అంతలోనే ఎంతోకాలంగా తమలోనే నిక్షిప్తమైపోయిన ఒక నిజం - జడలు విప్పుకొని వికటాట్టహాసం చేస్తూ- తమ ముందు నిలబడి - ఆ ప్రశ్న వేసినట్లనిపించింది. శేఫాలికి ఒక్క క్షణం వళ్లు జలదరించింది. వెన్నులోంచి వణుకు తనువంతా పాకింది.

'తనకే ఇలా ఉంటే, గౌతంకు ఎలా అనిపిస్తుందో' శేఫాలి తల విదిల్చుకొని, భర్తతో మెల్లిగా అంది.

"నీళ్లు అయిపోయాయి. అలా గుప్తగంగ వైపు వెళదామా? నీళ్లు నింపుకోవచ్చు" వాటర్ బాటిల్ ఎత్తిచూపుతూ చిన్న పిల్లలా నవ్వింది.

గౌతం ఆమె ముఖంలోకి తేరిపార జూశాడు. మారుమాట్లాడకుండా గుప్తగంగ వైపు నడిచాడు.

శేఫాలీ మిగిలిన టీచర్లకు చెప్పి, అతన్ని అందుకోను గబగబ నడిచింది.

లోగడ వారిద్దరూ అక్కడికి వచ్చినప్పుడు, రాణీపద్మిని నుంచి రాణాప్రతాప్ వరకు కబుర్లు దొర్లాయి. సతీసహగమనాల నుంచి వీరోచిత గాథల వరకు బోలెడన్నీ విశేషాలు.

గుప్తగంగలో చల్లని నీళ్లలో గులకరాళ్ల మీదుగా నడుస్తూ, తనూ శేఫాలీ వచ్చీరాని సినిమా పాటలు పాడుకున్నారు. పసిపిల్లల్లా పకపకా నవ్వుకున్నారు. గౌతం జ్ఞాప

## కొత్తగాలి...

**కూల్చిన వాడూ**
**కూలక తప్పదు**
**లాడెన్**

– బద్ది నాగేశ్వరరావు
అనకాపల్లి

కాల్లోంచి వెనక్కి తిరిగి చూశాడు.

శేఫాలీ పరిగెడుతున్నట్లు నడుస్తూ- అత నివైపే వస్తోంది. ఆనాటి ఏపాట గుర్తుకు వచ్చిందో ఓ చిన్ననవ్వు గౌతం ముఖాన విరిసింది. మెల్లిగా తన చేయి చాచాడు. శేఫాలీ మెత్తగా నవ్వుతూ చేయి అందు కుంది. అతని ముఖాన చిన్న నవ్వు ఆమెను కుదుటపరిచింది.

ఇద్దరూ తమ తీయని జ్ఞాపకాలలో అడుగువేసుకుంటూ- గుప్తగంగ పాదాల దాకా నడిచారు.

చిక్కటి నిశ్శబ్దం.

అక్కడెక్కడో ఆకులు గాలితో ఊసులా డుతోన్న సవ్వడి. అప్పుడప్పుడు పక్షులు కదులుతున్న చప్పుడు. దూరాన పిల్లల అల్లరి సందడి. పాదాల చుట్టూ సెలయేటి అలజడి.

సరిగ్గా అప్పుడే-

ఒక పారిజాత పరిమళం శేఫాలీని సున్నితంగా స్పృశించింది.

అప్రయత్నంగా ఆమె అడుగులు అటు వైపు పడ్డాయి.

ఆ అడవిలో- ఆ సెలయేటి ఒడ్డున ఎవరు నాటారో.. ఎన్నడు పెరిగాయో.. ఎప్పుడు రాలిపడ్డాయో పారిజాతాలు.. దట్టమైన తివాచీలా.

ఆ అడవిన రాలిన పారిజాతాలే ఏదో ఆత్మీయ ఆహ్వానం పంపాయి. అంతే!

"గౌతం! అలా చూడు! " శేఫాలీ అసం కల్పితంగా ఓ కేక వేసినంత పనిచేసింది. తన చేతిలోని ఖాళీ నీళ్ళసీసాను గౌతం చేతిలో పెట్టేసి - గబగబ పూలవైపు పరు గులు పెట్టింది.

తన ఒడిలోకి ఆ రాలిపడిన పారిజాతా లను గబగబ నింపసాగింది.

శేఫాలీలో పసిపిల్లలాంటి ఆ సంబరాన్ని చూస్తూ- గౌతం మురిపెంగా నవ్వాడు. తనూ చటుక్కున వంగి, గుప్పిట నిండా పూలు నింపుకొని - ఆమెపైకి విసిరాడు. శేఫాలీ రెండు గుప్పెళ్ళపూలతో ఆయనకు జవాబు చెప్పింది. ఆపై దోసెళ్ళ నిండా ఒకరిపై ఒకరు.

నవ్వులు పువ్వులు ఆ దంపతుల చుట్టూ రాలి పడుతున్నాయి.

ఆ పరిమళాలు ఎంతవరకు సోకాయో, పిల్లలంతా తామున్నామంటూ బిలబిలలా డుతూ అక్కడికి వచ్చి పడ్డారు.

ముసిముసి నవ్వులతో శేఫాలీ వారితో కలిసిపోయింది. మధుర జ్ఞాపకాల్ని గంభీర వదనంలో ముడిచిపెట్టుకొని - గౌతం గుప్తగంగ వైపు నడిచాడు. ఆ సెల యేటి నీళ్ళలో పాదాలు పెట్టగానే - నీటి వలయాలు అలలు అలలుగా విస్తరిం చాయి. ఆ అలల గిలిగింతలలో తన్మయు డైనాడు గౌతం. ఊపిరి గట్టిగా పీల్చి వదిలి వచ్చినపనిలో తలవంచాడు. నీళ్ళ సీసా మూత తీసి - నీరు నింపను వంగాడు. నొక్కుల జుట్టులో ఎక్కడ నక్కాయో, శేఫాలీ విసిరిన పారిజాతాలు - ఆ అలలపై అలవోకగా రాలిపడ్డాయి.

ఎందుకో తెలియదు.

గౌతంకు ఆకస్మాత్తుగా నీలు గుర్తుకు వచ్చింది.

ఆ వెంటనే, ధ్వంస శిఖరం జ్ఞాపకం వచ్చింది.

## కొత్తగాలి...

మనీకోసం చేసేది
డ్యూటీ
మంచికోసం చేసేది
హెల్ప్

– వాడపర్తి వెంకటరమణ,
విశాఖపట్నం

వెనువెంటనే, ఘూమిడి గ్రామం, పంచాయితీ, అధికారులు, కుల మర్యాదలు, కుల కట్టడాలు అన్నీ.. అన్నీ.. గుర్తుకు వచ్చాయి.

'నీలు నా విద్యార్థి..' ఆ రోజన్నంత తీవ్రంగానే ఇప్పుడూ అన్నాడు వినడానికి అక్కడెవరూ లేకపోయినా.

'మంచీ మర్యాద, శాస్త్రం, తర్కం, జ్ఞానం కళలు - ఏవీ.. ఏమీ.. ఆ సంఘటన ఘటించకుండా ఆపలేదు!' గౌతం గంభీరుడై పోయాడు. మౌనంలోకి కూరుకుపోయాడు.

సరస్వతీ పూజనాడు, నీలు ఓ ఇత్తడి పళ్ళెం నిండా నవ పారిజాతాలు నింపి, బడికి తీసుకువచ్చేది. పారిజాతాల మాలలు గుచ్చి, సరస్వతి మెడలో వేసేది. సరస్వతి పాదాల వద్ద విరిసిన వేయిరేకుల వెన్నెల పుష్పంలా - అందంగా పారిజాత కుసుమాలను అలంకరించేది.

స్వచ్ఛమైన పాలవన్నె హంస రెక్కల్లాంటి ఆ నాజూకు పూరేకులు - హంస ముక్కుల్లా చెక్కినట్లున్న ఆ పవడపు కాడలు - చూడడానికి ఎంత మనోహరంగా ఉండేవో!

అచ్చం ఆ సత్యలోకం సంద్రపు అలలపై అలరారిన రాయంచపై కొలువై, అల్లనమెల్లన కదులుతూ; వీణ తీవెలు సవరిస్తోన్న ఆ సరస్వతీ మూర్తి కళ్ళముందు కదలాడేది కాదూ?

గౌతం చేతిలోని వాటర్ బాటిల్‌లోని నీరు మళ్ళీ సెలయేటి పాలయ్యాయి.

జరగబోయే ఘాతుకాన్ని తెలిసీ ఆపలేని, తన నిస్సహాయతకు తలబాదుకుంటూ - గుండెలవిసేలా ఏడ్చిన ఏడ్పు - మరొక్కసారి ప్రేవుల్లోంచి గుండెల్లోకి తోసుకొచ్చింది.

కళ్ళు తేలిపోతున్నా - కాళ్ళు మొరాయిస్తున్నా - అంతరాంతరాల్లోని శక్తిని పుంజు

కుంటూ - పొలిమేరలు తొక్కకుండా - పొలాల్లో దాక్కుంటూ - సెనగ చాళ్ళలో - నక్కి నక్కి - పరిగెత్తిన ఆ పరుగులు - ఒక్కసారిగా జ్ఞాపకం వచ్చాయి.

మెల్లిమెల్లిగా గౌతం చుట్టూ నిశ్శబ్దం ఆవరించింది.

అక్కడున్న పిల్లల కేరింతలు, ఉపాధ్యాయుల సవరింపులు - అతనిని ఏ మాత్రం కదిలించలేదు. భారమైన గుండెతో అడుగులో అడుగేస్తూ- మెల్లిగా గట్టుమీద ఓ చెట్టు కింద కూలబడ్డాడు.

అలలు అలలుగా జ్ఞాపకాలు.

## కొత్తగాలి...

**కేంద్రంలో ఓ కీలుబొమ్మ**
**రాష్ట్రంలో ఓ తోలుబొమ్మ**
**ఇద్దరూ పట్టుకొని వేలాడేది**
**చివరంచు కొమ్మ!**

– మోదు రాజేశ్వరరావు,
విశాఖపట్నం

నిర్ఘాంతపోయి- నిశ్చేష్టుడై, నిస్త్రాణగా- ఆ ఆలోచనలలో తడిచిపోసాగాడు.

ఎందుకో తెలియదు గానీ, సరిగ్గా అదే సమయానికి శేఫాలీకి నీలు గుర్తుకు వచ్చింది. ఘామిడి నుంచి ప్రతిరోజూ హిమ్మత్‌నగర్‌కు తాము చేసిన, పాల వ్యాన్ ప్రయాణాలు- కళాశాలలో వృక్షశాస్త్ర పాఠాలు, పారిజాతాల చెట్ల వరుసలు, ఆ గోడలోని పగులు, గోడ అవతలి కాలి బాట- అన్నీ ఒక్కసారిగా జ్ఞాపకం వచ్చాయి.

ఉలిక్కిపడ్డట్లు అయ్యింది. ఆసరా కోసమేమో అన్నట్లు, భర్తవైపు చూసింది. అతని మౌన గంభీర వదనం ఆమెను మరింత కుదిపివేసింది. మెల్లిగా అతని వైపు నడిచింది.

గౌతం పక్కనే మౌనంగా కూర్చుంది.

గౌతం ఏదో కలలోంచి మాట్లాడుతున్నట్లుగా అన్నాడు, "అది హత్యాకాండ. అవి బాల్యవివాహాలు"

శేఫాలీ మరోమాట మాట్లాడకుండా అతని భుజాన తన తలను వాల్చింది.

"మనమంతా చూస్తుండగానే.. మన కళ్ళముందే.." గౌతం గొంతు పూడుకుపోయింది.

శేఫాలీ కంట తిరిగిన నీరు, గౌతం భుజాన్ని తడిపాయి.

ఎంతసేపు వారలా కూర్చున్నారో-

ఎన్నెన్ని అనుభూతులు వారిని చుట్టివేశాయో-

"టీచర్.. టీచర్... సార్... సార్.. టీచర్.. సార్.."

కొందరు పిల్లలు పరిగెత్తుకుంటూ అక్కడికి వచ్చారు. ఆయాసం అణుచుకొంటూ, నేను ముందు చెప్పాలంటే నేను ముందు అన్నట్లు పోటీలు పడుతూ-

దంపతులిద్దరూ సర్దుకు కూర్చున్నారు. శేఫాలీ గబగబ ముఖం చున్నీ చివర్లతో తుడుచుకుంది. నవ్వుతూ పిల్లలకు ఎదురెళ్ళింది. "ఏంటి సంగతి? " అంటూ.. శేఫాలీ చేయి పట్టుకొని, లాక్కొని వెళ్ళారు. మరికొందరు పిల్లలు చనువుగా గౌతం చేయిపట్టి లాక్కెళ్ళారు.

తిన్నగా అక్కడున్న దట్టమైన పారిజాత చెట్ల వరుసల్లోకి, పిల్లలు, ఉపాధ్యాయులు అంతా అక్కడ చేరారు. పారిజాతాల పూలను గుట్టలు చేసి, వరుసలుగా పేర్చారు. పారిజాతాల వెన్నెల రేకులు ఒక వరస. పారిజాతపు పగడపు కాడలు మరో వరస. పారిజాతం గరుకు చిగుళ్ళు ఇంకొంక వరస. రాలిన పుల్లలు పుడకలతో అశోకచక్రం.

"అరే, అది మన జాతీయ జెండా!"

శేఫాలీ చిన్న పిల్లలా సంబరపడింది.

"భలే పెట్టారే!" అసంకల్పితంగా చప్పట్లు కొట్టింది.

"అచ్చం నీలులాగా!" గౌతం ఆ మాట అనేసి, నిశ్శబ్దంగా నిలబడి పోయాడు.

ఆ పారిజాతాల అమరిక. తమ ఘామిడి బడిలో ఎప్పుడు వీలుచిక్కినా - నీలు ఇలాంటి పూల చిత్రాలు వేసేది. అదే ఆకుపచ్చ. అదే కషాయం. అన్నిటికీ మించిన ఆ తెలుపు! గౌతం ముఖాన పలు చటి నవ్వు కదలాడింది, పారిజాతపు పలు చని పరిమళం లాగానే! పిల్లలు కేరింతలు కొడుతూ, గలగలా నవ్వుకున్నారు.

గౌతం నవ్వులోని నిగూఢత ఏమిటో ఒక్క శేఫాలీకే తెలుసు. పిల్లలతో కలిసి ఆమె నవ్వుతూనే ఉన్నా గుండెలోని తడి ఆమె గొంతును చిక్కబెట్టింది.

"దేశ మర్యాద" గౌతం తలవిదిల్చాడు.

"అవును, ఆ దేశ మర్యాదను కాపాడడం లోనే తమ స్వతంత్రం ఉందని నమ్మిన ఎందరు చరిత్రకెక్కని రాణాప్రతాపులు ఈ హల్దీఘాట్‌లలో నేలకొరిగారో! ఎంతటి శౌర్యం ఎంతటి పరాక్రమం మట్టిపాల య్యిందో!

ఇక, తమ దేహమర్యాదను కాపాడడం లోనే దేశమర్యాద, కులమర్యాద ఉందని- ఎంతెంతమంది స్త్రీలు- సుందర సుకుమార రాణీపద్మినీలు - చితులపైకెక్కారో! మాన మర్యాదను పదిలపరుస్తూ!

ఎన్నెన్ని ఆలోచనలు.. ఎన్నెన్ని అను భూతులు వారితోపాటు దగ్ధమైపోయా యో! ఆ వివరాలన్నీ చరిత్రలో మరుగున పడిపోయాయి. మరిచిపోయాం.

చరిత్రపుటల కెక్కని 'మర్యాద పరివ్రాజ కులు' మంటలకెగసి ఇలా పారిజాతాల్లా కటిక నేలపై వాలుతున్నారేమో!

ఈ గుప్తగంగ చుట్టుముట్టే రాణాప్రతాప్ భిల్లు సైన్యాన్ని సమీకరించి, ప్రచండ సామ్రాజ్య జ్వాలకు- ఎదురొడ్డి నిలిచింది.



## కిరాతుడి కన్ను పడిందే!

దువ్వూరి రామిరెడ్డి, గుర్రం జాషువా మంచి మిత్రులు. ఇద్దరి బిరుదూ 'కవి కోకి ల' అని ఒకటే. ఓసారి మద్రాసులో కవి సమ్మేళనం. అప్పుడు తమ మధ్యనున్న



సాన్నిహిత్యంవల్ల వారిద్దరూ కబుర్లలో పడ్డారు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి తదితరులంతా కూడా ఉన్నారక్కడ. ఆ స్నేహితుల ధోరణి చూసిన విశ్వనాథ 'కవి కోకిల' అనే బిరుద ను దృష్టిలో పెట్టుకొని 'రెండు పక్షులు ఒక చోటికే చేరాయే?' అని చమత్కరించారు. దానికి జాషువా వెంటనే, 'నిజమే, కానీ కిరా తుడి కన్ను ఇంకా పక్షుల మీదే ఉన్నది' అ ని ప్రతిగా చురక వేశారు.

ఆ భిల్లు సైనికుల సతీమణులంతా చరి త్రలో ఏ మరుగున పడ్డారో! ఆ భిల్లు బిడ్డలు, బాలికలు- ఎక్కడ వెతికినా ఒక్క ఆనవాలన్నా మిగల్చకుండా- మలిగిపో యారే!

చితికెక్కిన సుందర సుకుమారి రాణీ పద్మినిని మనం అందంగా జ్ఞాపకం చేసు కొంటాం- కత్తికొక కండగా కదనరంగాన చిందింది. తన దేహ మర్యాదను, తమ దేశమర్యాదను కాపాడిన కర్మాదేవిని మనం తలవనైనా తలవమే? ఆమెను, ఆమె దేశాన్ని- ఆమే కాపాడుకున్నదే- ఆమె గురించి మన చరిత్ర మాట్లాడదేం?'

గౌతం నిట్టూర్చాడు.

"ఆ సుకుమార బాలికలు, సుందర నవ వధువులు, కదం తొక్కిన కన్నతల్లులు, చితులకెక్కిన సతీమ తల్లులు- వారి ఆశలు వారి అనుభూతులు- వారి అవమానాలు- వారి అభిమానాలు- వారి మాన మర్యాదలు- అన్నిటికీ మించి- మళ్ళీ మళ్ళీ మంటల్లో పడి లేచిన వారిలోని బలమైన ప్రేమ తరంగం-

ఆ పారిజాతాలకు ఓ నిగూఢ సౌందర్యాన్ని- ఓ సున్నిత సుగంధాన్ని అద్ది వుందొచ్చు!"

ఇలా.. ఇలా.. కాలాలు మారినా..

దేశ మర్యాదే-

దేహ మర్యాద!

## కొత్తగాలి... 

**బావురుమంటున్న మహిళా రిజర్వేషన్ బిల్లు**
**లోక్‌పాల్ బిల్లుని చూచి**
**నా పక్కన చోటున్నది నీ కొక్కరికే**
**అంటూ కూనిరాగాలు తీస్తోంది**

– *తల్లాప్రగడ ప్రభాకర్,*
మదీనాగూడ, హైదరాబాద్

దేహ మర్యాదే-

దేశ మర్యాద!

తరం తరువాత తరం-

మర్యాదగా మర్యాదను మిగుల్చుకొంటూ.

బాలికలను

సతీమ తల్లులను

సాధ్వీమణులను

దేశమాతలను

వారి మర్యాదను కాపాడుతూ కాపాడుతూ- కఠినమైపోయిన గండరగండల గుండెలే- ఆ గండశిలల ఆరావళీ పర్వత సానువులేమో!

ఆ శిలల నడుమ మెత్తని పగుళ్ళలలో నుండి-

ఏ గుప్తగంగ పారేనో-

ఏ సబర్మతి పాడేనో-!'

గౌతం ఆలోచనల్లో కూరుకుపోయాడు.

"పోనీయండి.

బాలికల ఊపిరిని.

సతీమతల్లుల తలుపుల్ని

సాధ్వీమణుల పరాక్రమాలని

పోనీయండి.

పారిజాతాల్లో కలిసి పోనీయండి.

పారిజాతాల్లా మిగిలిపోనీయండి.

'ఈ చారిత్రక పర్యటనను ఎంతో ఔదార్యంగా ఏర్పాటు చేసిన తమ ప్రభుత్వం- ఏ చరిత్రను పిల్లలకు నేర్పించదలిచిందో- తెలుస్తూనే ఉంది. ఏ చీకటి కోణాన్ని భావితరాలకు మరచిపోనీవ్వకుండా- మన సులలోకి ఇంకింపజేస్తుందో- తెలుస్తున్న కొద్దీ- గౌతం మనసు వెగటు పడింది. ఆలోచనలు విలవిల్లాడిపోయాయి.

ఆ చీకటి నీలి తెరలలోంచి- నా చరిత్ర మాటేమిటి? అంటూ నీలూ నిలదీసినట్లనిపించింది. నిజమే, మమ్మల్నిలా గుర్తుంచుకోమంటూ వారేనాడు అడగలేదు. ఏ నీలూ తన మర్యాదను నిలపమని ప్రాధేయపడలేదు. వారి మర్యాద మంటగలిసిందని- వారి కలలను భస్మీపటలం చేసేసి- వారి ఊపిరిని పారిజాతాలలో నింపేశాం కదా? మనం? ? ?

మర్యాదగా!

ఆ పలుచని పరిమళాలను చల్లని సాయంకాలాల్లో ఆస్వాదించేస్తూ- ఆనందించేస్తూ-"

"గౌతం!" శేఫాలీ గౌతంని పట్టి ఊపింది.

"ఏమైనా, మర్యాద మిగిలింది. మిగులుతూనే ఉంది. మిగులుతుంది" గౌతం గాఢంగా ఊపిరిపీల్చి వదిలాడు. ఆమె

ముఖంలో ఏదో సమాధానం వెతుకుతు న్నట్లు- ఆత్రంగా- ఆదుర్దాగా- గబగబా అన్నాడు.

ఆమె నిశ్శబ్దంగా నర్మగర్భితంగా ఆ మాటలు చెవిన బెట్టింది. ఎన్నాళ్లో అవి అలా గింగురుమంటూనే ఉన్నాయి. భర్తను ప్రేమగా పొదివి పట్టుకొంది. ఆమె నడుం వాటేసుకొని, వెక్కివెక్కి ఏడ్చాడు. ఏడుస్తూనే ఉన్నాడు. ఆమె కన్నీరు జత కలిశాయి. అతని మాటలు వారిని చుట్టేశాయి.

"మనమంతా చూస్తూ ఉండగానే.. మనందరి కళ్ళముందే.."

★ ★ ★

వాళ్ళ మర్యాద వాళ్ళు నిలబెట్టుకొన్నారు!

వీళ్ళ మర్యాద వీళ్ళు నిలబెట్టుకొన్నారు!

వాళ్ళకు వీళ్ళకు లొంగని మా పారిజాతాలు పరిమళిస్తూనే ఉంటాయి. తరతరాలుగా మరి, మా వంశ మర్యాదను మేమూ నిలబెట్టుకోవద్దా?

వాళ్ళు.. వీళ్ళు.. మర్యాద-

నడుమ..

ఎన్ని హృదయాలు బద్దలు కొడుతుంటారో-

ఎన్ని శరీరాలు మట్టిన బడుతుంటాయో-

ఎన్ని ఆశలు నెత్తుటి మొదలవుతుంటాయో-

అదుగోండి-

అప్పుడే.. సరిగ్గా అప్పుడే..

నా గుండె పగిలిపోతుంది. విత్తనం విరజిమ్ముతుంది. ఒక పసిమొక్క కళ్లు తెరుస్తుంది. మరొక నీలు జీవితం మొదలవుతుంది!

★ ★ ★

అప్పుడే తొడిమను వీడిన పారిజాతం పూవు గాలిలో అలవోకగా తేలుతూ- అలలు అలలుగా సాగుతూ- సుతారంగా నేలపై వాలింది.

వెన్నెల చుక్కలా.. వెలుగు బొట్టులా..

అదుగో..

అక్కడ వాళ్లు పిలుస్తున్నారు.

ఇదిగో..

ఇక్కడ వీళ్ళూ పిలుస్తున్నారు.

★ ★ ★

విరిసీ విరియని ఉదయం.

తూరుపు తీరం

ఎదిగీ ఎదగని పట్టణం

ఎనభై దశకం ముడుచుకునే వేళ. తొంభైలలోకి విచ్చుకొనే తరుణం.

అదుగో.. సరిగ్గా అక్కడే.. సరిగ్గా అప్పుడే..

వాళ్ళు పిలుస్తున్నారు.

"నీలూ.. నీలూ.. నీలోఫర్.."

★ ★ ★

అది వెలిగీ వెలియని ఉదయం.

అది పశ్చిమ తీరం

సబర్మతి ఒడ్డు

ఆరావళి పాదాల అంచు

ఓ అచ్చమైన పల్లెటూరు.

ఇదిగో..

సరిగ్గా ఇక్కడే..

సరిగ్గా ఇప్పుడే..

వీళ్ళు పిలుస్తున్నారు.

"నీలు.. నీలూ.. నీలాంబరీ.."

★ ★ ★

నీలు పకపకలాడుతూ పలకరించే వరకు వారు పిలుస్తూనే ఉన్నారు.

నవపారిజాతాలు స్నిగ్ధమనోహరంగా.. సర్వసమ్మోహకంగా.. పరిమళాలు వెదజల్లుతూనే ఉన్నాయి.

అందంగా అలవోకగా నేల వాలుతూనే ఉన్నాయి.

ఒక్కో నీలు ఊపిరిని తమలో నింపుకొంటూ.



# నిజ పారిజాతాలు

**సాం**స్కృతిక సంరక్షకులు, ధర్మపరిరక్షకుల పదఘట్టనల కింద నలిగి నశించిపోయిన చిన్నారి నీలులాంటి పసి పారిజాతాల కథ చదివారు కదా? ఇది కేవలం రచయిత్రి స్వకపోల కల్పనకాదు. సమాజంలో జరిగినదే. ఇప్పటికీ జరుగుతున్నదే! పాము తన పిల్లల్ని తనే తింటుందని విన్నాం.. కానీ, పిల్లల్ని కని, అల్లారుముద్దుగా పెంచుకున్న తల్లిదండ్రులూ, కుటుంసభ్యులే ఆ బిడ్డల్ని అతిదారుణంగా చంపుకోవడం పాము -పిల్లల పోలికకు ఏరకంగానూ సరిపోదేమో?

పలుదేశాలలో ఏటా వేలాదిమంది అమాయక స్త్రీలు, బాలికలూ ఇలా ప్రాణాలు పోగొట్టుకుంటున్నట్లు యునైటెడ్ నేషన్స్ పాప్యులేషన్ ఫండ్ తెలుపుతోంది. ఒక్క 2005లోనే మన పొరుగుదేశం పాకిస్థాన్‌లో దాదాపు పదివేల పరువు హత్యలు జరిగినట్లు ఓ అంచనా! మనదేశంలో కూడా ఇవి తక్కువేం కాదు. పంజాబ్, రాజస్థాన్, హర్యానా, బీహార్, మహారాష్ట్ర, గుజరాత్‌లలో ఇలాంటి దారుణాలు ఎక్కువగా జరుగుతున్నాయి.

మరో సంగతేమంటే- పరువు హత్యలకు పాల్పడినవారు చట్టానికి దొరకడంలేదు. అసలీకేసులు పోలీస్ స్టేషన్ దాకా కూడా చేరడం లేదు. చేరినా నిరూపణ కావడంలేదు. అయినా దోషులకు పడే శిక్ష అతిస్వల్పమే. ఇది చాలదా ఈ ఉన్మాదులలో ఉత్సాహం నింపడానికి?

పరువు హత్యలకు దాదాపుగా బలవుతున్నది ప్రేమికులే కావడం మరో విషాదం. కన్నవారిని కాదని వేరేవ్యక్తిని ప్రేమించిన యువతి చివరకు తల్లిదండ్రుల చేతిలోనే హతం కావడం ఏ వెలుగులకి ప్రస్థానం?

నిజజీవితంలో ఈ దమనకాండకు గురైన కొందరు అభాగ్యుల (వ్యక్తుల పేర్లను మార్చాం) కథనాలు ఇప్పుడు చదవండి...

# కన్నబిడ్డకు కరెంట్‌షాకులు!



## పాకిస్థాన్‌లో జరిగిన పరువుహత్య

"సైమా! ఇప్పటిదాకా ఎక్కడ చచ్చావే? బిందెడు మంచినీళ్లు తేవడానికి ఇన్ని గంటలు పట్టిందా!"

తల్లి కేకలకి పదిహేడేళ్ల సైమా భయంతో వణికిపోయింది. ఎంతగా వణికిపోయిందంటే- ఆ వణుకుకు తలమీదున్న బిందెలోని నీళ్లు ఒలికి సైమా ముఖాన్ని, దుస్తుల్ని తడిపేశాయి.

భయం భయంగా లేడిపిల్లలా బెదురుతూ ఇంట్లోకి వచ్చి బిందె దించింది. చున్నీతో ముఖం తుడుచుకుంది.

వెనగ్గా వచ్చిన తల్లి సైమాని క్రూరంగా చూస్తూ- "ముదనష్టపుదాన! ఇందాకా ఎక్కడ పచార్లు చేసొస్తున్నావ్? ఇంత ఆలస్యం ఎందుకైందంటే చెప్పిచావవేం? " అంటూ నెత్తిమీద గట్టిగా ఒక్కమొట్టికాయ వేసింది.

సైమా కళ్లలో నీళ్లు తిరిగాయి.

ఏం చెప్పాలో అర్థం కాలేదు.

ఊరికి తూర్పున, అరమైలు దూరంలో కొండవాగు పారుతోంది. దాని ఒడ్డున వున్న దిగుడు బావి నుంచి మంచినీళ్లు తెచ్చుకుంటారు ఊరివాళ్లంతా. నీళ్లుతెస్తానని చెప్పి ఆ సాయంత్రం ఐదు గంటల వేళ బిందెతో బయలుదేరింది సైమా.

అయితే తోవలో ఉన్న తోటదగ్గర కలిశాడు సిద్దిఖ్!

అతను సైమా తండ్రి దగ్గర పనిచేస్తుంటాడు. కరెంటు మోటర్లు బాగుచేయడంలో దిట్ట! సైమా తండ్రిదీ అదేపని! అయితే టౌన్‌లో ఓ షాపు పెట్టుకుని ఆయన అక్కడ పనులు చేస్తుంటాడు. ఈ నేపథ్యంలో వాళ్లింటికి వస్తూ పోతూండే సిద్దిఖ్, సైమా అందానికి చిత్తయ్యాడు. మెల్లగా మాటలు కలిపాడు. సైమా కూడా అతన్ని మనస్ఫూర్తిగా ఇష్టపడింది. సిద్దిఖ్ పట్నంనుంచీ వచ్చేటప్పుడు ఆమెకోసం తరచూ రిబ్బన్లు, లిప్‌స్టిక్కులు, కాస్మొటిక్స్ తెచ్చిచ్చేవాడు. వారిమధ్య ఈ ప్రేమ వ్యవహారం రెండేళ్ల నుంచి చాటుమాటుగా సాగుతోంది.

సైమా ఇంటినుంచి బయటకు వచ్చినప్పుడు కాపుగాసి, ఎక్కడో అక్కడ ఏకాంత ప్రదేశంలో ఆమెను కలిసి ముచ్చట పెట్టడం సిద్దిఖ్‌కు అలవాటు! అతను మాట్లాడుతుంటే ఆమెకసలు సమయమే తెలిసేదికాదు. అంత కబుర్లపోగు! పైగా అందంగా ఫ్యాషన్ డ్రెస్సుల్లో చలాకీగా తిరుగుతూ ఉండేవాడు.

ఆ సాయంత్రం ఆమె బిందెతో కొండ వాగుకు నడుస్తుంటే ఎలా తెలిసిందో ఏమో వెళ్లేదారిలో ఉన్న తోటదగ్గర కలిసి చిరునవ్వు నవ్వాడతను.

అనూహ్యంగా అతను అక్కడ ప్రత్యక్షమవడంతో ఉలిక్కిపడింది సైమా. ఆమె గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. భయం




భయంగా అటూఇటూ చూసింది. కను చూపుమేరలో మనుషులెవ్వరూ లేరు. దాంతో హమ్మయ్య అనుకుని ఓ నిట్టూర్పు విడిచింది.

"హాయ్ సైమా! మేరీజాన్ ఆయీయే.. ఆదాబర్సే" అంటూ నవ్వుతూ పలకరించాడు సిద్దిఖ్.

చిరునవ్వుతో సిగ్గుల మొగ్గయింది ఆ పదిహేడేళ్ల పడుచు.

ఇద్దరూ కలిసి తోటలోకి నడిచారు. ఓ చెట్టు కింద మెత్తని పచ్చికలో కూర్చున్నారు. ఆమె చేతిని తనచేతిలోకి తీసుకుని పెదాలకు ఆనించుకుంటూ మృదువుగా ముద్దాడాడు సిద్దిఖ్. ఆ స్పర్శ ఆమెకు పరవశంగా తోచింది. గంటకుపైగా ఇద్దరూ కబుర్లాడుకున్నారు.

పొద్దువాలింది. మెల్లగా చీకట్లు ముసురుకున్నాయి. హఠాత్తుగా ఈ లోకంలోకి వచ్చిపడ్డ సైమా ఉలిక్కిపడి "చాలాసేపైంది బాబూ వచ్చి! అమ్మ చంపేస్తుంది" అంటూ దిగ్గున లేచింది.

అయిష్టంగానే తనూ లేచాడు సిద్దిఖ్. వెళ్తున్న సైమా చేతిలో ఓ చిన్న ప్యాకెట్టు పెట్టాడు సిద్దిఖ్.

ఏమిటన్నట్టు చూసింది సైమా.

ఇంటికి వెళ్లాక చూడు అని నవ్వుతూనే సైగచేశాడతను. ఆమె దాన్ని చీరకొంగులో దాచుకుని గబగబ వాగువైపు నడిచింది.

★ ★ ★

పాకిస్థాన్ తూర్పుభాగంలోని బహవాల్‌పూర్ జిల్లాలోని ఓ గిరిజన గ్రామం సైమా నివాసం. ఇంట్లోని ఆరుగురి సంతానంలో ఆమె పెద్దది. తండ్రి గ్రామానికి సమీపంలోనున్న చిన్న టౌన్‌లో కరెంటు మోటార్లు బాగుచేసే వర్క్‌షాపు నిర్వహిస్తున్నాడు. ఊళ్లో బడివున్నా, ఆడపిల్లలకు చదువెందుకని తల్లిదండ్రులు ఆమెకు చదువు చెప్పించలేదు. దాంతో తల్లికి సాయంగా ఇంటిపని, వంటపనీ చేస్తూ, ఇద్దరు తమ్ముళ్ళు, ముగ్గురు చెల్లెళ్లను సాకుతూ

కాలం గడుపుతోంది సైమా.

అవిద్యకు, అజ్ఞానానికి ఆలవాలమైన ఆ గిరిజన గ్రామంలోని జనం ఆచారాలు, నమ్మకాలు చాలా అమానుషంగా ఉంటాయి. ముఖ్యంగా ఆడపిల్ల పరాయి మగాడితో మాట్లాడడం వారి దృష్టిలో పెద్ద నేరం. అలా మాట్లాడితే శిక్షలు దారుణంగా ఉంటాయి.

ఈ విషయం సైమాకు సిద్దిఖ్‌లకు తెలియందేం కాదు. అయినా ప్రేమవాహినిలో కొట్టుకుపోతున్న వారిద్దరూ దాన్ని పెద్దగా పట్టించుకోలేదు. వీలైనంతవరకూ ఎవరి కంటా పడకుండా అదే తోటలో కలుస్తూనే ఉన్నారు. ఊసులాడుకుంటూ ఉన్నారు. ఊహల ఉయ్యాలలూగుతూనే ఉన్నారు. ఆ సమయంలో వాళ్ళిద్దరికీ పరిసరాలేవీ కనిపించేవికావు. ఊరి కట్టుబాట్లూ గుర్తుకొచ్చేవికావు..

ఒకనాడు ఒకలాంటి మైకంలో, తమకంలో ఆ ప్రేమికులిద్దరూ తనువు మరచి, మనువు గురించి ముచ్చటించే వేళ జరగరాని అనర్థం జరగనే జరిగింది.

వారిద్దరినీ ఓ రెండు జతల కళ్లు గమనించాయి.

ఆ కళ్లలో ఒకజత ఊరి పంచాయితీ పెద్దలలో ఒకరిది కాగా, రెండోజత సైమా చిన్నాన్నవి. దురదృష్టం!

ఎవరైతే చూడకూడదో వాళ్లకంటే బడ్డాయా ప్రేమపావురాలు!

మర్నాడే పంచాయతీ ముందు చేతులు కట్టుకుని నిలబడిందా యువజంట. ఇరుపక్షాల తల్లిదండ్రులూ బంధువులూ కూడా హాజరయ్యారు.

గ్రామమేకాదు చుట్టూ వున్న శివారు తండాలన్నింటా ఒకటే కట్టుబాటు! పంచాయితీ పెద్దలు చెప్పిందే వేదం. దంపతులు కాకుండా, ఆడ-మగ ఎవరైనా బహిరంగంగా మాట్లాడినా, చాటుమాటుగా ప్రేమ వ్యవహారాలు సాగించినా, అక్రమ సంబంధాలు పెట్టుకున్నా శిక్ష మహాఘోరంగా ఉంటుంది.

చిట్టచివరకు సైమా-సిద్దిఖ్‌లు ఇద్దరూ దోషులుగా నిర్ధారణయ్యారు. ఇద్దరికీ శిక్ష పడింది.

కూతురు తమ కుటుంబం పరువు బజారుపాలు చేసిందన్న ఆగ్రహావేశాలతో ఉన్న ఆమె తల్లిదండ్రులూ, బంధుగణం స్వయంగా సైమా కాళ్లుచేతులు కట్టేసి, ఇష్టం వచ్చినట్లు కొట్టారు. అంతటితో ఊరుకున్నారా.. అదీలేదు!

మనిషన్నవాడెవరూ చేయలేని, కనీసం ఊహించడానికి ఇష్టపడని పని చేశాయా కసాయిమూకలు.

అదేమంటే కరెంట్‌తో షాకులివ్వడం!

ఆ బాధ తాళలేక సైమా గిలగిలా కొట్టుకుంటుంటే తమపరువు నిలబడిందని చంకలు కొట్టుకుందా పాశవిక మూక! కడుపుచించుకుని పుట్టిన కూతుర్ని కన్నవారే ఇంత కర్కశంగా హింసిస్తారని తెలియని ఆ పసిపారిజాతం ఎంతబతిమాలినా అది అరణ్యరోదనే అయింది. ఆ మూర్ఖులు కించిత్తు జాలి కూడా చూపలేదు. ఫలితం ఓ అమాయికబాలిక అర్థంతరంగా అసువులు బాసింది.

పరువుకోసం తమ కుటుంబం తమ బిడ్డనే పోగొట్టుకుందని ఆ తల్లిదండ్రులు గర్వపడుతుంటే గ్రామప్రతిష్ఠను నిలబెట్టామని ఆ ఊరిపెద్దలు రొమ్ము విరుచుకున్నారు. తర్వాత పెద్దవిందు చేసుకున్నారు. హే భగవాన్! వీళ్లకు కొంచెం మానవత్వమివ్వు ప్లీజ్!

## హర్యానాలో 'నిత్య'కృత్యం!

దేశరాజధాని నగరం.. రోడ్లన్నీ వాహనాల రణగొణధ్వనితో చెవులు చిల్లులు ప

డుతున్నాయి.

ఆ సమయంలో అశోక్‌నగర్ బస్టాపులో ఆతృతగా ఎవరికోసమో ఎదురు చూస్తున్నాడు ఓ యువకుడు. అప్పటికే అతను అక్కడికి చేరుకుని అరగంట దాటింది. అంతలో వడివడిగా నడుస్తూ అతని వద్దకు వచ్చిందో యువతి.

ఇద్దరి పెదాలపై పలకరింతగా నవ్వుల పువ్వులు!

"ఇంత లేటా? ఇప్పటికే మూడు బస్సులు పోయాయి" అన్నాడతను.

"అన్నీ సర్దుకునేటప్పటికే లేటయింది బాబూ. రేపేమో ఇంటికి వెళ్లాలి! మరో పక్క ఇవ్వాళ ఆఖరిక్లాస్! ఇన్ని గందరగోళాల మధ్య నువ్వు ఎదురుచూస్తుంటావని ఎలాగో తీరిక చేసుకుని వచ్చేను" అందామె ఉస్సురమని నిట్టూరుస్తూ.

ఆ ఇద్దరూ నివాస్, నిత్య! ఇద్దరివీ హర్యానా, జింద్ జిల్లాలోని పక్క పక్క గ్రామాలే! ఎంసెట్ కోచింగ్‌కు ఢిల్లీకి వచ్చిన వారిద్దరూ హాస్టళ్ళలో వుంటూ ఓ స్టడీసర్కిల్‌లో చేరి చదువుకుంటున్నారు. స్టడీసర్కిల్‌లో పరిచయమైన వారిద్దరికీ తమ స్వస్థలాలు దగ్గర దగ్గరేనని తెలియడంతో మరింత సన్నిహితమయ్యారు.

క్రమంగా ఇద్దరి మనసులు కలిశాయి. పరిచయం కాస్తా ప్రణయంగా మారింది. ప్రణయాన్ని పరిణయంగా మార్చుకోవాలనేది వారి ఆశ! అప్పటికి వారి ప్రణయం వయసు రెండేళ్ళు!!

క్లాసులు అయిపోగానే- సినిమాకో, కాఫీ పబ్‌కో, పార్క్‌లకో వెళ్ళడం ఇద్దరికీ అలవాటైంది. దాదాపుగా పగలంతా కలిసే వుండేవారు. ఆ మహానగరంలో స్వేచ్ఛా విహంగాల్లా విహరించేవారిద్దరూ.

ఆ రోజు వారి ఆఖరి క్లాసు అయిపోయింది. బస్టాపులో కలవగానే ఇద్దరూ పక్కనే ఉన్న రెస్టారెంట్లో భోజనం చేశారు. తర్వాత సమీపంలోని పార్కులోకి నడిచారు. ఓ మారుమూల మరుగైనచోట కూర్చొని కబుర్లలో మునిగిపోయారు. నిత్య ఒళ్లో తలపెట్టుకుని తన భవిష్యత్ వ్యూహాల్ని వివరిస్తున్నాడు నివాస్. అతని తలలో చేతివేళ్ళు జొప్పించి, సున్నితంగా కదుపుతూ అతని కళ్ళలో కళ్ళుపెట్టి చూస్తోంది నిత్య.

"సర్లే నివాస్! నువ్వు మా ఊరెప్పుడు వస్తున్నావ్? "

"తొందర్లోనే వస్తా డియర్"

"అవును.. మీ చుట్టాలెవరో మా ఊళ్లో ఉన్నారన్నావ్.."

"అవును ఆ వంకతోనే మీ ఊరొచ్చి హఠాత్తుగా అమ్మాయిగార్ని దర్శించుకుంటాడీ దాసుడు శ్రీనివాసుడు.."

"యూ నాటీ" కోపం నటిస్తూ ముక్కు పిండింది నిత్య.

★ ★ ★

అనుకున్న ప్రకారం నిత్య వచ్చిన రెండు రోజుల తర్వాత నివాస్ ఆ ఊరికి వచ్చాడు. ఇద్దరూ బజార్లో ఓ చోట కలుసుకుని నిలబడి మాట్లాడుకోవడం అప్పటికే ఆ ఊరివాళ్లు నలుగురైదుగురు చూస్తూ వెళ్ళారు. తమ ఊరి అమ్మాయి మాట్లాడే అబ్బాయి ఎవరో వారికి ఓ పట్టాన అర్థంకాలేదు. ఆ కుర్రవాడ్ని ఆ ఊళ్ళో ఎప్పుడూ చూసిన గుర్తు కూడా లేదు వారికి.

ఇకనేం? వారిద్దరిదీ ప్రేమ వ్యవహారమన్న నిర్ధారణకు రానే వచ్చారు వాళ్లు. వెంటనే నిత్య తల్లిదండ్రులకు సమాచారం వెళ్లిపోయింది.

అంతే.. కొన్ని నిముషాల్లో ఊళ్లో చిచ్చు రగులుకుంది.. ఆ ప్రేమికుల పాలిట బడబాగ్ని అయ్యేందుకు! నిత్య అమ్మానాన్నలు ఆమెను ఇంటికి ఈడ్చుకెళ్ళి వారిద్దరి వివరాలు రాబట్టారు.

"చదువుకోవడానికి సిటీకి పంపితే ఇంత పరువు తక్కువ పనికి దిగజారుతావా?" అంటూ ఆమెను తిట్టికొట్టారు.

నివాస్‌కు ఈ పరిణామాలన్నీ మతిపోగొట్టాయి. కోటి ఆశలతో ఆ ఊరు వచ్చిన అతనికి తన ఆశలన్నీ కుప్పకూలిపోవడం తీవ్రమైన వేదనను మిగిల్చింది. ప్రాణప్రదమైన తన నిత్యకి ఏం జరుగుతుందో అని అతను భయపడిపోతున్నాడు.

దావానలంలా వ్యాపించిన ఈ వార్త పంచాయతీ పెద్దలకీ చేరింది. వెంటనే అందర్నీ రచ్చబండకు రమ్మనమని దండోరా వేయించారు. నివాస్‌ను పెడరెక్కలు విరిచికట్టి పంచాయితీలో పడేశారు.

గంటకూడా గడవకముందే గ్రామం మధ్యనున్న మర్రిచెట్టు కింద గ్రామస్థులంతా గుమిగుడి పోయారు. భయానకమైన నిశ్శబ్దం అక్కడంతా ఆవరించి ఉంది.

మర్రిచెట్టు కింద రచ్చబండపై ఇరవై మంది వరకూ ఊరి పెద్దలు కూర్చుని వున్నారు. వారందరూ యాభై నుండి ఎనభై యేళ్ళ మధ్య వయస్సువారు. గ్రామస్థులు వంద మందికి పైనే ఉన్నారు.

ముఖాలనిండా భయం నింపుకుని రచ్చబండకు ఎదురుగా నిలబడి ఉన్నారు నిత్య, నివాస్‌లు! అప్పటికే తిన్న దెబ్బలవల్ల వాళ్లిద్దరికీ ఒళ్లంతా వాతలు తేలి ఉన్నాయి. గాయాలనుంచి రక్తస్రావం!!

'వీరిద్దరి ప్రేమా చెల్లదు. కులాలు వేరు! అంతస్తులు వేరు!! ఈ నేపథ్యంలో వీరిద్దరూ ప్రేమికులు కావడం వీరు చేసిన పెద్దతప్పు...' వీళ్లు చేసింది ఎంత తప్పనేది పంచాయితీ పెద్దలు వివరిస్తున్నారు. పంచాయితీ పెద్దల మాటలకు సభికులందరూ అవునన్నట్లు తలలూపారు.

చివరికి వారిద్దరి తల్లిదండ్రులూ, బంధువులు అక్కడేవుండి కూడా పెదవి విప్పలేదు. పైగా ఘోరమైన పాపం చేశారన్నట్టు చూపులతోనే కాల్చేసేట్టు వారివంక కొరకొరా చూశారు.

పేగు తెంచుకు పుట్టిన బిడ్డలని వారి తల్లులు యోచించలేదు..

భుజాలపై మోసిన బంగారు కొండలని తండ్రులు భావించలేదు.

తమతోపాటు గోరుముద్దలు తిన్న తోబుట్టువులని అన్నదమ్ములు ఆలోచించలేదు..

అక్కడి వాతావరణమంతా గాంభీర్యాన్ని నింపుకుంది.

ఊరికట్టుబాట్లు ధిక్కరించి ప్రేమంటూ అమ్మాయి, అబ్బాయి తిరగడం, మహాపరాధం. అది క్షమించరాని నేరం కనుక నిత్యకు మరణ దండన విధిస్తూ తీర్పు చెప్పింది అక్కడి పెద్దరికం.

కెవ్వున కేకవేసి నివాస్ కుప్పకూలిపోయాడుగానీ ఇంకెవ్వరూ మాట్లాడలేదు. ఇదేం ఘోరం అనలేదు. ఇదేం తీర్పని

## మనరాష్ట్రంలోనూ...

పరువుహత్యలు మనరాష్ట్రంలోనూ ఇటీవల చోటుచేసుకోవడం విషాదం. ఉత్తర తెలంగాణా జిల్లాలకు చెందిన ఇద్దరు యువతీయువకులు ప్రేమించి పెళ్లాడారు. హైదరాబాద్‌లో కాపురం పెట్టారు. అమ్మాయి తరపువారికి ఆ పెళ్ళి ఇష్టం లేదు. ఫలితం ఆ భర్త బెంగళూరులో శవమై తేలడం! నిజామాబాద్ జిల్లాలోని ఓ గ్రామానికి చెందిన మరోజంట ప్రేమవివాహం చేసుకోవడంతో అమ్మాయి కుటుంబీకులు వారిద్దర్నీ కట్టిపడేసి, రాళ్ళతో కొట్టి చంపారు. పద్దెనిమిదేళ్ల కన్నకూతురు వేరేకులం యువకుణ్ణి ప్రేమించిందని, అన్నంలో విషం కలిపిపెట్టి చంపి, సమాధి చేశాడు ఓ కన్నతండ్రి. ఈ సంఘటన కడపజిల్లాలో చోటుచేసుకుంది. నల్గొండజిల్లా, గిరిజన తండాలోనూ ఇలాంటి సంఘటనే జరిగింది. కూతురు పరాయి యువకునితో ప్రేమలోపడి గర్భం దాల్చిందని తెలుసుకుని మండిపడ్డ తండ్రి కత్తితో కూతురి పొట్టలో పొడిచాడు.



ఎదురు తిరగలేదు..

గీటు దాటితే వేటు సహజమే కదా? అనే పద్ధతిలోనే అందరూ ఆలోచించారు.

అంతేనా? కుటుంబ పరువు పోగొట్టిన నేరానికి ప్రాణాలు పోయేవరకూ కూతుర్ని చిత్రవధ చేశారు నిత్య తల్లిదండ్రులు. అనంతరం శవాన్ని సమాధి చేసి పరువు నిలబెట్టుకున్నారు.

తర్వాత నివాస్ ఏమయ్యాడో ఎవరికీ తెలియలేదు.

అతని గురించి అతని తల్లిదండ్రులు పోలీసులకు ఫిర్యాదు కూడా చేశారు. ఎన్ని రోజులైనా నివాస్ ఎక్కడున్నదీ తెలియలేదు. అతని ఆత్మ నిత్య సమాధి చుట్టూ తిరుగుతోందేమో ఎవరికి తెల్సు? ..

## బిడ్డకన్నా పరువే ముఖ్యం

"సమీర్!"

"ఊఁ"

"రేపట్నుంచీ మనమిలా కలవలేమేమో? "

"ఏం.. ఎందుకనీ? "

"మనకి సెలవులిచ్చారు కదా..!"

"ఇస్తే ఏంటటా? "

"సెలవుల్లో నువ్వెక్కడికైనా వెళుతున్నావా? "

"లేదే? అయినా నా అందాల రాణీనొదిలి ఈ సమీర్ ఎక్కడికి వెళ్లగలడు? " అని చటుక్కున రాణీముఖాన్ని దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టాడతను.

రాణి ముఖంలో చిరాకు. కొద్దిగా అవతలికి జరిగి కూర్చుంది.

సమీర్ దగ్గరగా జరిగి మునివేళ్లతో ఆమె గడ్డం పైకెత్తి, కళ్ళలోకి మురిపెంగా చూస్తూ అన్నాడు.

"ఎందుకా చిరాకు మహారాణీ? ఈ భృత్యుడు చేసిన నేరమేమి? " అంటూ నాటకీయంగా అడిగాడు.

ఆమె ఏం మాట్లాడలేదు. ముఖంలో సీరియస్‌నెస్ కూడా తగ్గలేదు.

విషయం ఏదో ఆలోచించాల్సిందేనని అర్థమైంది సమీర్‌కు. అందుకే తను కూడా సమస్య ఏమిటో తెలుసుకోవడానికి సిద్ధమ య్యాడు.

"నన్నడుగుతున్నావుగానీ డార్లింగ్! అసలు నీసంగతేంటి? ఇంటిదగ్గర మీ బాబాయి వాళ్ళేమంటున్నారు? సెలవుల్లో నిన్ను మీ ఊరికి పంపుతారంటనా.. కొంపదీసి? "

"అదే సమీ.. నాకూ భయంగా ఉంది"

"అదేగనక జరిగితే చచ్చామే! నిన్ను చూడకుండా ఒక్కక్షణమైనా బతకలేనే!. ఇన్నాళ్లూ ఈ తోట ఉండబట్టి సరిపో యింది. ఎవరి కంటా పడకుండా మని ద్దరం కబుర్లాడుకోవడానికి వీలైంది" అంటూ ఆమె నడుం చుట్టూ చెయ్యివేసి మరింత దగ్గరకు తీసుకున్నాడు సమీర్.

"ఏంటిది? వదులు! నువ్వు మరీ స్పీడ వుతున్నావ్ సమీర్! మన సంగతి మా అన్నకు, బాబాయికీ తెలిసి పోతుందేమోని నేను భయపడి చస్తుంటే నీకిప్పుడు సరసా లు కావాల్సి వచ్చాయా? నిజానికి వాళ్లకి ఇప్పటికే తెలిసిపోయిందేమోనని కూడా నా అనుమానం" అతని చేతిని పక్కకు తోసేస్తూ అంది రాణి.

సరసనే అతనున్నా సమీర్‌కుమల్లే ఆనం దంగా ఉండలేకపోతోంది.

"ఏమవుతుంది? నీ చదువు మాన్పించి మీ ఊరుకి పంపించేస్తారు అంతేగా? దాని కెందుకంత భయం? "

"అంతేగాదు మనప్రేమ సంగతి తెలి సినా, మన తిరుగుళ్ళు చూసినా మనిద్దరినీ చంపి పాతరేస్తారు"

వణికిపోతూ చెప్తున్న ఆమె భుజంమీద చెయ్యేశాడతను ధైర్యం చెబుతున్నట్టు.

"వాళ్ళకు తెలియకుండా వుండాలంటే ఏంచేద్దాం రాణీ? "



"ఏమో.. నాకు మాత్రం ఏం తెల్సు? "

ఆమె కళ్లలో భయం సమీర్‌కు స్పష్టంగా కన్పించింది.

హర్యానాలోని ఫతేబాద్ జిల్లాలోని ఓ చిన్నపాటి పట్టణంలో నివసిస్తున్న ఈ జంటది కులమతాలకు అతీతమైన స్నేహ బంధం.

ఒకే కాలేజీలో కలిసి చదువుకుంటున్న వారిద్దరూ అచిరకాలంలోనే ఒకరికొకరు చేరువయ్యారు. మనసులు ఇచ్చిపుచ్చుకున్నారు.

అయితే వారి ప్రేమసౌరభం రాణి బంధుగణానికీ, ఆ ఊరు పెద్దలకీ తెలియడానికి అట్టేకాలం పట్టలేదు.

అంతా రాణి భయపడినట్టే అయింది.

ఒకరోజు సమీర్, రాణీలు ఆ ఊరి రైల్వే స్టేషన్‌లో నిలబడి మాట్లాడుకోవడం ఊరివాళ్ళు కొందరు చూశారు.

ఇకనేం? రాణి కుటుంబ సభ్యులకూ, పంచాయితీ పెద్దలకూ సమాచారం చేరిపోయింది. అంతే! అందరూ మూకుమ్మడిగా వచ్చి సమీర్, రాణీలను పట్టుకుని కొట్టుకుంటూ ఊర్లోకి ఈడ్చుకుపోయారు. సమీర్ తల్లిదండ్రులనూ పిలిపించి తిట్టారు.. తీవ్రంగా కొట్టారు. ఆ తరువాత పంచాయితీలో నిలబెట్టారు.

విచారణ మొదలైంది.

"కులమతాలు.. అంతస్తుల తేడాలు మరచి ప్రేమించుకోవడం తప్పు! ఇది మహాఘోరమైన నేరం. ఈ నేరానికి శిక్ష పడి తీరాల్సిందే! అదే మరణశిక్ష! వీళ్లని చిత్రహింసలు పెట్టి చంపాలి" అని తీర్పునిచ్చారు పంచాయతీ పెద్దలు.

"సై" అన్నారు రాణి కుటుంబ సభ్యులు.

వారికి కన్నబిడ్డ కంటే పరువే ముఖ్యం మరి!

"తమ్ముడు మనవాడైనా ధర్మం తప్పకూడదు.. వారికి శిక్షపడి తీరాల్సిందే" అని న్యాయ సూత్రీకరణలు చేస్తూ అపర ధర్మరాజుల్లా, అపర ధృతరాష్ట్రుల్లా మనసు తలుపులు మూసేసుకున్నారు వారు.

స్వయంగా రాణి కుటుంబ సభ్యులే ఆ ప్రేమికుల చిత్రహింసలలో పెను పాత్ర పోషించారు. అపురూపంగా పెంచుకున్న తమ బిడ్డ ఆర్తనాదాల్ని శ్రవణానందంగా విని తరించారు.

సొంత కూతురన్న కనీసమాత్రపు కనికరమైనా లేని ఆ కన్నవారు, తోబుట్టువన్న విచక్షణైనాలేని ఆ తోడబుట్టిన వారు స్వీయధర్మరక్షణ, కట్టుబాట్ల క్రమశిక్షణే ధ్యేయంగా వీరంగమేశారు.

మనుషులమన్న జ్ఞానాన్ని మరిచి రాక్షసగణాల్లా ప్రవర్తించారు.

వారి చిత్రహింసలు భరించలేక చివరికి ఆ ప్రేమికుల నిండుప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. అంతటితో అయిపోలేదు.. వారి కసి తీరలేదు.. ఆ రాతి గుండెల్లో గూడుకట్టుకున్న భూతప్రేతగణాలకు అప్పుడేనా సంతృప్తి?

ఊరి పెద్దలు, రాణీ కుటుంబీకులూ కలిసి ఆ ప్రేమికుల మృతదేహాలను ఈడ్చుకొచ్చి, వారు చదువుకుంటున్న విద్యాలయం ఆవరణలో వేలాడదీశారు.

ప్రేమ పేరుతో ఉచ్ఛనీచాలు మరచి కుటుంబ పరువు మర్యాదల్ని మంటగలిపే వారికి ఇదేశిక్ష అని నిస్సిగ్గుగా ప్రకటించారు. అలా నేలకొరిగిపోయిందో నవపారిజాతం!

## నాన్నా! నన్ను చంపొద్దు..

ఘజియాబాద్ జిల్లా లోని హైవే!

ఆ హైవేను ఆనుకుని వున్నాయి పచ్చని పంట పొలాలు!

ఆ పొలాల మధ్య పాములా మెలికలు తిరుగుతూ పోతున్న రోడ్డువెంటే వెళ్తే

జగ్రూలీ గ్రామం వస్తుంది.

హైస్కూలు, కాలేజీ చదువులకోసం జగ్రూలీ గ్రామానికి చెందిన పిల్లలు హైవే వరకూవచ్చి, అక్కడినుండి పదికిలోమీటర్ల దూరాన వున్న టౌన్‌కి వెళతారు.

జగ్రూలీలో అన్నిరకాల కులాలూ మతాలు ఉన్నాయి. ధనిక, పేద కుటుంబాలూ ఉన్నాయి. పెత్తనమంతా ధనిక కుటుంబాలది కాగా, ఆ కుటుంబాలకు అవసరమైన సేవలందిస్తూ, అణగిమణగి పడుండడమే పేదల పని!

గీతిక ఆ ఊళ్లో కలవారి అమ్మాయి. ధీరజ్ పేద కుటుంబానికి చెందినవాడు. కులాలూ ఒకటే అయినా అంతస్తుల తేడా! ఈ కారణంగా గీతిక కుటుంబీకులు, ధీరజ్ వాళ్ళను పురుగుల్ని చూసినట్టు హీనంగా చూస్తారు.

పెద్దల వైఖరి ఎలా వున్నా గీతిక-ధీరజ్‌ల నడుమ మంచి స్నేహం కొనసాగేది. ఇద్దరూ ఎంచక్కా టౌన్ కాలేజీకి వెళ్లి చదువుకుంటున్నారు.

రోజూ ఇద్దరూ కాలేజీకి ఎవరిదారిన వారు వెళ్తున్నట్లు ఊళ్లో వాళ్లకి కన్పించినా పొలిమేరలు దాటగానే కలిసి కబుర్లాడుకుంటూ పోయేవారు. కాలేజీలో కూడా కలిసిమెలిసి తిరిగేవారు. చదువుకునేవారు. అలా వారిమధ్య మొదలైన స్నేహం క్రమంగా బలపడి ప్రణయంగా మారింది. సహజంగానే ఒకరినొకరు వదిలి ఉండలేని స్థితికి చేరుకున్నారు.

ఆ రోజు హైవేలో బస్సు దిగిన ధీరజ్, గీతిక తమ ఊరుబాట పట్టారు. మధ్యలో పొలం గట్టుమీదకు చేరి మరుగుగా వున్న ఓచోట కూర్చుని మాటల్లోపడ్డారు.

"ధీరజ్! నేను కాలేజీకి వచ్చేది ఎందుకో తెల్సా? "

"చదువుకోడానికి"

"చదువా చట్టుబండలా? కేవలం నీకోసం నాయనా! అక్షరాలా నిన్ను చూడ్డం కోసమే! ఈ వంకన నిన్ను రోజూ కలుసుకోవచ్చని! నిజానికి నిన్ను చూడకుండా ఒక్క రోజు కూడా వుండలేక పోతున్నాను" అంది గీతిక మనసులో మాట దాచుకోకుండా.

ధీరజ్ విస్మయం చెందాడు.

నిజానికి అతనిదీ అదే పరిస్థితి.

ఆడపిల్లే అంత ధైర్యంగా తన మనసులో మాట చెప్పినప్పుడు అతను మాత్రం ఎలా మౌనంగా ఉండగలడు?

"గీతూ! నేనూ అంతే! నిన్ను చూడకుండా ఒక్క క్షణం కూడా ఉండలేకపోతున్నా. ఎలాగో కాలేజీ పుణ్యమా అని కలుసుకో గలుగుతున్నాం.." అన్నాడతను.

"ఎంతకాలం ఈ చాటుమాటు కలయికలు? మన గురించి మావాళ్ళతో చెప్పేద్దామనిపిస్తోంది"

దేశవ్యాప్తంగా జరుగుతున్న పరువుహత్యల పరంపరకు చలించిపోయిన సుప్రీంకోర్టు- పరువు హత్యలనేవి అత్యంత హేయమైనవి, వీటికి పాల్పడేవారికి ఉరిశిక్షే తగినశిక్షని వ్యాఖ్యానించింది.

గీతిక ధైర్యంగానే అంది. ఎంతైనా ఆమెలో చొరవ, ధైర్యం పాళ్లు ఎక్కువే.

ధీరజ్ వణికిపోయాడు.

అతను పేరుకు తగ్గవాడు కాడు మరి!

నిరుపేద తల్లిదండ్రులు, తోబుట్టువులు ఒక్కసారిగా గుర్తొచ్చారతనికి. తనవల్ల తనవాళ్లంతా ఎలాంటి చిక్కుల్లో పడతారోనని భయపడ్డాడతను.

"తొందరపడొద్దు గీతూ. మనప్రేమ గురించి మీ పెద్దవాళ్లకి ఏమాత్రం తెలిసినా మనల్నిలా వుండనివ్వరు. నిన్ను కాలేజీ మాన్పించేస్తారు. నన్ను చితక్కొడతారు. మావాళ్ళను పంచాయితీలో నిలబెట్టి, దోషుల్ని చేసినా చేస్తారు"

"మరేం చేద్దాం ధీరజ్? ఎక్కడికైనా పారిపోయి పెళ్లిచేసుకుందామా? "

"అది ఎలాగూ తప్పదు, కానీ ఇంకొంత కాలం ఆగడం మంచిదనిపిస్తోంది"

"ఎంతకాలం? " కోపంగా అంది గీతిక.

"నేను చెప్పేదాకా కామ్‌గా వుండు, చదువు పూర్తికావాలి, కొలువు సంపాదించాలి అందాకా ఏ మాత్రం తొందరపడకు!" అంటూ చెప్పి ఇక ఇళ్లకు వెళదామన్నట్టు లేచాడతను.

తప్పదన్నట్టుగా లేచిందా పారిజాతం!

పొలం గట్టుమీద అతను ఆమె భుజం మీద చెయ్యేసి దగ్గరగా హత్తుకుని నడిపిస్తుంటే, ఆమె అతని నడుం చుట్టూ చెయ్యేసి మురిపెంగా అతని ముఖంలోకి చూస్తూ ముందుకు అడుగులు వేస్తోంది.

ఆ క్షణంలో కొన్ని జతల కళ్ళు వారిద్దరినీ గమనించిన సంగతి ఆ చిలకాగోరింకలకు తెలియదు.

వారిద్దరూ తమ వ్యవహారం ఎవరికి తెలియకూడదనుకున్నారో వారికే విషయం మొత్తం తెలిసిపోయింది.

తల్లిదండ్రులూ ఇద్దరన్నలూ గీతికను విపరీతంగా కొట్టారు. చదువు మాన్పించి ఇంట్లో కూర్చోబెట్టారు.

అంతటితో వాళ్లు ఊరుకోలేదు.. ధీరజ్‌కి సీరియస్‌గా వార్నింగిచ్చారు.

కొన్నిరోజులు మౌనంగా వున్న ఆ ప్రేమ జంట ఓ రోజు ధైర్యం చేసి ఊరువిడిచి పారిపోవడానికి ప్రయత్నించింది. కానీ దురదృష్టం వెంటాడుతుంటే అది వారికెలా సాధ్యం అవుతుంది?

పొలిమేరలు దాటకుండానే ఆమె అన్నలు పసిగట్టారు. ఇద్దర్నీ పట్టుకొచ్చి చావ చితక్కొట్టారు.

గీతిక రోషంతో ఏదో మాట్లాడేసరికి ఆమెను గదిలో పెట్టి తాళం వేశారు.




ఆదేరోజు రాత్రి అందరూ కలిసి చర్చించుకున్నారు.

గీతిక వాలకంచూస్తే ఆమె ఏ క్షణాన్నయినా ధీరజ్‌తో ఎక్కడికైనా పారిపోవచ్చు. అదే జరిగితే కుటుంబం పరువు ఏం కావాలి? ముఖ్యంగా ఊరి పంచాయితీ పెద్దల ముందు ఎలా తలెత్తుకుని తిరుగుతాం? వాళ్లు ఇలాంటివి అస్సలు సహించకపోగా తమ కుటుంబాన్నీ తప్పు పడతారు. ఇప్పుడెలాగని బాగా మథన పడ్డారు. చిట్టచివరకు వారంతా కలిసి ఒక నిర్ణయానికి వచ్చారు.

అదేమంటే గీతికను హత్య చేయడమే!

కుటుంబం పరువు ముందు కూతురు ఓ లెక్కేకాదు. పరువు తీసే కూతురు బతికుండడం అనవసరం. పరువుకోసం



లుకుంది.

"నాన్నా నన్ను చంపొద్దు.. అన్నా నన్నొదిలేయండి.. మీరు చెప్పినట్టే వింటా.. అవసరమైతే ఈ ఊరొదిలి మీకు దూరంగా వెళ్ళిపోతా. మళ్ళీ తిరిగిరాను, మీ పరువుకు భంగం కలిగించను నాన్నా.. నన్నొదిలేయండి ప్లీజ్" అంటూ ఆమె ఎంత మొత్తుకున్నా ఆ బండరాళ్లు కరగలేదు. తాము చేపట్టిన పని ఆపలేదు.

''నా... న్నా.. వద్దు.. చం.. పొ...ద్దు.." అంటూనే తల వాల్చేసింది గీతిక.

ఆమె శవాన్ని అక్కడికక్కడే తగలబెట్టేసి తిరుగుముఖం పట్టారు ధర్మకంకణబద్ధులైన ఆ కసాయి తండ్రీకొడుకులూ! వెన్నుతడుతూ అనుసరించారు బంధువులు!!

కూతుర్ని చంపితే పదిమంది మెప్పు పొందుతాం. ఊరిపెద్దలు కులపెద్దలు శభాష్ అంటారు, అనుకున్నారు.

ఇకనేం? కూతురి హత్యకు ముహూర్తం పెట్టుకున్నారు.

ఆ రోజు గీతిక కాళ్లూచేతులు కట్టిపడేసి సొంత కారులో ఊరిబయట పొలాల్లోకి తీసుకుపోయారు.

అన్నలు ఆమెను కదలకుండా పట్టుకుంటే తండ్రి బలవంతంగా ఆమెతో విషం తాగించాడు. హాలాహలం లాంటి ఆ విషాన్ని తాగలేక ఆమె గింజుకుంది. హృదయ విదారకంగా రోదించింది. ప్రాణభిక్షపెట్టమని తం డ్రిని, అన్నల్ని బతిమా

ఆ తర్వాత ధీరజ్ ఎవరికీ కన్పించలేదు. అతన్నీ ఆ ధర్మపరిరక్షకులే పొట్టన పెట్టుకుని ఉంటారని అనుకున్నారు ఊళ్లోని వారంతా!!

కొడుకు ప్రస్తావన తెస్తే అతని తల్లిదండ్రులు మాత్రం భయం భయంగా చూస్తూ నిశ్శబ్దంగా కన్నీరు కార్చేవారే తప్ప, ఒక్కమాట మాట్లాడేవారు కాదు. ©

# హే హే... అమెరికా 3

## నూటికి 90 మందికి తుపాకులు!

రామాయణంలో మనకో కథ ఉంది. ఘోర తపస్సు చేసే ఓ రుషి తపస్సుని భగ్నం చేయడానికి ఇంద్రుడు ఆయన దగ్గరకి మారువేషంలో వెళ్ళి ఓ ధనుస్సుని ఇచ్చి, తను తీర్థయాత్రలు చేసి వచ్చేదాకా దాచి ఉంచమని కోరతాడు. ఆ రుషి అందుకు అమాయకంగా ఒప్పుకుంటాడు. ఆ తర్వాత ఋషి మనసులో ఆ ధనుస్సుని ఓసారి ఉపయోగించాలనే కోరిక కలుగుతుంది. దాంతో ఎవర్నో చంపి తపస్సు ద్వారా సంపాదించిందంతా నాశనం చేసుకుంటాడు.

రాముడు కొందరు రాక్షసులని చంపాక అరణ్యకాండలో సీత ఆ కథని రాముడికి చెప్పి, దగ్గర ఆయుధం ఉండటంవల్ల దాన్ని ఉపయోగించాలనే బలహీనత కలుగుతుందని హెచ్చరిస్తుంది.

నాటక శాస్త్రంలో కూడా ఓ నానుడి ఉంది. రంగస్థలంమీద తుపాకి గోడకి వేలాడుతుంటే, అది నాటకం ముగిసేలోగా ఒక్కసారైనా తప్పకుండా పేలాలి. అమెరికాకి గల దుష్ట సంస్కృతుల్లో ఒకటి స్వేచ్ఛగా ప్రజలకి తుపాకులు అమ్మకానికి అందుబాటులో ఉండటం.

'స్వేచ్ఛకోరే ప్రజలు తప్పనిసరిగా ఆయుధాలను దగ్గర ఉంచుకోవాలి' అని అమెరికా మొదటి అధ్యక్షుడు జార్జి వాషింగ్టన్ చెప్పాడు. అమెరికా దుష్ట సంస్కృతికి ఇలా అనేకమంది పెద్దలే కాక అమెరికా రాజ్యాంగం కూడా రక్షణ ఇస్తూండటంతో అమెరికాలో మనం పెట్రోల్‌ని కొన్నంత తేలిగ్గా తుపాకులని అమెరికన్ ప్రజలు కొని తమ దగ్గర ఉంచుకుంటున్నారు.

మార్చి 2011కి అమెరికా జనాభా 31 కోట్ల, 11 లక్షల 22 వేలమంది. వారందరి దగ్గరా కలిపి 22 కోట్ల 30 లక్షల తుపాకులు ఉన్నాయి. అంటే ప్రతి కుటుంబానికి ఓ తుపాకి ఉందన్నమాట. అమెరికాలో నేరస్థులు పెట్రోల్ బంకులకి, బ్యాంకులకి తుపాకులతో వెళ్ళి దోచుకోవడం సర్వసాధారణం. నిత్యం అలాంటి నేరం జరగకుండా అమెరికాలో సూర్యోదయ, సూర్యాస్తమయాలు జరగవు.

ఓ స్టాటిస్టిక్స్ ప్రకారం 1988-1997 మధ్య అమెరికాలో 2 లక్షల 33 వేల రెండువందల యాభై ఒక్కమంది హత్య చేయబడితే వారిలో 68 శాతం మంది తుపాకులతో కాల్చి చంపబడ్డారు. మనిషికి కంట్రోల్ చేసుకోలేని ఆవేశంతో కూడిన కోపం వస్తే కర్రతోనో, చేత్తోనో కొట్టే బదులు తుపాకిని ఉపయోగించే అవకాశం ఉంది. తుపాకిని అభివృద్ధి చేసింది కోల్ట్ అనే అమెరికా దేశస్థుడే. ఇప్పటికీ కోల్ట్ పేరుతో పిస్తోళ్ళు తయారవుతున్నాయి. గత రెండువందల యాభైఏళ్లుగా అమెరికా జీవనస్రవంతిలో తుపాకి ఓ భాగం అయిపోయింది. అమెరికన్స్ తుపాకీని అమితంగా ప్రేమిస్తారు. ఏటా అమెరికాలో ఐదువేల గన్ షోలు జరుగుతున్నాయంటే, వారికి తుపాకుల మీద ఉన్న ప్రేమాభిమానాలను ఇట్టే అర్థం చేసుకోవచ్చు.

ఎవరి దగ్గరా అసలు తుపాకి అన్నదే లేని దేశంలో స్వేచ్ఛకి, రక్షణకి తుపాకి అవసరం ఏముంటుంది? పదిమంది దగ్గరుంటే మనకీ

దాని అవసరం ఉందని అనిపిస్తుంది. అందుకే అమెరికాలో తుపాకుల మీద జరిగే సర్వేలలో తుపాకులని నిషేధించవద్దు అన్న అంశానికే అత్యధికులు ఓటేస్తున్నారు. 1959లో జరిగిన ఆ సర్వేలో నలభై శాతం మంది తుపాకులు కొనే హక్కు కోసం ఓటేశారు. తిరిగి 2008లో 72 శాతం మంది తుపాకులకు అనుకూలంగా ఓటేశారు. రిపబ్లికన్లు 'గన్‌పాలసీ'కి మద్దతు ఇస్తారు. ప్రతి ముగ్గురు రిపబ్లికన్ల నివాసాల్లో కనీసం రెండు ఇళ్లల్లో తుపాకులు ఉండటమే ఇందుకు కారణం. డెమోక్రాట్స్ గన్ కంట్రోల్‌కి సంపూర్ణ మద్దతుదారులు.

డిస్ట్రిక్ట్ ఆఫ్ కొలంబియాలో తుపాకీతో పాల్పడే నేరాల సంఖ్య అత్యధికమని ఓ సర్వేలో తేలింది. తర్వాతి స్థానం అలాస్కాది. మూడో స్థానం లూజియనాది. హవాయ్ అతి కింది స్థానంలో ఉండగా ఆఖరి స్థానాలు మసచుసెట్స్, కనెక్టికట్ రాష్ట్రాలవి.



అమెరికన్లు అంతా జీవితంలో ఒక్కసారైనా 'మగ్గింగ్' అనే నేరానికి గురవుతారు. మగ్గింగ్ అంటే నిర్మానుష్యంగా ఉన్న రోడ్డుమీద తుపాకిని చూపించి నేరస్థుడు పాదాచారులని దోచుకోవడం. వారికి లెక్క కూడా ఉంది. ఇరవై డాలర్ల లోపు నగదు దొరికితే నేరస్థుడు బాధితుణ్ని చంపడు. అంతకుమించి ఎక్కువ ఉంటే తుపాకి పేల్చి చంపేస్తాడు. కారణం, ఇరవై డాలర్ల లోపయితే చిన్న మొత్తంగా భావించి పట్టించుకోడని, అంతకుమించితే పోలీసులకి తనమీద రిపోర్ట్ ఇస్తాడనే భయంతో. అతనొక్కడే తన నేరానికి సాక్షి కాబట్టి ఆ సాక్షిని చంపేస్తాడు. పెట్రోల్ బంకుల్లో పనిచేసే భారతీయ విద్యార్థులు ఇలాంటి మగ్గర్స్ చేతుల్లో మరణించి, వారి మృతదేహాలు మనకి చేరడం పేపర్లలో చదువుతుంటాం. ఈ మగ్గింగ్ విద్య ఒక్క అమెరికాకే పరిమితం. దుకాణాల్లో తుపాకితో భయపెట్టి దోచుకువెళ్ళేవాళ్లు అందుకు అడ్డు చెప్పేవారిని తప్పక చంపేస్తారు. ఇది తెలీని పార్ట్‌టైం పని చేసే మన విద్యార్థులు అక్కడ బలవుతుంటారు. ఒక్కోసారి మూడ్‌ని బట్టి అడ్డగించకపోయినా చంపేస్తుంటారు.

1865లో అబ్రహం లింకన్, ఆ తర్వాత జేమ్స్ గార్‌ఫీల్డ్, విలియం మేక్‌కిన్లే, జాన్‌ఎఫ్‌కెన్నడీలు- వీరంతా అమెరికా అధ్యక్షులే- తుపాకులతో చంపబడ్డారు. రాబర్ట్ ఇ కెన్నడి, మార్టిన్ లూథర్‌కింగ్ జూనియర్‌లు అలా చంపబడ్డ మరో ఇద్దరు ప్రముఖులు.

ఏప్రిల్ 1999లో కోలరేడ్ రాష్ట్రంలోని కొలంబైన్ హైస్కూలుకి ఎరిక్ హేరిస్, డైలాన్ కెబోర్డ్ లనే ఇద్దరు విద్యార్థులు 12 మంది విద్యార్థులని, ఓ టీచర్‌ని తుపాకులతో చంపి 21 మందిని గాయపరిచి ఆత్మహత్యలు చేసుకున్నారు. వాళ్ల ఏప్రిల్ 2007లో జరిగిన హర్జనియోటెక్ మసేకర్‌గా పిలవబడే ఇలాంటి హత్యాకాండలో 32 మంది విద్యార్థులని సెయుంగ్‌హ్యూనో అనే విద్యార్థి కాల్చిచంపాడు. షికాగోలోని ఓ స్కూల్‌కి ఓ విద్యార్థి తన తండ్రి తుపాకిని స్కూలుబ్యాగ్‌లో వేసుకువచ్చాక, గన్-ఫ్రీ-జోన్ స్కూల్స్ కోసం అక్కడ కృషి జరుగుతోంది. అమెరికాలో ఆత్మహత్యలకి కూడా తుపాకులని ఉపయోగిస్తున్నారు. 2004లో 16వేల తొమ్మిదివందల ఏడు ఆత్మహత్యలు తుపాకులతో జరిగాయి. అవి అందుబాటులో ఉండకపోతే కొందరు ఆత్మహత్య గురించి ఆలోచించడం మానేసేవారేమో.

తమాషా ఏమిటంటే అమెరికాలో ఆల్కహాల్, టొబాకోలని కంట్రోల్ చేసే సంస్థే తుపాకులని కూడా కంట్రోల్ చేస్తుంది. అమెరికాలో తుపాకులకి కేటాయించిన పత్రికలు 78 వెలువడుతున్నాయి. అమెరికాలో తుపాకుల గొట్టాన్ని మనకి గురిపెడితే అతను పేల్చడానికి సిద్ధంగా ఉన్నాడని అర్థం. లేకపోతే మరీ ఆ పని చేయరు.

– డి.పద్మజ

# పిల్లల త్యాగం




ట్యాంక్‌బండ్‌లో తేలుతున్న శవాన్ని వెలికి తీశారు లేక్ పోలీసులు! ఓ మహిళ మృతదేహమది!

'వయసు నలభై నుంచి నలభై అయిదు మధ్య- తెల్లటి దేహం, మెడపైన గోధుమ రంగు పుట్టుమచ్చ.. ఒంటిపై నీలిరంగు చీర, అదేరంగు బ్లౌజు..' పోలీసులు తమ ప్రాథమిక రిపోర్టులో రాసుకున్నారు.

★ ★ ★

'సైరా.. నేను డ్యూటీకి వెళ్తున్నా! ఇల్లు, పిల్లలు జాగ్రత్త' అంటూ బయటకు నడిచాడు కానిస్టేబుల్ కనకరాజు.

'అలాగే రాజూ! రాత్రి నువ్వొచ్చేసరికి నీకిష్టమైన రొయ్యల కూర రెడీచేస్తానేం?' అంటూ ప్రేమగా భర్తకు వీడ్కోలు పలికింది ఇరవయ్యేళ్ల సైరాబాను.

కనకరాజు- సైరాబానులది ప్రేమపెళ్లి! వాళ్ల ప్రేమకు ప్రతిరూపాలే చిన్నారి సుభానీ, సునీతలు! సైరామీది ప్రేమతో బాబుకు సుభానీ అని పేరు పెట్టాడు కనకరాజు. భర్త కనకరాజు మీది ప్రేమతో పాపకు సునీత అని పేరుపెట్టింది సైరా.

పెద్దలను ఎదిరించి చేసుకున్న పెళ్లికావడంతో ఇరుపక్షాలూ వారివైపు కన్నెత్తి చూడలేదు. అయినా ఆ జంట అధైర్యపడలేదు. 'మేమిద్దరం.. మాకిద్దరు' అనుకుంటూ ఉన్నంతలో ఆనందంగా ఉన్నారు. వారి దృష్టంతా బిడ్డల భవిష్యత్తుమీదే!

'మన టౌన్‌లోని డొక్కుస్కూళ్లలో చదివితే మనబిడ్డల పరిస్థితీ మనలాగే తయారవుతుంది. ఎలాగైనా హైదరాబాద్ బదిలీ చేయించుకో. మంచి స్కూళ్లుంటాయి. మంచిచదువులు దొరుకుతాయి. ఇంటర్ చదివాను కదా? కావాలంటే ఏదో పనిచేసి నేనూ నాలుగురాళ్లు సంపాదిస్తా. వాళ్లు బాగుపడడం కన్నా మనకి వేరే ఆశలేం ఉన్నాయి' అంటూ పోరు మొదలెట్టింది సైరాబాను కొన్నాళ్ల తర్వాత.

కనకరాజుకు ఆమె చెప్పింది రైటే అన్పించింది. అసలే అంతంత మాత్రం ఆదాయం.. సిటీకి వెళ్తే తమ పరిస్థితి మరికొంత మెరుగు పడుతుందని తనూ ఆశపడ్డాడు.

ఎలాగైతేనేం? కనకరాజు కుటుంబం హైదరాబాద్ చేరుకుంది.

కానీ ఇక్కడి పరిస్థితులు వారిని బేజారెత్తించాయి. వేలల్లో అద్దెలు.. వేలల్లో స్కూలు ఫీజులు! ఎటు వెళ్లాలన్నా తడిసి మోపెడయ్యే సిటీబస్ ఛార్జీలు.. ఆదాయానికి నాలుగింతలు ఖర్చులతో అల్లాడిపోయారు సైరా కనకరాజులు.

ముందు చెప్పినట్టే సైరాకూడా కుటుంబాన్ని ఆదుకోవడానికి శక్తివంచన లేకుండా ఉద్యోగ ప్రయత్నాలు మొదలెట్టింది.

మేకవన్నెపులులూ, పయోముఖ విషకుంభాలకు లోటులేని మన నవనాగరిక సమాజం లోగుట్టు పాపం ఆ పల్లెటూరి పడుచుకేం తెలుస్తుంది?

మగాళ్ల ఆకలి చూపుల్ని, అసహ్యాపు సైగల్ని, ప్రవర్తనల్ని అర్థంచేసుకోలేని సైరా ఉద్యోగమిస్తారన్న వారందరి చుట్టూ ఆశగా తిరిగేది. ఎక్కే గడపా దిగే గడపే తప్ప ఆమెకు ఉద్యోగం దొరకలేదు. కొంతలో కొంత మగాళ్లరంగులు మాత్రం

అర్థమయ్యాయి.

గోరుచుట్టుపై రోకటిపోటులా హఠాత్తుగా కనకరాజుకు కరీంనగర్ బదిలీ అయింది. సైరా చిగురుటాకులా వణికిపోయింది. అప్పటికే అప్పుసప్పులు చేసి పిల్లల్ని మంచి కాన్వెంట్‌లోనే చేర్పించారు. మరి మళ్లీబదిలీ అంటే ఇప్పుడెలా?

'పిల్లల్ని ఇక్కడ పెట్టుకుని చదువులు పాడవకుండా ఎలాగోలా బండి లాక్కొస్తా. నువ్వు కరీంనగర్ వెళ్లి వారానికోమారు ఇక్కడికొచ్చెయ్ ఇదితప్ప మనకు వేరేమార్గమేం కనబడ్డంలేదు' అంది సైరా. కనకరాజుకూ అదే కరెక్టనిపించింది. ఆమె చెప్పినట్టే చేశాడు.

★ ★ ★

'మేడం రెండునెలల స్కూలుఫీజు బకాయి ఉంది.. ఇంకా వాయిదాలు వేయడం కుదరదు.. రెండు రోజుల్లో మొత్తం కట్టారా సరి లేదంటే నేనింకేం చేయలేను' కాన్వెంట్ కరస్పాండెంట్ సైరా బానును కఠినంగా హెచ్చరించాడు.

'సర్ ఇంకా మావారి సాలరీ రాలేదు.. రాగానే వచ్చి..' అభ్యర్థించింది సైరా.

'ప్లీజ్ నేనింకేం వినదల్చుకోలేదు. దయచేసి నన్ను డిస్టర్బ్ చేయొద్దు.' అంటూ ఆయన తన పనిలో మునిగిపోయాడు.

ఏడాదంతా చదివి ఇప్పుడు పిల్లల్ని రోడ్డున వేస్తే వాళ్ల భవిష్యత్తేం కావాలి? కనకరాజు నుంచి వచ్చినా అది కేవలం పదివేలు! పొద్దున ఇంటిఓనర్ అద్దె విషయంలో ఇప్పటికే లేటయిందని తిట్టాడు. కిరాణాషాపువాడు అప్పు ఇవ్వడం కిందటి నెల నుంచే బంద్ చేశాడు. పైగా బాకీ ఎనిమిదివేలు అణాపైసల్తో ఎల్లుండికల్లా ఇవ్వకపోతే ఇంటికొచ్చి సామాను పట్టుకుపోతానన్నాడు. ఇవిగాక ఇంకా చిల్లరమల్లర అప్పులన్నీ లెక్కేస్తే దాదాపు యాభైవేలు కావాలి. ఇప్పుడెలా? ఆలోచనల్తో సైరాబాను బుర్రపగిలిపోతోంది. ఎలాగోలా స్కూలు నుంచి ఇంటికి చేరుకుంది.

'మమ్మీ క్లాసులో నాకు ఎ++ వచ్చిందమ్మా.. నేను చాలా గ్రేట్ కదూ?' అంటూ తల్లిని వాటేసుకుని గంతులు వేశాడు ఐదేళ్ల సుభానీ.

'నాకూ ఎగ్రేడ్ వచ్చింది మమ్మీ నేనూ గ్రేటే' ముద్దుముద్దుగా అంటూ నాలుగేళ్ల సునీత కుర్చీఎక్కి మరీ తల్లి భుజంపైకి ఎగబాకుతోంది.

ఆ రాత్రి తనకంతాన్ని కౌగిలించుకుని ఎంతో భరోసాగా పడుకుని నిద్రపోతున్న బిడ్డలిద్దరినీ చూసుకుని మురిసిపోయింది సైరా. పాపం పుణ్యం ప్రపంచ మార్గం తెలీని ఈ చిన్నారుల్ని ఎన్ని కష్టాలుపడైనా తను ఒడ్డున పడేయాలి.. నిజానికి తన కడుపున పుట్టడంవల్లేకదా వీళ్ల భవిష్యత్తు అంధకారంలోకి జారిపోతోంది.. ఏదేమైనా సరే తనుబతికుండగా అలా జరగడానికి వీల్లేదు అనుకుంది దృఢంగా..

అంతలో జార్జి గుర్తొచ్చాడు. అతనికి ఫోన్‌చేస్తే?

'ఛఛ ఆ ఛండాలుడికి ఫోన్‌చేస్తావా? వాడి చూపులు, మాటలే ఒంటిమీద గొంగళిపురుగులు పాకిస్తాయి.. అలాంటి వాడికి ఫోనా? వద్దేవద్దు' ఆమెలోని ఆడమనసు తీవ్రంగా తిరగబడింది.

'బంగారు భవిష్యత్తంటూ పిల్లల్ని ఈ జనారణ్యానికి తెచ్చావు. ఇప్పుడు మధ్యలో చేతులెత్తేస్తే వీళ్లగతేంటి? బిడ్డలేమైనా పర్లేదు అనుకుంటే ఫోన్ చెయ్యనే చెయ్యొద్దు..' ఆమెలోని తల్లి మనసు తిట్టిపోసింది!

ఏమైతే అదయిందని మర్నాడు పబ్లిక్ ఫోన్ నుంచి జార్జికి ఫోన్‌చేసింది సైరా బాను. పనిలో పనిగా అశుతోష్ ముఖర్జీతోనూ మాట్లాడింది..

★ ★ ★

'మమ్మీ.. ఇంటర్ పరీక్షఫీజు కట్టేందుకు ఎల్లుండే లాస్ట్‌డేట్! ఆలోగా కట్టకపోతే

ఇక కాలేజీకే వెళక్కర్లేదట' ముఖం అదోలా పెట్టుకుని అడిగాడు సుభానీ.

'మమ్మీ అర్జంటుగా రెండు కొత్త డ్రెస్సులు కావాలి! వేసినవే వేసుకుంటూ కాలేజీకి వెళ్తుంటే చిన్నతనంగా ఉంటోంది. అందరూ నవ్వుతున్నారు. ప్లీజ్ మమ్మీ' బాధగా అడుగుతోంది పదోతరగతికి వచ్చిన సునీత.

నిస్సహాయంగా చూసింది సైరా. తర్వాత 'సర్లే నాన్నా ఇద్దరూ టెన్షన్ పడకండి. ఏదో రకంగా సర్దుబాటు చేద్దాం' అంది భరోసా ఇచ్చిందా మాతృమూర్తి.

పిల్లలిద్దరూ అప్పటికి మౌనంగా బయటికి వెళ్లిపోయారు.

★ ★ ★

మరికొన్నేళ్లు గడిచాయి. పిల్లలు పెద్దవాళ్లయ్యారు. పెద్దచదువులు పూర్తిచేశారు. తెలివైనవాళ్లు కావడంతో మంచి ఉద్యోగాలే దొరికాయి.

జీవితాంతం కష్టపడ్డ కనకరాజు పాపం కడుపులో అల్సర్‌తో పదేళ్లక్రితమే కాలం చేశాడు. అయినా సైరాబాను అధైర్యపడలేదు. పిల్లలమీదే ప్రాణాలుపెట్టుకుని బతికింది. వాళ్ల పెళ్లిళ్లయితే ఇక తన బాధ్యత తీరిపోయినట్టే అనుకుంటోందామె.

'మమ్మీ ఇవ్వాళ మనింటికి చాలా కావాల్సినవాళ్లు వస్తున్నారు..' హడావిడిగా హాల్లో ప్రవేశించాడు సుభానీ.

'ఎవరు నాన్నా వచ్చేది? ఏమైనా స్పెషల్స్ చేయమంటావా?' తన మెడలోని డాలర్ గొలుసును ప్రేమగా వేళ్లతో స్పృశించుకుంటూ అడిగింది సైరా. తనబిడ్డలిద్దరి ఫొటోలు ఉండేలా దాన్ని ఎంతో ఇష్టపడి చేయించుకుందామె.

'అంత శ్రమ ఏమీ అక్కర్లేదు.. నువ్వు వాళ్ల కంటపడకుండా ఉంటే అదేపదివేలు!' తల్లిని దాటుకుని చెల్లిగదిలోకి వెళ్లబోతూ అన్నాడు సుభానీ.

ఉలిక్కిపడి కొడుకువైపే చూసిందామె. 'నీ గురించి మా ఫ్రెండ్స్ సర్కిల్‌లోనే చెడ్డగా చెప్పుకుంటుంటే తలకొట్టేసినట్టవుతోంది నాకు. నీ కడుపున ఎందుకు పుట్టానా అని రోజూ ఏడుస్తున్నాను..' తల్లిముఖం చూడడమే పాపమన్నట్టు ఎటో చూస్తూ గదిలోకి వెళ్లిపోయాడతను.

'నా ఫియాన్సీ మేరీ, ఆమెతండ్రి కల్నల్ జార్జిని ఇవ్వాళ మనింటికి డిన్నర్‌కు ఆహ్వానించాను! కాస్త కావాల్సిన ఏర్పాట్లు చేస్తావా సునీతా? ప్లీజ్' గదిలో తనకొడుకు చెల్లితో మాట్లాడడం హాల్లో ఉన్న సైరాబానుకు వినిపిస్తునే ఉంది.

'తప్పకుండా చేస్తాన్రా.. నాకు నువ్వు.. నీకు నేను తప్ప ఈ కొంపలో మనకెవరున్నారు? ఆవిడగారి గతచరిత్రవల్లకాదూ ఆర్నెల్లక్రితం అశీష్‌తో నాపెళ్లి ఆగిపోయింది.. నీకూ అలా కాకుండా చూసుకో. ముందు ఆవిడగార్ని సాయంత్రం ఏ సినిమాకో.. పార్కుకో పొమ్మను. రాత్రి పొద్దుపోయాక రమ్మను' అన్నగారికి హితబోధచేసింది సునీత.

'థ్యాంక్స్ మంచి సజెషనిచ్చావ్? ఇప్పుడే చేతిలో ఓ ఐదొందలు పెట్టి పంపిస్తా' అంటూ హాల్లోకి వచ్చిన సుభానీకి అక్కడ తల్లి కన్పించలేదు. డ్రాయింగ్‌రూమ్‌లో, పూజగదిలో, టెర్రస్‌మీద, చివరికి టాయిలెట్‌లోనూ కన్పించలేదు.

హాల్లోని తండ్రి ఫొటోకు మాత్రం ఆమె వేసుకునే డాలర్‌గొలుసు వ్రేలాడుతూ కన్పించింది.

తల్లేమైందని మొదట ఆశ్చర్యపడ్డా, తర్వాత హాయిగా ఊపిరి పీల్చుకున్నాడా కొడుకు! వెళ్లి చెల్లితో ఆ విషయం చెబితే 'పీడాబాయె' అంది చాలా చాలా తేలిగ్గా.

ఆమె జీవితంలోకి ఇటీవలే మరో కొత్త వ్యక్తి వచ్చాడు. అతనితో ఆ మూడుముళ్లూ పడాలంటే ఈ మాత్రం త్యాగం తప్పదు మరి!

–చంద్రప్రతాప్

# మానవతకు ఊపిరులూదిన జిగిరి



పెద్దింటి అశోక్‌కుమార్

తెలంగాణ పల్లె బతుకులకు అద్దం పట్టిన రచయిత పెద్దింటి అశోక్ కుమార్. కరీంనగర్ ప్రాంతంలో బడి పిల్లలకు లెక్కలుచెప్పే ఈ మాస్టారు సామాన్యుల జీవితాల్లోని కూడికలూ తీసివేతల్ని లెక్కించడంలోనూ దిట్ట. పాత్రోచిత భాషకు పట్టం కట్టడంలోనూ, సామెతలు, పలుకుబడులు చేరుస్తూ మనసు లోతుల్ని తాకే ప్రయత్నం చేయడంలోనూ వీరికి వీరే సాటి. ఇప్పటికి ఎనబై పైగా కథలు, నాలుగు కథా సంకలనాలు, నాలుగు నవలలు వెలువరించి ప్రాంతాలకు అతీతంగా పాఠక మన్ననలు చూరగొన్న అశోక్‌కుమార్ అనేక పురస్కారాలు కూడా పొందారు.

అలాంటి 'పెద్దింటి'కి పెద్దపేరు తెచ్చిన నవల 'జిగిరి'! 'ఆటా' నవలల పోటీలో బహుమతి పొందిన ఈ నవల తరువాత ఎన్నో భాషల్లోకి అనువాదమైంది.

తన రచనలన్నిటిలోనూ 'జిగిరి' అంటేనే ఎక్కువ మక్కువ అంటున్న అశోక్‌కుమార్ 'జిగిరి' కథ వెనక కథ ఇలా చెప్పుకొచ్చారు..

ఇప్పటి పంగతి కాదిది. ఎప్పుడో ఏడేళ్ల కిందటిది. అప్పట్లో కరీంనగర్ జిల్లా ఎల్లారెడ్డిపేట మండలం బండ లింగంపల్లిలో టీచరుద్యోగం చేస్తున్నా. మా ఇంటి నుంచి బడికి పది కిలోమీటర్లు. రోజూ ఇంటినుంచే పోయి వస్తుండేవాడిని. ఆ బడిదగ్గరి మైదానం చాలా పెద్దది. ఏ పక్షి ఎక్కడి నుంచి వచ్చినా అక్కడ వాలాల్సిందే. ఎందుకంటే అలాంటి ప్రాణులకి నీడ, నీళ్లు దొరికేదక్కడే మరి!.

ఆ మైదానంలోకే ఎలుగుబంటిని ఆడించే కుటుంబం వచ్చింది. వాళ్లు అక్కడ రెండు రోజులే ఉన్నారు. అంతకు ముందు ఎప్పుడు ఎవరొచ్చినా కనీసం వారంరోజులు ఉండేవారు. 'వీళ్లూ ఉంటారులే, తీరిగ్గా మాట్లాడదాం' అనుకున్నా. ఎందుకంటే గ్రౌండ్‌లోకి ఎవరొచ్చినా, మేం బడి తెరవకముందే ఊళ్లోకి బయలుదేరేవారు. మా బడి మూశాక కానీ, తిరిగి




జిగిరి (హిందీ)ని ప్రచురించిన సాహిత్య పత్రిక ముఖచిత్రం

వచ్చేవారు కాదు. అందుకే వాళ్లతో మాట్లా డాలనుకునుకున్నా వీలుపడలేదు.

మూడోనాడు వచ్చి చూస్తే, మైదానంలో వాళ్లు లేరు. చుట్టుపక్కలున్న పిల్లల్ని అడిగితే, ఆ కుటుంబంలోని తండ్రి, కొడుకు రాత్రిపూట ఎందుకో కొట్టుకున్నారని చెప్పారు. తెల్లవారకముందే ఆ ఇద్దరూ వెళ్లిపోయారని కూడా చెప్పారు. ఆ తర్వాత చుట్టుపక్కల ఊళ్లలో వెదికాను. వాళ్లు ఎక్కడా కనిపించలేదు. ఓరోజు ఏదో పనిమీద వెళ్తుంటే, ఒకచోట ఊళ్లో ఎలుగును ఆడిస్తూ ఒక మనిషి కనిపించాడు. అతనో హోటల్ ముందు ఉన్నాడు. నేను బైక్ దిగి కొద్దిసేపు ఆటను చూసి, అతని ఊరూ పేరూ ఆరా తీశాను.

ఏ వివరమూ చెప్పలేదతను. పైగా "తప్పయింది సార్! రేపే టేషన్‌కు వచ్చి మిమ్మల్ని కలుద్దామనుకున్నా సార్" అంటూ కాళ్లమీద పడిపోయాడు. మొదట నాకేమీ అర్థంకాలేదు. తర్వాత అతని మాటల్ని బట్టి, నేనో పోలీసు అనుకుంటున్నాడని తెలిసింది. కాదని చెప్పడానికి ఎంతో ప్రయత్నించాను. నమ్మలేదతను. భయంభయంగా వెళ్లిపోయాడు. అలాంటి వాళ్లు పోలీసుల్ని ఎందుకు కలవాలో నాకు బోధపడలేదు.

అప్పటినుంచి రెండు మూడు నెలలు ఆ కుటుంబం కోసం వెదుకుతూనే ఉన్నాను. వాళ్లు మళ్లీ ఎక్కడా తారసపడలేదు.

నేనో పోలీసునని అతను భయపడిన తీరు.. నన్ను వెంటాడుతూ వచ్చింది. మిత్రుడు పోతుల నారాయణతో ఈ విషయమే చెప్పాను. అంబార్‌పేటలో ఎలుగును ఆడించే కుటుంబాలున్నాయని, అక్కడ తన మిత్రులూ ఉన్నారని చెప్పాడు. వాళ్లతో మాట్లాడితే విషయాలన్నీ తెలుస్తాయన్నాడు.

ఇద్దరం కలిసి అంబార్‌పేట వెళ్లాం. మానేరు ప్రాజెక్టుపైన ఉందా ఊరు. ప్రాజెక్టులో నీళ్లులేక దారి దగ్గరయింది



'దర్వేశీ' పేరుతో మరాఠీలో ప్రచురితమైన 'జిగిరి' కథాచిత్రం

కానీ, చుట్టూ తిరిగి వెళ్లాలంటే ఇబ్బందే. అక్కడ ఎలుగుతో ఒక కుటుంబం ఉన్నట్టు.. బయటి ఊళ్లకు తెలిసినంతగా ఆ ఊరి వాళ్లకు తెలిసినట్టు లేదు. ఎలుగు లేదని కొందరు, ఆ కుటుంబం అసలా ఊళ్లోనే లేదని ఇంకొందరు అన్నారు.

### త్వరలో చిత్రంగా..

'జిగిరి'ని డాక్యుమెంటరీ చిత్రంగా తీయాలని పెద్దింటి అశోక్‌కుమార్ మిత్రులు సంకల్పించారు. స్క్రిప్ట్ పని ఇప్పటికే పూర్తిచేసుకున్నారు. నిర్మాణ పనులు కొనసాగుతున్నాయి.

మేం వెదుక్కుంటూ వెళ్లేసరికి, ఊరవతల గుడిసె కనిపించింది. అందులో ఎవరూ లేరు. పక్కవాళ్లెవరూ వాళ్ల గురించి చెప్పడానికి ఇష్టపడలేదు. మేం ఎవరమో, ఎందుకొచ్చామో చెప్పి నమ్మకం కలిగించాకే కొన్ని విషయాలు చెప్పారు

## అంతా ఓ వారంలోనే

ఏదైనా కథ రాయాలంటేనే, 'పెద్దింటి'కి ఒక్కోసారి వారంరోజులుపైనే పడుతుంది. ఏ కథనూ ఈయన ఒక్క సిటింగ్‌లో రాసింది లేదు. అలాంటిది 'జిగిరి'లాంటి నవలను మాత్రం ఒక వారంలోనే పూర్తిచేశారు. ఎప్పుడైనా మొదటి కాపీ రాయడమే అలవాటుగల ఆయన దీన్ని కూడా అలాగే రాశారు.

అప్పుడే.. అంటే.. 2006లో అమెరికన్ తెలుగు అసోసియేషన్ (ఆటా) వారి నవలల పోటీల ప్రకటన వెలువడింది. 'జిగిరి'కి అందులో బహుమతి వచ్చింది.

వాళ్లు. ఎలుగు చనిపోయిందని, ఆ బాధతో కుటుంబంలోనివారు వారంపాటు మనుషులు కాలేదనీ చెప్పారు.

ఎలుగుతో ఒక కుటుంబం లింగన్నపేటకు వచ్చిందని తెలిసి అక్కడికి వెళ్లాను. వాళ్లు నేను వెదుకుతున్నవాళ్లే! కానీ వాళ్లు నోరు విప్పలేదు. పది నిమిషాలకే, పోలీసులు వెదుక్కుంటూ వచ్చారు.. వన్యప్రాణిని తెచ్చి ఊళ్లో ఆడిస్తున్నారనో, ఇంకా ఏ వివరాల కోసమో?

ఆరోజు ఎలుగుతోనే ఉన్నాను. అదిచేసే విన్యాసాలు చూశాను. దాని యజమాని పడే బాధల్నీ చూశాను. ఆ 'రెండు ప్రాణుల' స్నేహాన్నీ చూశాను. అన్నిటినీ చూసిన నేపథ్యంలోనే పుట్టుకొచ్చింది 'జిగిరి'. జిగిరి అంటే దగ్గరితనం, ఆత్మీయం. అందుకే 'జిగిరీ దోస్తు' అంటుంటారు ఉర్దూలో. హిందీతో పాటు ఇతర భారతీయ భాషల్లో కూడా జిగిరీకి అర్థం ఇదే. జిగిరీ దోస్తు అంటే ఇక్కడ ఎలుగుపిల్లే!

***కథేంటంటే..***

ఇమామ్, బీబమ్మ పేద దంపతులు. ఓ రైతు పొలాన్ని పాడుచేస్తున్న ఎలుగు పిల్లను వలపన్ని పట్టి ఇంటికి తెచ్చుకుంటారు. కొడుకుతో సమానంగా చూస్తూ, దాన్ని ఆడిస్తూ, బతుకుతుంటారు. ఒకరోజు తప్పించుకుపోయిన ఆ పిల్లను అడవంతా వెదికి మరీ ఇంటికి తీసుకొస్తాడు ఇమామ్. పెరిగి పెద్దయిన కొడుకుతో సహా ఊరూరా తిరుగుతూ, ఎలుగును తిప్పుతూ, దానిమీద మరింత ఆపేక్ష పెంచుకుంటాడు. ఊరికి కొత్తగా వచ్చిన ఎస్.ఐ. ఆ కుటుంబ స్థితి చూసి చలించిపోతాడు. వన్యప్రాణి సంరక్షణ చట్టంకింద ఆ ఎలుగును అటవీశాఖకి అప్పగించినా, ఎలుగును రోడ్డుమీద ఆడించే పని మానుకున్నా పునరావాస పథకంకింద రెండెకరాల భూమి ఇప్పిస్తానంటాడు. ఎలుగు లేకపోతేనే భూమి వస్తుందన్న ఆశ కలిగిన కొడుకు.. ఇప్పుడా ఎలుగు తమ ఇంట్లో లేదని, ఎప్పుడో చచ్చిపోయిందనీ ఊళ్లోవాళ్లతో అబద్ధమాడతాడు.

ఎలుగును శాశ్వతంగా వదిలించుకోవాలని, లేదంటే ఉరిపోసుకు చస్తానని ఇమామ్‌ని బెదిరిస్తాడు కొడుకు. తల్లి కూడా కొడుకునే సమర్థిస్తుంది. వత్తిడికి గురైన ఇమామ్ చివరికి ఆ ప్రాణికి మత్తుమందిచ్చి, అడవిలో వదిలి రావాలని నిర్ణయించుకుంటాడు. ఆ పని చేయడానికి మనసు రాక దానితో సహా తిరిగి ఇంటికి వచ్చేస్తాడు. ఊళ్లోవాళ్లకి ఎలుగు కనిపిస్తే నిజమేమిటో బైటపడుతుందని, భూమి రాదనీ తండ్రితో ఘర్షణపడతాడు కొడుకు. సమస్యని ఓ గంటలో పరిష్కారం చేయకుంటే,

## మరెన్నో భాషల్లో..

బెంగాలీలో డాక్టర్ నానీసర్, పంజాబీలో డాక్టర్ క్రాంతిపాల్, ఒరియాలో నందితా మహంతి 'జిగిరి'ని అదే పేరుతో అనువదించారు. 'దర్వేశీ' శీర్షికతో సాయినాథ్ పచారే మరాఠీ అనువాదం చేశారు. కృష్ణమూర్తి కన్నడంలో, నిజాం వెంకటేశం ఆంగ్లంలో అనువాదాలు చేసే పనిలో ఉన్నారు. అస్సాం భాషలో సైతం ఈ నవలను అనువదిస్తున్నారు. హిందీ- తెలుగు వెర్షన్‌తోనూ పుస్తకం ఇక ముందు రానుంది.

## ప్రశంసల జల్లు

ఎలుగుపిల్ల, మనిషి కథే 'జిగిరి'. అడవి జంతువే అయినా అది క్రమంగా మనిషి స్వభావం పొందుతుంటే, మనిషి మాత్రం స్వార్థంతో అడవి జంతువులా మారిపోతున్నాడని వెల్లడించిన రచన.

**– అరుణ్ ప్రకాశ్**
(సమకాలీన భారతీయ సాహిత్య పత్రిక సంపాదకుడు)

'జిగిరి'ని పంజాబీలో చదివి ఎంత స్పందించానంటే, 'మీరు తప్పక చదవాల్సిన రచన' అంటూ ఆ నవల ఉన్న పత్రికను 'అపురూప కానుక'గా నా మిత్రులకు పంపాను.

**– డాక్టర్ క్రాంతిపాల్**
(ప్రొఫెసర్, అలీగఢ్ విశ్వవిద్యాలయం)

వస్తువులో, కథనంలో ప్రత్యేకమైంది 'జిగిరి'. స్వార్థానికి జంతువుని వాడుకుని ఆ అవసరం తీరగానే దాన్ని వదిలించుకునే అవకాశవాదాన్ని చాంద్ పాత్ర ప్రతిబింబిస్తుంది. అదే జంతువులోని విశ్వాస గుణాన్ని గమనించి, తన కుటుంబం కంటే ఆ జంతువుతో ఉండటమే మేలని భావించే మనసును ఇమామ్ పాత్ర ప్రతిఫలిస్తుంది. కథన విధానం, వాడిన భాష చాలా సహజంగా ఉంది. పాత్రల చిత్రీకరణ ఆసక్తికరంగా, హృదయానికి హత్తుకునేలా ఉంది.

**– మృణాళిని**
('ఆటా' నవలల పోటీ బహుమతి నిర్ణేత)

మానవత అంటే ఏమిటో చాటిందీ నవల. చదువుతుంటే, ఎంతటి వార్కైనా కన్నీళ్లు రాక మానవు. హిందీలో చదివి ఎంతో చలించిపోయాను. ఇదే కథ పంజాబీ భాషలోనూ రావడం అందరినీ అలరించి తీరుతుంది.

**– రామ్ స్వరూప్**
('కహానీ పంజాబ్' పత్రిక)

తన శవాన్నే చూడాల్సి వస్తుందని తేల్చి చెప్తాడు. ఫలితంగా, ఎలుగును మళ్లీ అడవిలో వదిలేసి రావాలని కొడుకుతో సహా వెళ్తాడు తండ్రి. ఎంతకీ కదలని దానిమీద కొడుకు రాళ్లతో దాడిచేసి దూరంగా తరిమికొడుతుంటే, చూడలేక రోదిస్తాడు. ఇద్దరూ ఇంటికి తిరిగొస్తారు. ఆ రాత్రికే ఎలుగుపిల్ల కూడా వచ్చేస్తుంది!

చివరి ప్రయత్నంగా దానికి విషమిచ్చి చంపడానికి కొడుకు సిద్ధమవుతాడు. చూడలేని తండ్రి తనే ఆ ప్రాణిని వదిలించుకుంటానంటూ విషం చేతపట్టుకుని అడవికి ప్రయాణమవుతాడు. కన్నీళ్లు తుడుచుకుంటూ ఎలుగును వెంటబెట్టుకుని వెళ్తాడే కానీ అతను తిరిగి రాడు! ఆ ఎలుగు జాడా తెలియదు!




### అనువాద పరంపర

తొమ్మిదో 'ఆటా' మహాసభల ప్రత్యేక సంచిక 'కబురు'లో అచ్చయింది 'జిగిరి'. 'సాహిత్య నేత్రం' పత్రికవారు ఒక సంచికలో నవల మొత్తం వేశారు.

'ఆటా' సంచికలో నా రచన చదివి స్పందించిన డాక్టర్ జె. లక్ష్మిరెడ్డి .. అది బాగుందని, హిందీలోకి అనువదిస్తానని ఉత్తరం రాశారు. ఆయనతో కనీస పరిచయం కూడా లేదు. అందుకే స్పందించలేదు. మళ్లీ మరో ఉత్తరం వచ్చిందాయన నుంచి. అనుమతి పత్రం పంపించాను. తర్వాత సమకాలీన భారతీయ సాహిత్యానికి చెందిన ద్వైమాస హిందీ సంచిక నా ఇంటికి వచ్చింది. అప్పుడు తెలిసింది నాకు.. అనువాదం పూర్తయిందని, అచ్చు కూడా అయిందని. అది 2008 జనవరి- ఫిబ్రవరి సంచిక. ఆ అనువాదానికీ 'జిగిరి' పేరే పెట్టారు.

'జిగిరి' హిందీలోకి వెళ్లింది కాబట్టి, పలు రాష్ట్రాలవారు చదివే అవకాశం కలిగింది. అదే హిందీ పత్రికలో నా గురించి రాస్తూ, ఫోన్ నెంబర్ ఇచ్చారు. ఫలితంగా చాలా ఫోన్లు, ఉత్తరాలు వచ్చాయి నాకు.

సేకరణ : **శరత్‌బాబు**

# కాలాతీతం





ఆంద్రెగైడ్

# ది ఇమ్మోరలిస్ట్

స్వీయానుభవం ఆధారంగా రాసిన ఆత్మకథాత్మక నవల 'ది ఇమ్మోరలిస్ట్'. అనైతిక జీవితం గడిపిన ఒక వ్యక్తి కథ. అంటే కథానాయకుని పట్ల మనకు గౌరవం కలుగదు. అతణ్ణి ఏవగించుకునే క్రమంలోనే పాఠకులు ఆత్మవిమర్శ చేసుకుని తమ బాధ్యతను గుర్తించాలని రచయిత కోరిక.

బాల్యంలోనే ఏర్పడిన పఠనాసక్తీ, నార్మండీ నగరంలోని ఇంటి వాతావరణమూ, 1893 నాటి ఉత్తరాఫ్రికా పర్యటన, మెరిసే చామనచాయ రంగులో వాంఛలను ప్రేరేపించిన అరబ్ బాలుర గురించిన కథనాలూ ఇందులోని వస్తువు. తనకు తెలిసిన ఆస్కార్ వైల్డ్ ఇందులో మెనాక్కగా రూపాంతరం చెందాడు.

స్వేచ్ఛకూ, బాధ్యతకూ జరిగే నిరంతర పోరాటంలో వ్యక్తి నిర్ణయం ఎటువైపు ఉండాలి? మంచి-చెడుల మధ్య సంఘర్షణ కన్న ఇది భిన్నమైనది. తన నైతిక దృక్పథాన్ని బట్టి వ్యక్తి ఏదో ఒకదాన్ని సమర్థిస్తాడు. బలహీనతే జీవితగమనాన్ని శాసిస్తే పరిణామాలు కూడా తదనుగుణంగానే ఉంటాయి.

ఇమ్మోరలిస్ట్ ఒక ఫ్రేం కథ. అంటే కథలో కథ. అత్యవసర పరిస్థితిలో ఒకర్నొకరు ఆదుకోవాలని నలుగురు యువకులు



ఓ ఒప్పందం చేసుకుంటారు. అందులో ఒకడు మిగతా ముగ్గుర్నీ ఉన్నఫళంగా రమ్మని ఓసారి కబురుపెట్టాడు. చాలా దూరం ప్రయాణం చెయ్యాలి. అతడెక్కడో దూరాన, ఉత్తరాఫ్రికాలో, అల్జీరియాలోని ఓ కుగ్రామంలో ఉంటాడు. అయినా ఇబ్బందుల్ని లెక్క చెయ్యక, ఆగమేఘాల మీద వచ్చి వాలుతారు మిత్రులు. అయితే అక్కడికి చేరాక తెలిసింది తాము చెయ్యాటానికేమీ లేదని. అతడు తన కథ చెబుతాడు. వాళ్లు నోర్మూసుకుని వినాలి. ఇదేనా అతడికి వచ్చిన ఆపద? తాము నలుగురూ విడిపోయిన నాటినుండి ప్రారంభమవుతుంది కథ. నలుగురికీ ఆదర్శంగా బతకాల్సిన యువకుడు ఎందుకిలా పతనమయ్యాడు? కనిపించే శత్రువులెవరూ లేరు. కాని తన అసహజ ప్రవృత్తే తనకు శత్రువు.




మైఖేల్‌కు ఇరవయ్యేళ్లు. తల్లి మరణంతో తండ్రి తనను కంటికి రెప్పలా పెంచుతాడు. అతడు మేధావీ, పండితుడూ కావటంతో కుర్రాడి బుద్ధి కూడా ఆ దిశలోనే వికసిస్తుంది. విషయ పరిజ్ఞానంలో తండ్రిని మించినా, సావాసగాళ్లు లేని ఒంటరి జీవితం, ఎడారిలాంటి పుస్తక ప్రపంచం అతడిని సహజ స్పందనలు లేని జడునిగా, యాంత్రిక జీవిగా మారుస్తాయి. తండ్రి చివరి కోరిక ప్రకారం ఇరవైనాలుగేళ్లప్పుడు మార్సెలైన్ అనే యువతిని పెళ్లాడతాడు. ఆమెపట్ల అతడికి గౌరవముంది గాని ప్రేమ లేదు.

హనీమూన్ కోసం నవదంపతులు ఉత్తరాఫ్రికా చేరుకుంటారు. అక్కడ చారిత్రక ప్రాధాన్యమున్న కొన్ని శిథిలాలను అధ్యయనం చేయాలనుకుంటాడు మైఖేల్. అయితే ఆరోగ్యం పాడై లేవలేని స్థితి వస్తుంది. అది క్షయ అని నిర్ధారిస్తారు డాక్టర్లు. భర్తకు మార్సెలైన్ రాత్రింబవళ్లు సేవ చేస్తుంది. ఆరోగ్యం కాస్త సహకరించగానే త్వరగా కోలుకోవటానికి సహారన్ అట్లాస్ ప్రాంతంలోని బిస్క్రా నగరం చేరుకుంటారు భార్యాభర్తలు. అక్కడ వీధిలో కనిపించిన నిరుపేద అరబ్ కుర్రాళ్లమీద సానుభూతితో చేరదీసిన మార్సెలైన్, కాలక్షేపం కోసం వాళ్లను ఇంటికి తీసుకుని వస్తుంది. వాళ్ల సాంగత్యంతో మైఖేల్ ఆరోగ్యం మెరుగుపడుతుంది. మరికొన్నాళ్లకు బిస్క్రా వీధుల్లో సరదాగా తిరుగుతూ, ఒయాసిస్ పక్కనున్న పొలాల్లో పశువులను మేపుకుంటున్న పిల్లల పట్ల ఆకర్షితుడవుతాడు మైఖేల్. అతడిని అక్కడి కుర్రాడు మొక్తీర్ యవ్వనోత్సాహంతో, మెరిసే చర్మంతో ప్రత్యేకంగా ఆకట్టుకుంటాడు. వాడిని చేరదీసి తాయిలాలిచ్చి, ఇంటికి తీసుకొస్తాడు. ఇంట్లో ఉన్న రకరకాల వస్తువుల మీద మోజుపడ్డ మొక్తీర్ ఎంతో ఇష్టంగా మార్సెలైన్ తన సొరుగులో దాచుకున్న కత్తెరను దొంగిలిస్తాడు. ఇది గమనించినా అభ్యంతరం చెప్పడు మైఖేల్. ఆ నేరాన్ని ఉపేక్షించటంతో ఆనందం కూడా అనుభవిస్తాడు. సమాజం అంగీకరించిన నైతికత నుండి బయటపడటంలో భాగమే ఆ ఆనందం, ఆ తృప్తి.

మైఖేల్ పూర్తిగా కోలుకున్న తర్వాత సిసిలీ, దక్షిణ ఇటలీల మీదుగా ఫ్రాన్స్‌కు తిరిగి వస్తారు దంపతులు. ఒకసారి ఒకప్పుడతడు చరిత్రకారుడిగా పేరు గడించాలనుకున్నాడు. ఇప్పుడది తుచ్ఛమైన కోరిక అనిపించింది. ప్రాపంచిక విలువలూ, నీతి

# జీవితలక్ష్యం తక్షణానందం

అరవై ఏళ్ల సాహితీ ప్రస్థానంలో ఫ్రెంచ్ రచయిత ఆంద్రె గైడ్‌ను కీర్తి ప్రతిష్ఠలు వరించింది జీవిత చరమాంకంలోనే. మొదట 1947లో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం ఆయనకు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసింది. అదే సంవత్సరం నోబెల్ బహుమతి కూడా వచ్చింది. ఆస్కార్ వైల్డ్, మలార్మ్‌లకు సమకాలీకుడైన గైడ్ పందొమ్మిదో శతాబ్దిలోనే రచనలు ప్రారంభించాడు. ఈయన తండ్రి పారిస్ విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్ర ఆచార్యుడు, పరమ సంప్రదాయవాది.

ఆంద్రె గైడ్ పదమూడేళ్లప్పుడే తనకన్న రెండేళ్ల పెద్దదైన కజిన్‌తో ప్రేమలో పడి ఇరవై ఐదేళ్లప్పుడు ఆమెనే పెళ్లి చేసుకున్నాడు. దాంపత్య జీవితం సజావుగా సాగలేదు. ఏ పనిలోనూ భర్తకు ఆమె సహకరించకపోవడమే దీనికి కారణం. లైంగికపరంగా గైడ్‌ది విపరీత స్వభావం. స్వలింగ సంపర్కం మీదే మోజు. ఈ అసహజ ప్రవృత్తి పట్ల పందొమ్మిదో శతాబ్దంలో ఉన్న వ్యతిరేకతతో పోలిస్తే ఇప్పుడు కొంత తగ్గింది. 'వాళ్లూ మన సమాజంలో భాగమే' అని గుర్తిస్తున్నారు సామాజిక శాస్త్రవేత్తలు. ఆయన ఆత్మకథ ప్రకారం ఈ కోరికను తగ్గించుకోవటానికే పెళ్లి చేసుకున్నాడు. కానీ వివాహం విఫలం కావటంతో ఉత్తరాఫ్రికా యాత్రలో అరబ్ కుర్రాళ్లతో 'సంబంధాలు' పెట్టుకోవటం, మరో ప్రముఖ స్వలింగ సంపర్కి, రచయిత ఆస్కార్‌వైల్డ్‌తో స్నేహం ఈ జాడ్యాన్ని పెంచాయి. గొప్ప కళాకారులు, రచయితలు సకల సద్గుణ సంపన్నులు కానవసరం లేదనటానికి వీళ్లిద్దరూ నిదర్శనం. చివరకు బహిరంగంగా 1924లో 'కారిడన్' అనే పుస్తకంలో తన లైంగిక భావనలను సమర్థించుకున్నాడు గైడ్.

ఈ ఒక్క బలహీనత మినహా గైడ్ తన జీవితమంతా సాహితీసేవకే అంకితం చేశాడు. 1891లోనే నాటి సాహితీస్రష్టలు మలార్మ్, పాల్ వాలెరీలతో స్నేహం చేశాడు.

కళాసాహిత్యాల గురించీ, తన లోపాల గురించీ వివరంగా చర్చించాడు 'జర్నల్స్'లో.

సూత్రాలూ వట్టి బూటకం. జీవితం అంటే క్షణం నుండి క్షణానికి బతకటమే అని గ్రహిస్తాడు. శతాబ్దాల మానవేతిహాసమనే బండరాయి కింద నలిగిపోతున్నాడు మనిషి. ఆ భారాన్ని ఇక మోయలేడు. నాగరికత, సంప్రదాయాలు, రీతి రివాజులు- అన్నీ పెనుభారం. ఇవన్నీ అసహజమైన కృత్రిమ మానవుణ్ణి తయారుచేశాయి. ఇప్పటి వరకు పుస్తకాలలో తెలుసుకున్నదంతా కుహనా జ్ఞానం. జీవితలక్ష్యం తక్షణానందం. ఈ శరీరంవల్ల ఆరోగ్యం సహకరించినంత వరకూ, ఎప్పటికప్పుడు ఆనందించగలిగిన జీవితమే సత్యం. ఈ కండరాల బలం, జంతు సహజమైన ఉల్లాసం, ఉత్సాహం- ఇవి తప్ప అంతా మిథ్య. శుభ్రంగా గడ్డం చేసుకుని, జుత్తు పెంచుకుని, ఇటలీ సముద్రతీరంలో నగ్నంగా విహరిస్తాడు మైఖేల్. నులివెచ్చని తొలి ఎండకు ఒళ్లు పులకరిస్తుంది. శారీరక దారుఢ్యం పెరిగింది. ఆత్మ విశ్వాసంతో ఉత్సాహం ఉరకలు వేసింది. డ్రైవరు వేగంగా నడపటంతో గుర్రపు బండిలో నుండి కింద పడబోయి తృటిలో తప్పించుకుంటుంది మార్సెలైన్. కోపం



ఆంద్రె గైడ్ (1869 - 1951)

మార్క్సిజం పట్ల ఆకర్షితుడైన గైడ్ రష్యాలో ప్రభుత్వ అతిథిగా పర్యటించాడు. తొలిదశలో 'సింబలిస్ట్' కవుల ప్రేరణతో, తరువాత తాత్త్వికుడు నీషే, రచయిత దొస్తొయేవ్‌స్కీల ప్రభావంతో 'ది ఫ్రూట్స్ ఆఫ్ ది ఎర్త్' (1897), 'ది ఇమ్మొరలిస్ట్' (1902), 'స్ట్రెయిట్ ఈజ్ ది గేట్' (1909) వగైరా రచనలు చేశాడు. ఇతడికి బాగా గుర్తింపు తెచ్చిన రచన 'ది కౌంటర్‌ఫీటర్స్' (1926). అతని ఆత్మకథ 'ఇఫ్ ఇట్ డైని ప్రపంచంలోని గొప్ప రచనల్లో ఒకటిగా భావిస్తారు.

పట్టలేక వాణ్ణి చితకబాదుతాడు మైఖేల్. ఆ రాత్రి భార్యతో తొలిసారి రతి సుఖం అనుభవిస్తాడు.

అన్యోన్య దాంపత్యం కొనసాగింది. మార్సెలైన్ గర్భం దాల్చింది. నార్మండీలో స్థిరపడ్డారు దంపతులు. తండ్రి సంపాదించిన పెద్ద ఎస్టేట్‌కు ఏకైక వారసుడు మైఖేల్. ఆస్తి వ్యవహారాలు నమ్మకమైన మేనేజర్ బొకాజ్ చూస్తుంటాడు. అతడి కొడుకు వ్యవసాయ శాస్త్రంలో దిట్ట. మైఖేల్ అతడితో స్నేహం చేసి, లాభసాటి వ్యవసాయం ఎలా చెయ్యాలో తెలుసుకుని ఎస్టేట్ పనితీరు మెరుగుపరుస్తాడు. పారిస్‌లో ఒక అపార్ట్‌మెంట్ కూడా కొంటాడు. జీవితం ఇక గాడిలో పడిందనే అతడి నమ్మకం. కాలేజ్ డి ఫ్రాన్స్‌లో చరిత్ర అధ్యాపకుడిగా చేరతాడు. అయితే కాలేజీలో అతడిచ్చిన ఉపన్యాసాలు వివాదాస్పదమవుతాయి. రోమ్ పతనం గురించి మాట్లాడుతూ ఆ మహానగరం మీద దాడి చేసిన ఆటవికులైన గోత్‌లను సమర్థిస్తాడు మైఖేల్.

పాత మిత్రుడు మెనాక్క తారసపడటంతో జీవితం గతి తప్పుతుంది. 'ఆనందో బ్రహ్మ' సిద్ధాంతాన్ని మైఖేల్‌కన్నా గట్టిగా విశ్వసించినవాడతడు. 'ఆనందం కోసమే జీవించు. ఆనందం కోసం ఏం చేసినా తప్పులేదు. ఆనందాన్ని మించిన నీతి, ధర్మం లేదు. ఒకపని చెయ్యటానికి ఆనందం తప్ప మరేదీ కారణం కాకూడదు' అనేది అతని సిద్ధాంతం. మెనాక్క మీద కోర్టు కేసులున్నట్టుగా, స్కాండల్స్ ప్రచారంలో ఉన్నట్టుగా సూచిస్తాడుగాని అవేమిటో స్పష్టం చెయ్యడు రచయిత. కొన్నాళ్ళ క్రితం బిస్క్రా వెళ్లిన మెనాక్క, అప్పట్లో మైఖేల్ ఇంట్లో జరిగిన కత్తెర దొంగతనం గురించి తెలుసుకుంటాడు. ఒకప్పుడు సంఘనీతిని ధిక్కరించిన, తిరస్కరించిన మైఖేల్ ఇప్పుడు మర్యాదస్తుడిగా ఎందుకు మారాడో అర్థంకాదు. తను దూరదేశాలకు ప్రయాణమవుతున్నాననీ, ఒకరాత్రి తనతో కబుర్లు చెబుతూ గడపాలనీ మైఖేల్‌ను కోరతాడు. అరుదైన ఖరీదైన మద్యం తాగుతూ గడుపుతారిద్దరూ. ఆనందమే పరమావధి అన్న తన వాదనను మరోసారి వినిపిస్తాడు మెనాక్క.

తెల్లవారుజామున మైఖేల్ ఇంటికి చేరేసరికి, గర్భస్రావమైన మార్సెలైన్ ప్రాణాపాయ స్థితిలో ఉంటుంది. ఈ ఘటనకు తానే కారణమనుకుంటాడు మైఖేల్.

డాక్టర్ రావటంతో ప్రమాదం తప్పుతుంది గాని ఆమె త్వరగా కోలుకోదు. ఊపిరి తిత్తులు, గుండె సంబంధిత వ్యాధి కూడా వస్తుంది. కొన్నాళ్లకు పారిస్ నుండి నార్మండీ తిరిగి వస్తారు దంపతులు. అయితే ఈసారి చార్లెస్‌తో కాకుండా చట్ట వ్యతిరేకంగా జంతువులను వేటాడే అతడి తమ్ముడు ఆల్ఫ్రెడ్‌తో స్నేహం చేస్తాడు మైఖేల్. తన సొంత ఎస్టేట్‌లోనే అత డితో కలిసి వేట కొనసాగిస్తాడు. తన యజమానే సొంత ఎస్టేట్‌లో దొంగవేటకు పూనుకున్నాడని తెలిసి బొనాజ్‌కు ఆ ఉద్యోగం మీదే అసహ్యం వేస్తుంది. ఇలా చట్ట వ్యతిరేకమైన పనులు చెయ్యటంలో వికృతానందం అనుభవిస్తాడు మైఖేల్. 'మమ్మల్ని మేనేజ్ చెయ్యమని చెప్పి నీ ఆస్తిని నువ్వే దొంగిలించటమేమిటి? నీలాంటి తిక్క మనిషి దగ్గర మేం పని చెయ్యలేం' అని బాధ్యతల నుండి తప్పుకుం టారు చార్లెస్, అతడి తండ్రి. ఎస్టేట్‌ను అమ్మకానికి పెడ తాడు మైఖేల్.




మార్సెలైన్‌కు క్షయ లక్షణాలు కనిపి స్తాయి. తన వల్లనే ఆ వ్యాధి ఆమెకు సోకి వుంటుందని అంగీకరించని మైఖేల్ అస లది క్షయ కాదని వాదిస్తాడు. గాలిమార్పు కోసం, భార్యను బలవంతంగా స్విట్జ ర్లాండుకు తీసుకుని పోతాడు. కాని మర్యా దస్తులూ, చట్టాన్ని తూచా తప్పక పాటించే స్విస్ పౌరుల మధ్య బతకలేకపో తాడు మైఖేల్. కొద్దిరోజులకే ఇటలీకి బ యల్దేరతారు. అల్జీరియాలోని అరబ్ కుర్రా ళ్లలా ఇప్పుడు సిసిలీలోని పశువుల కాపర్లు అతడిలో మోహం పెంచుతారు. కోరికను అదుపు చేసుకోలేక, ఓ కుర్రాడిని మచ్చిక చేసుకుంటాడు మైఖేల్. ఇప్పుడు భర్త విప రీత ప్రవర్తనను ప్రతిఘటించలేని బలహీ నురాలు మార్సెలైన్. అతడి 'ఆనందో బహ్మ' సిద్ధాంతం స్వార్థానికి మారుపేరు. అందులో తనలాంటి వ్యాధిగ్రస్తులకు స్థానం ఉండదని ఆమెకు తెలుసు. జాలి, సహానుభూతిలాంటి మానవ సహజమైన స్పందనలకు అతీతుడు మైఖేల్!

యూరోపియన్ నాగరికత నుండి మరింత దూరంగా ఆఫ్రికా చేరుకుంటారు దంపతులు. కొన్నేళ్ల క్రితం తనకు సహచ రులుగా ఉన్న కుర్రాళ్లను చూస్తాడు మైఖేల్. ఆనాడు ఆరోగ్యంతో తొణికిసలా డిన కుర్రాళ్లు ఇప్పుడు రోగిష్టులుగా, ముష్టి వాళ్లుగా, వీధి కుక్కల్లా తిరు గుతున్నారు. కొన్నాళ్లు జైల్లో గడిపి వచ్చినందువల్లనేమో మొక్తీర్ ఒక్కడే కాస్త ఆరో గ్యంగా కనిపిస్తాడు. మొక్తీ ర్‌తో కలిసి దగ్గర్లోని మరో నగరం టూగోర్ట్‌కు వెళతాడు మైఖేల్. మార్సెలైన్ జబ్బు ముదురుతుంది. అక్కడ మొక్తీర్ ఉంపుడుగత్తె మైఖేల్‌ను ఇంటికి ఆహ్వానిస్తుంది. మొక్తీర్ సమక్షంలోనే వాళ్లిద్దరూ సన్నిహితంగా మెలుగుతారు. మైఖేల్ ఇంటికి చేరిన తర్వాత మార్సెలైన్ తుదిశ్వాస విడుస్తుంది.

కథ ముగిసింది. మైఖేల్ సంభాషణ కొనసాగుతుంది. మూడు నెలలు గడి చాయి. కొండల్లో ఒంటరిగా గడుపుతు న్నారు. స్థానిక స్త్రీ ఒకావిడ 'సహచరి'గా వుంది. ఆమెకో తమ్ముడున్నాడు. వాడి పేరు అలీ.

'యజమాని నిజంగా ఇష్టపడేది నన్ను కాదు నా తమ్ముణ్ణి' అంటూ పగలబడి నవ్వుతుందామె. ఆమె చెప్పినదాంట్లో వాస్తవం లేకపోలేదు.

–ఎం.వసంత

# వంగ కవితా కదన కాహళి

**ప్రపంచ యుద్ధం, క్షామం, దేశ విభజన, మత కలహాలు, ఆగని వలసలు తదితర విషమ పరిస్థితులు నెలకొన్న దశలో కలం పట్టాడాయన. 'కల్లోల్' కవితా మార్గానికి భిన్నంగా వామపక్ష భావజాలంతో సామాజిక న్యాయానికి పట్టంకట్టిన ఆయన ఆధునిక బెంగాలీ కవితావిష్కరణకు నాందిపలికిన వైతాళికుడు. నైరాశ్యానికి స్వస్తిపలికి, ప్రజలలో నవచైతన్య దీప్తిని ఉద్దీపింపజేసిన ఆయన కవితలు నినాదాలుగా, కదన గీతాలుగా విశేష జనాదరణ పొందాయి. 1971-85 మధ్య కాలంలో ఆయన చేసిన సృజనాత్మక బెంగాలీ రచనలు భారతీయ భాషల్లో సర్వోత్తమమైనవిగా వినుతికెక్కాయి. తన సాహితీకృషికి గాను 1991లో జ్ఞానపీఠ పురస్కారం పొందిన ఆ మహనీయుడే సుభాష్ ముఖోపాధ్యాయ.**



సుభాష్ ముఖోపాధ్యాయ

పశ్చిమ బెంగాల్ రాష్ట్రం నాడియాజిల్లా కృష్ణానగర్‌లో సుభాష్ ముఖోపాధ్యాయ 1919 ఫిబ్రవరి 12న జన్మించాడు. తూర్పుబెంగాల్ నుంచి కాందిశీకులుగా వచ్చిన కుటుంబం వారిది. 'దేశ విభజన తర్వాత మాకు ఇల్లనేదే లేదు. కోల్‌కతా నగరమే గనక మాకు ఆశ్రయం ఇవ్వకపోతే మేము ఏమైపోయేవాళ్లమో చెప్పలేను' అని ఆర్ద్రంగా చెప్పాడాయన. చిన్నతనంలోనే క్రీడానైపుణ్యం అతనికి అలవడింది. అలాగే బెంగాలీ భాష పట్ల ప్రత్యేకాభిమానం పెంచుకున్నాడు. సంగీతమంటే చాలా మక్కువ. పాడే అలవాటూ ఉంది. ప్రాథమికస్థాయిలో మంచి మార్కులు సాధించడం గురించి చెబుతూ 'మా మూడు తరాల్లో ఎవరికీ డెబ్బైరెండు మార్కులు రాలేదు. నేను సాధించగలిగాను' అన్నాడు. ముఖోపాధ్యాయ తండ్రి జనపనార కర్మాగారంలో గుమాస్తా. అప్పట్లో ఆర్థికమాంద్యం మూలంగా జీతం తగ్గించారు. చిన్న ఇంట్లో వారి నివాసం. గాంధీజీ సత్యాగ్రహం పెద్దఎత్తున సాగుతున్న రోజులవి. ముఖోపాధ్యాయకు రచనా వ్యాసంగం పట్ల బాల్యంలోనే ఆసక్తి ఏర్పడింది. ఆయన రచించిన వ్యాసం స్కూలు పత్రికలో అచ్చయింది. సహాయ ప్రధానోపాధ్యాయుడు కృష్ణ




బాబు, 'నీవు ఇప్పుడు రచయితవయ్యావు. ఇక నుంచి కవిగా మారాలి' అని దీవించారు.

ముఖోపాధ్యాయ తత్త్వశాస్త్రం చదివి కోల్‌కతా

లోని స్కాటిష్ చర్చి కళాశాల నుంచి పట్టభద్రుడయ్యాడు. విద్యార్థిగా ఉన్నప్పుడే కమ్యూనిస్టు పార్టీపట్ల ఆకర్షితుడయ్యాడు. మార్క్సిస్టు ఆలోచనలు జీర్ణించుకున్నాడు. రాజకీయ కార్యకర్తగా 1951లో జైలు జీవితం అనుభవించాడు. జైలు నుంచి విడుదలైన తర్వాత గీతాబంధోపాధ్యాయను వివాహమాడాడు. ఆమె కూడా ప్రముఖ రచయిత్రి కావడం విశేషం.

ముఖోపాధ్యాయ కార్మికసంఘ కార్యకలాపాల్లో క్రియాశీలంగా పాల్గొన్నాడు. జనపనార పరిశ్రమలో పనిచేసే కార్మికుల కోసం ఓ పత్రిక ఆరంభించాడు. ఫాసిజాన్ని తీవ్రంగా వ్యతిరేకించే ముఖోపాధ్యాయ రైతులు, శ్రామికుల శ్రేయస్సు కోసం దివారాత్రాలు శ్రమించేవాడు. కొంతకాలం బెంగాలీ సాహిత్య పత్రిక 'పరిచయ్' సంపాదకుడిగా పనిచేశాడు. అలాగే బెంగాలీ దిన, వారపత్రికల సంపాదకవర్గంలో సేవలందించాడు. పిల్లల పత్రిక 'సందేశ్'కు సత్యజిత్‌రేతో కలిసి సంపాదకుడిగా పనిచేశాడు. 1982 వరకు కమ్యూనిస్టు పార్టీ సభ్యుడిగా కొనసాగాడు. తర్వాత రాజకీయాలనుండి విరమించుకున్నాడు. ముఖోపాధ్యాయ రష్యా, ఇంగ్లండు, వియత్నాం, జర్మనీ, జపాన్, ఈజిప్టు, లెబనాన్, ఫ్రాన్స్ మొదలైన దేశాలు సందర్శించాడు. 'ఆఫ్రో-ఏషియన్ రైటర్స్ అసోసియేషన్' ఉపప్రధాన కార్యదర్శిగా సేవలందించాడు. 'ప్రోగ్రెసివ్ రైటర్స్ యూనియన్'ను నెలకొల్పింది ఆయనే.

మౌలికంగా ముఖోపాధ్యాయ కవి. ప్రజా జీవితంతో, వామపక్ష రాజకీయ ధోరణితో ముడిపడిన రచనలు వెలయించాడు. భావంలో, పదప్రయోగంలో, నైశిత్యంలో, కవితా శిల్పంలో ఆయనది నూతన మార్గం. వివాదాస్పదుడిగా కూడా ఆయనపై ముద్రపడింది. ఆయన తొలి కవితా సంపుటి 'పదాతిక్' 1940లో వెలువడింది. బెంగాలీ సాహితీరంగంలో సంచలనం సృష్టించిన రచన ఇది. అప్పటివరకు ఉన్న కవితా సంప్రదాయాలకు భిన్నమైన ధోరణి ఇందులో కనిపిస్తుంది. దీనిలో విప్లవ భావాలున్నాయి.

రెండో కవితాసంపుటి 'అగ్నికోణ్' 1948లో ప్రచురించాడు. ఈ కవితల్లో కవి ఆశయం ప్రస్ఫుటమవుతుంది. 'ప్రజలు అకుంఠిత దీక్షతో, పోరాటపటిమతో అగ్నికీలల్ని, గాఢాంధకారాన్ని ఛేదించుకుంటారు. శిలామయమైన క్షేత్రాన్ని సస్యశ్యామలంగా తీర్చిదిద్దుతారు' అని ప్రకటించిన ఆశావాది ఆయన. ఖైదీగా ఉన్నప్పుడు ఆయన రచించిన కవిత 'చిర్‌కుట్'. బెంగాల్ క్షామం దీనికి కేంద్ర బిందువు. ప్రజల బాధలకిది అపురూప దర్పణం. రాజకీయ భావజాలాన్ని, కవిత్వంతో అనుసంధించిన విలక్షణ కవి ముఖోపాధ్యాయ. 'ఛూతేర్ బేగార్'కు మార్క్సిస్టు సిద్ధాంతాలు భూమిక. ఢమరుకం, అగ్ని, తూటా, ఊరేగింపు తదితర పదాలు పుంఖానుపుంఖాలుగా ఈ కవితల్లో చోటుచేసుకున్నాయి.

అనుభూతి ప్రవణత 'ఫూల్ ఫుటుక్ న ఫుటుక్, ఆజ్ బొషాంతొ'లో ఆవిష్కృతమవుతుంది. 'కంకర కాలిబాట మీద/తన వేళ్లని/ ఒక పిసినారి చెట్టు/ కొత్త ఆకులు తొడిగి/ విరగబడి నవ్వుతోంది' అని వర్ణించాడు.

జారె కాగజెరా నౌకా, యే భాయ్, కాల్ మొధుమాస్, ధర్మేర కాల, జొతొ దూరేయి జాయ్ మొదలైన పదహారు కవితా సంపుటాలు, హంగరాజ్, కెకొథయ జాయీ, ఇయాసినేర్ కోల్‌కతా, అంతరీప్ బా హ్యాన్సేనెర్ నవలలు, ఆచార్ డాక్ బంగ్లార్ డాకె మొదలైన యాత్రా కథనాలు, అక్షరె అక్షరె, కయార్ కథా తదితర ఐదు బాల సాహిత్య రచనలు, రసగల్ప సంచయన్, అమరూ శతక్, రోజెన్‌బర్గ్ పత్రగుచ్ఛ వంటి ఏడు అనువాదాలు, ఇంకా అమార్ బాంగ్లా వంటి మూడు ఇతర రచనలతో మొత్తం యాభైకి పైగా గ్రంథాలు సుభాష్ ముఖోపాధ్యాయ కలం నుంచి జాలువారాయి.

పాఠకులంటే ఆయనకు ఎంతో అభిమానం. జ్ఞానపీఠ పురస్కారం అందుకుంటూ ఆయన ఇలా చెప్పారు, 'ఆరు దశాబ్దాలుగా నాకు లభించిన పాఠకులు తమ వాటా ఇవ్వమని కోరితే నాకు ఇంకేమీ మిగలదు'

ముఖోపాధ్యాయ కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం, కుమారన్ ఆశాన్ పురస్కారం, ఆనందపురస్కారం, కబీర్ సమ్మాన్, సోవియట్ ల్యాండ్ నెహ్రూ పురస్కారం, ఆఫ్రో-ఏషియన్ లోటస్ ప్రైజ్, మిర్జో తుర్సున్ జడె ప్రైజ్ అందుకున్నాడు. విశ్వభారతి విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటును ప్రదానం చేసింది. సాహిత్య అకాడమీ కార్యవర్గ సభ్యుడిగా విశేష సేవలందించాడు.

సుభాష్ ముఖోపాధ్యాయ 2003 జూలై 8న పరమపదించాడు. బెంగాలీ సాహిత్యంలో ఆయనకు అగ్రేసర స్థానం శాశ్వతంగా నిలుస్తుంది.

– గోవిందరాజు రామకృష్ణారావు

# మనసున ఉన్నదీ...



★ నల్లని మబ్బుల్లోంచి తొంగి చూస్తున్న జాబిలిలా, అరవిరిసిన నవ్వుతో తొంగి చూస్తున్న ప్రియమణి ముఖారవిందంతో మే 'చతుర' ముఖచిత్రం చూడ ముచ్చటగా ఉంది. ఆర్కే నారాయణ్ నవల 'మాటకారి' అక్షరాక్షరంలో ఉత్కంఠ రేపుతూ ఆద్యంతం హాస్యంగా సాగింది. రోమారోలా 'జీన్ క్రిస్టోఫ్' నవలా పరిచయం అద్భుతంగా ఉంది.

–బిక్కునూరి రాజేశ్వర్, పొస్కల్

★ మే 'చతుర'లో ఆర్. కె. నారాయణ్ నవలని చదివే భాగ్యం కలిగింది. ఎం.వి. రమణారెడ్డి అనువాద శైలి మమ్మల్నెంతగానో ఆకట్టుకుంది. అలాగే ఇతర శీర్షికలూ వేటికవే సాటిలా ఉన్నాయి. అమెరికా గురించి అనేక సంగతులు తెలియజేసే 'హాహా.. అమెరికా' చాలా బాగుంది.

–జి. శ్రీ, పెద్ద చెల్మెడ

★ సుప్రసిద్ధ రచయిత ఆర్. కె. నారాయణ్ 'మాటకారి'ని ఆసాంతం ఏకబిగిన చదివి ఆనందించాం. అలాగే చతురోక్తులు చక్కటి అంశాలను తెలిపాయి. 'కథ వెనుక కథ' ద్వారా కోలపల్లి ఈశ్వర్ మొదటి నవల 'హరిశ్చంద్రుడు అబద్ధం ఆడితే' గురించి తెలుసుకున్నాం. అప్పట్లోనే 'చతుర'లో ప్రచురించిన ఆ నవల సినిమాగా రావడం విశేషం. కొత్త గాలి కవితల్లో పదాలు మరింత భావగాఢతతో ఉంటే ఇంకా అలరింపజేస్తాయి. అనేక విశేషాలతో కూడిన 'చతుర' మమ్మల్నెంతగానో ఆనందింపచేసింది.

– జి. సూర్యనారాయణ,
బందలాయి చెరువు, కృష్ణాజిల్లా

★ మే 'చతుర'లో టాంక్‌బండ్ కథ 'వెయ్యి రూపాయిల నోటు' విరిగిన తిక్కన విగ్రహం వద్ద మొదలవుతుంది. కథలోని వ్యక్తులకు చదువు లేదు. బతుకు తెరువూ అంతంతమాత్రమే. భాగ్యనగరంలోని అభాగ్యులలో వాళ్ళు కూడా ఓ భాగం. అయితే మానవత్వంలో వారు ముందున్నారు. దారిద్ర్యం వాళ్ళను దిగజారుస్తున్న తరుణంలో ఓ సంఘటన వల్ల వాళ్లలో మేల్కొన్న ఆర్ద్రత పాఠకుల కళ్ళలోంచి జారే కన్నీటి బిందువుగా మారింది. కథను నడిపే అంశాలలో ఆర్ద్రత ఓ సున్నితమైన మెట్టు. కథకుడి సునిశిత పరిశీలన, బడుగు జీవితాల గూర్చిన చక్కటి అవగాహనతో ఓ మాండలికంలో నడిచి ఇది ఓ మెరుపులా మెరిసింది.

– యలమంచి ఆశాలత, న్యూజెర్సీ, అమెరికా

★ 'చతుర' నవల 'మాటకారి' చాలా బాగుంది. సరదాగా కథనం సాగింది. అనువాద నవల అయినప్పటికీ కూడా ఎక్కడా తెలుగు నేటివిటీని కోల్పోలేదు. ఆద్యంతం హాస్యప్రధాన ధోరణిలో, ఆలోచింపజేసే రీతిలో సాగిన ఈ నవల మమ్మల్ని చాలా ఆకట్టుకుంది. చాలా రోజుల తర్వాత మంచి హాస్య నవలను అందించిన 'చతుర'కు ధన్యవాదాలు.

– కూనం మల్లేశ్వరరావు, విశాఖపట్నం

★ గత నెల 'చతుర' మాకెంతో ఆనందాన్ని పంచింది. ఆర్. కె. నారాయణ్ నవల 'మాటకారి'లో అనువాదకుని ప్రతిభ అతని శైలి ద్వారా నిరూపితమైంది. నేటి తరం రచయితల్లో హాస్యం పండించగలిగే కోలపల్లి ఈశ్వర్ 'హరిశ్చంద్రుడు అబద్ధం ఆడితే' కథ వెనుక కథ తెల్సుకుని ఆనందించాం.

వెయ్యి రూపాయల నోటు దొరికి రెండు జీవితాలు కొన్ని క్షణాల పాటు తల్లడిల్లిన తీరును 'టాంక్‌బండ్ కథ' చక్కగా తెల్పింది. ప్రతి నెలా 'చతుర'లో నవలకు తగ్గస్థాయిలో శీర్షికలన్నీ చాలా బాగుంటున్నాయి.

– యం. సుధీర్‌కుమార్,
షాపూర్‌నగర్, హైదరాబాద్



చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

ఈ మెయిల్ :
vipula.chatura@eenadu.net

# ఇంటర్వ్యూ

- జి.సి. జీవి



"నువ్వు ఎం.ఎ.లో యూనివర్సిటీ ఫస్టు"

"అవును"

"కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌లో ఆలిండియాలో నీది అయిదో ర్యాంకు"

"నిజమే"

"మేనేజర్ ప్రమోషన్‌కి అవసరమైన ఆరేళ్ళ సర్వీసు కూడా వుంది నీకు"

"ఊ"

"ఒక్క రోజు కూడా సిక్‌లీవు పెట్టింది లేదు"

".... .... ...."

"నీ అయిదు నెలల ఇ.ఎల్. కూడా అలాగే ఉంది"

"అవసరం రాలేదు"

"సి.ఎల్. కూడా సంవత్సరానికి అయిదారు రోజుల కంటే వాడుకోలేదు"

"సెలవు పెట్టి అనవసరంగా ఇంట్లో కూర్చోవడం నాకు బోరుగా వుంటుంది"

"నీ సెక్షన్‌లో ఒక్క ఫైలు కూడా పెండింగులో వుండదు"

"అవును. కిందివాళ్ళు చెయ్యలేకపోతే ఆ పని నేనే చేసుకుంటాను"

"మీ డిపార్టుమెంటు హెడ్ నీకు మంచి రిపోర్టే ఇచ్చాడు"

## చతుర కతేలు

"ఎక్సలెంట్ అని ఇవ్వాలనుకున్నాను. కాని నీకేదో స్పెషల్ ఫేవర్ చేశానని అనుకుంటారు గిట్టనివాళ్ళు. అందుకనే వెరీగుడ్ అని ఇస్తున్నానని చెప్పారాయన"

"డిపార్టుమెంటు పరీక్షలు బాగా రాశానన్నావు"

"చాలా బాగా రాశాను. అన్నీ నాకు తెలిసిన ప్రశ్నలే"

"అయినా ఇంటర్వ్యూలో పోయింది"

"..... ..... ....."

"నీకే ప్రమోషన్ వచ్చుంటే అంతా కలిపి నాలుగు వేలు జీతం పెరిగేది. ఫర్నిష్డు క్వార్టర్స్, కారులోన్, ఇరవై లక్షల దాకా హౌసింగు లోన్.. ఇంకా..."

"ఏడాదికోసారి ఎల్.టి.సి. ఎయిర్ ఫేరు"

"ఎంత నష్టపోయావో చూశావా? "

"................"

"మనింటికి వస్తుంటుందే నీ ఫ్రెండు బొద్దుగా... ఆమె పేరేంటి? మరచిపోయాను"

"వినోద"

"ఆవిడ సెలెక్టయ్యింది. ఒక్క సర్వీసు విషయంలో తప్ప నీకున్న మెరిట్సులో ఒక్కటీ లేదు ఆమెగారికి"

"..... ..... ....."

"ఎట్లా సాధించింది? "

"వీకెండ్సులో మా ఎం.డి.తో గండిపేటకు వెళ్ళివచ్చేది"

"నువ్వెందుకు చెయ్యలేదు ఆ పని? దానికంటే అందంగా, సెక్సీగా వుంటావు కదా? "

ఆమె చివాలున లేచింది. మెడమీదికి చెయిపోనిచ్చింది. తాళి బొట్టుని సర్రున తెంపి అతని ముఖం మీదికి విసిరేసింది. హ్యాండుబేగులో ఎం.టి.ఎం కార్డు వుందా అని తడిమి చూసుకుంది. అక్కడి నుంచి చరచరా బయటికి నడిచింది.



# పరశురామ ప్రీతి

## బులుసు-జీ-ప్రకాష్

ఈ మధ్యనే నేనొక పసిపాపకి తండ్రినయ్యేను. వెంటనే మా మామగారు ఈ శుభ వర్తమానాన్ని దూరవాణి ద్వారా తెలియజేస్తూ "నామకరణోత్సవానికి ముహూర్తం పెట్టేక చెబుతాను.. అందుకు సిద్ధంగా ఉండు" అన్నారు.

ఓ శుభముహూర్తాన 'అత్తా'రింటికి వెళ్ళేను. ఏమిటో మన తెలుగువాళ్ల ఆచారాలు విచిత్రంగా ఉంటాయి. అమ్మాయికి పెళ్లీడొచ్చి పెళ్లి చేసేక 'అత్తా'రింటికి పంపించేము- అంటారు. మామగారింటికి అని అనరు. మామగారే ఇంటి యజమాని అయినా- అక్కడ అత్తగారికే ప్రాధాన్యం.

నామకరణోత్సవం అయేక ఇంటికి బయలుదేరేను. ఆ బయలుదేరే ముందు మా శ్రీమతి ఓ

# చతుర ప్రవేశిక

### జూన్ 'చతుర' చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. నీలూ వాళ్లు ఉండే వీధి పేరు?
 జ.
2. నీలూ స్నేహితురాలు వినత ఏం చదవాలనుకుంది?
జ.
3. నీలూ డాక్టర్ భార్య ?
 జ.
4. ప్రధానోపాధ్యాయులు గౌతంభట్ భార్య?
 జ.
5. ఘామిడీ అమ్మాయిలు కాలేజీకెలా వెళ్లేవారు?
 జ.
6. నిత్య ఎవరిని ప్రేమించింది?
 జ.
7. 'జిగిరి' నవలా రచయిత?
 జ.
8. సుభాష్ ముఖోపాధ్యాయ జైలుపాలైన ఏడాది?
 జ.
9. నటి ఆర్తీచాబ్రియా ఉదయమే తాగే రసం?
 జ.
10. కనకరాజు ఉద్యోగం?
 జ.

పంపినవారి పేరు: ------------------

------------------వయసు ( )

చిరునామా: ------------------

------------------

------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

# చతుర కతలు



సూచన చేసింది, ఏదైనా జాతీయం చేసిన బ్యాంకులో పాప పేర నెలకి ఐదొందలు రూపాయలు చొప్పున మూడేళ్లపాటు రికరింగ్ డిపాజిట్ కట్టమని.

"ఇప్పట్నుంచే తొందరెందుకోయ్? " అన్నాను.

"అలా కాదండీ! పాపాయికి మూడేళ్లు నిండేసరికి అసలు వడ్డీలతో కలిపి సుమారు ఇరవైవేలు వస్తాయి. దాన్ని నర్సరీలో చేర్పించేటప్పుడు, రెండు స్కూలు యూనిఫారాలు, మేజోళ్లు, బూట్లు కావాలి. టిఫిన్ బాక్సూ, వాటర్ బాటిలూ, మెడలో ఫొటో ఐడీ కావాలి. చెయ్యి తుడుచుకుందికీ, ముక్కుచీమిడి తుడుచుకుందికీ బుల్లిరుమాలు జేబులో దోపాలి. స్కూలు ఫీజులు దఫదఫాలుగా చెల్లించాలి. అప్పటికప్పుడు డబ్బు కావాలంటే ఎక్కణ్నుంచొస్తుంది? " అని సమాధానపరచింది శ్రీమతి. బాగుబాగు అనిపించింది నాకు. ఏ కుటుంబమైనా ఒద్దికగా సజావుగా గడవాలంటే ఇల్లాలిమీదే ఆధారపడి ఉంటుంది.

వెంటనే ఓ బ్యాంకులో రికరింగ్ డిపాజిట్ ఖాతా తెరిచాను. ఓ ఏడాదిపాటు కట్టేను. డబ్బుకి కొంచెం రొక్కటం అయింది. మా ఆఫీసులో పనిచేసే అటెండరొకడు మినీ వడ్డీకాసుల వాడు. అతన్ని కలుద్దామని బయలుదేరేను.

ఇంతలో దారిలో ఓ పక్క ఓ పదిమంది గుంపు ఏదో ఆటలాడుతున్నారు. ఏమిటా? అని ఆ గుంపులో దూరేను. "ఇదుగో నేను పదిరూపాయలు పందెం కాస్తున్నాను" అన్నాడు. అవతలి వాడేదో మేజిక్ చేసి "ఛూ మంతర్‌కాళీ" అన్నాడు. చేతిలోంచి ఇరవై రూపాయల నోటు వచ్చింది. అంతా ఆశ్చర్యపోయేరు! ఆ ఇరవై నోటుని ఆ పందెం కాసిన పెద్ద మనిషికిచ్చేసేడు ఆ మాంత్రికుడు.

"నాదో వంద పందెం" అన్నాడింకొడు.

"ఛూ మంతర్‌కాళీ" అంటూ ఐదొందలు కాయితం ఇచ్చేడు మాంత్రికుడు.

"పదికి ఇరవై ఇస్తే, వందకి రెండొందలివ్వాలి కదా? " అనడిగేడు ఆశ్చర్యంగా గుంపులో గోవిందయ్య ఒకడు.

"పది వేస్తే ఇరవై నోటిస్తుంది మంత్రకాళి. వందనోటిస్తే రెండొందల నోటు ఎలా వస్తుందండీ? వందనోటు తరువాత చెలామణిలో ఉన్నది ఐదొందల నోటే కదా!" అని సమాధానం వచ్చింది మూకలో ముకుందయ్య దగ్గర్నుంచి.

"ఓహో ఈ మంత్రం ఏదో బాగుందే! నేను కూడా ఓ వంద కాయితం ఇస్తే ఓ ఐదొందలొస్తాయి. నేను అప్పుకి మా అటెండర్ని కలవక్కరలేకుండా, మర్నాడే రికరింగ్ డిపాజిట్ వాయిదా కట్టేయొచ్చు- అనుకున్నాను.

"ఇంద వంద" అన్నాను మాంత్రికునితో.

అతను 'ఛూమంతర్‌కాళీ' అంటూ అయిదువందల కాయితం తీసిచ్చేడు. ఆ గుంపులో పదిమంది తలో వందా పందెం వేసేరు. తలొక ఐదొందల కాయితం మాంత్రికుడు ఇచ్చేడు.

మర్నాడు నా ఆర్‌డీ ఖాతాలో జమ చేద్దామని బ్యాంకుకి వెళ్లేను.

కాషియర్ ఆ నోటు అందుకుని పక్కనున్న మేనేజర్‌తో ఏదో గొణిగేడు. మేనేజర్ ఓ కొవ్వొత్తి, అగ్గిపెట్టె పట్టుకొచ్చి "సార్! ఈ నోటు నకిలీనోటు. దీన్ని వెంటనే కాల్చేయమంటారా? లేక పోలీస్ రిపోర్టిస్తే కటకటాల రుద్రయ్య అనే పేరు పొందుతారా?" అన్నాడు.

వందనోటిస్తే ఐదొందల నోటిస్తానన్నవాడు వెర్రివెంగళప్పా? లేక నేనా? బృహస్పతి పేరు గల నా బుద్ధి ఏమైంది?

నేను బిక్కచచ్చిపోయేను. ఈ పోలీసోళ్లతో తగవులెవరు పడతారు? నోటుని కాల్చేయమన్నాను.

మహేంద్రగిరి మీద తపస్సు చేస్తున్న పరశురాముడికి ప్రీతి అయింది! ©

# పునరావృతం



- గంగాధర్ వడ్లమన్నాటి

"కొత్త ఇల్లు ఎలా ఉందమ్మా" అడిగారు మూర్తిగారు.

"బావుంది డాడీ. కానీ నేను కాలేజికి వెళ్ళేప్పుడు రెండు రోజుల నుండీ ఎదురింటి అబ్బాయి నా వెంట పడుతున్నాడు. అదే ఇబ్బందిగా ఉంది" చెప్పింది అను.

దాంతో కోపంగా ఎదురింటికి బయల్దేరి వెళ్ళారు. కూరగాయలు కొంటున్న, ఆ అబ్బాయి వాళ్ళమ్మని తీక్షణంగా చూసి, వెనక్కి వచ్చేశారు. కారణం ఆమె మన మూర్తిగారి డిగ్రీ క్లాస్‌మేట్. పేరు లలిత. కాలేజీ రోజుల్లో ఆమె వెంటపడి ప్రేమించమనేవారు. ఓ రోజు ఆమె మూర్తిగారి చెంప పగలకొట్టింది. అదీ అందరి ముందూ. చాలా అవమానం అన్పించిందతనికి. మరి ఇంకెప్పుడూ ఆమె ముఖం కూడా చూడలేదు. కానీ మళ్ళీ ఇన్నాళ్ళకి ఇలా కన్పించిందామె.

మూర్తిగారు తిరిగి ఇంట్లోకి అడుగుపెట్టగానే, "డాడీ వాళ్ళమ్మగారితో చెప్పారా" అడిగిందామె ఆసక్తిగా.

"అదంతా వదిలేయమ్మా. ఈసారి వాడు నీవెంట పడితే చెంప పగలకొట్టు. ఇక నువ్వు ధైర్యంగా కాలేజీకి వెళ్ళు" చెప్పాడాయన.

ఆ సాయంత్రం ఎదురింటి లలిత వచ్చి మూర్తిగారి భార్య రమతో "మీ అమ్మాయి చూడండి. ఏదో పలకరిద్దామని వెనక వెళితే మా అబ్బాయిని చెప్పుతో కొట్టిందట. అదీ వాడి ఫ్రెండు ముందు. వాడు సిగ్గుతో మధ్యాహ్నం పూట కాలేజీకి కూడా వెళ్ళలేదు. ఏదైనా ఉంటే నోటితో చెప్పాలి కానీ ఇలా చేస్తారా" ఆమె ఇంకేదో అనేంతలో మూర్తిగారు అనుతో కల్సి వచ్చారు.

అంత కోపంగా వచ్చినామె, మూర్తిగారిని చూస్తూనే నిశ్శబ్దంగా వెనుదిరిగి వెళ్ళిపోయింది. ఎందుకో మూర్తిగారికి మాత్రమే అర్థమైంది. ఎక్కడో అహం శాంతించినట్టనిపించి చిరునవ్వు మెరిసిందాయన పెదవులపై. ©

# అదే నా సౌందర్య రహస్యం

'ఒకరికి ఒకరు' చిత్రంతో తెలుగు ప్రేక్షకులకు పరిచయమైన భామ ఆర్తీచాబ్రియా. తర్వాత 'ఇంట్లో శ్రీమతి వీధిలో కుమారి', 'గోపి' చిత్రాల్లో నటించింది. 'లజ్జా' సినిమాతో నటిగా ఈమె ప్రస్థానం మొదలైంది. హిందీ, కన్నడ చిత్రాల్లో నటిస్తూ ఆకట్టుకుంటోంది. నాయికగా ఎక్కువ కాలం కొనసాగాలంటే అందం, ఆరోగ్యం చాలా ముఖ్యమని ఆర్తీ నమ్మకం. దాని కోసం ఈ అమ్మడు ఏం చేస్తుందో చెప్పుకొచ్చిందిలా...

-ఆర్తీ చాబ్రియా

## ఎంత బిజీగా ఉన్నా...

రోజు విడిచి రోజు వ్యాయామం చేస్తాను. కనీసం 20 నిమిషాల పాటు కార్డియో ఎక్సర్‌సైజులకే సమయం కేటాయిస్తాను. అది కుదరకపోతే మంచి వేగంతో తాడు ఆట ఆడతాను. బరువులు ఎత్తడం అస్సలు మర్చిపోను. ఇది చివరిగా చేస్తాను. ఎంత బిజీగా ఉన్నాసరే వారంలో కనీసం నాలుగు రోజులైనా వ్యాయామం చేస్తేనే ఆరోగ్యం, చక్కని శరీరాకృతి మన సొంతమవుతాయి. పచ్చని ప్రకృతిని ఆస్వాదిస్తూ సాగించే నడక ఎంతో మేలుచేస్తుంది.



## అంతా మన మంచికే

ఆరోగ్యం అనేది మనచేతుల్లోనే ఎక్కువగా ఉంటుంది. శారీరక వ్యాయామాలే కాదు మానసిక ఉల్లాసం కూడా ఎంతో అవసరం. మంచి పుస్తకాలు చదువుతాను. కనీసం ఒక గంటైనా మనసారా నవ్వుకోగలగాలి. అందుకోసం వినోద కార్యక్రమాలు, స్నేహితులతో సరదా కబుర్లు ఇవన్నీ చేస్తుంటాను. ఏది జరిగినా మన మంచికే అనుకుంటాను. ప్రతి చిన్న విషయానికి ఆందోళన చెందను. మనసులో ఏ కొంచెం కలత ఉన్నా ముఖంలో స్పష్టంగా కనిపిస్తుంది. సుఖ నిద్ర అనేది కీలకమైన అంశం. పడుకునే ముందు ఎలాంటి ఆలోచనలు పెట్టుకోను. మనసును ప్రశాంతంగా ఉంచుకుంటాను.

## అది మర్చిపోను

ఉదయం లేవగానే నేను చేసే మొదటి పని రెండు గ్లాసుల వేడి నీళ్లు, కొద్దిగా కలబంద రసం తాగడం. దీంతోనే నా ఆహారపు దినచర్య మొదలవుతుంది. మొక్కజొన్న గింజలను పాలలో వేసుకుని తింటాను. తర్వాత ఓ కోడిగుడ్డు, ఏదో ఒక ఫలం లాగించేస్తాను. ఇది నా అల్పాహారం. మధ్యాహ్నం భోజనంలో పప్పు, ఉడికించిన కూరగాయ ముక్కలు, చపాతి, పెరుగు తీసుకుంటాను. రాత్రికి సూప్, చికెన్, సలాడ్‌లు తింటాను. సాయంకాలం సమయంలో గోధుమ రొట్టె తిని ఓ గ్లాసు పళ్లరసం తాగడం మాత్రం మర్చిపోను. ఈ విధంగా సరైన రీతిలో సమయానికి ఆహారం తీసుకోవడం ఉత్తమం.

## ప్రయోగాలు చేయను

నాకు దేవుడు చక్కని శరీర ఛాయను, పట్టులాంటి శిరోజాల్ని ఇచ్చాడు. వాటిని కాపడుకోవడం నామొదటి బాధ్యతగా భావిస్తాను. అందుకే అనవసరంగా మేకప్ వేసుకుని తిరగను. షూటింగ్ అయిపోగానే మేకప్ తీసేస్తాను. ఎప్పటికప్పుడు చల్లటి నీటితో ముఖాన్ని శుభ్రం చేసుకుంటాను. నా శరీరతత్వానికి సరిపోయే సౌందర్య ఉత్పత్తులు మాత్రమే వాడతాను. ఎవరో చెప్పినవి, ప్రకటనలు చూసి ప్రయోగాలు చేయను.

## ఉప్పు వద్దు

ఆహార పదార్థాల్లో ఉప్పు సాధ్యమైనంత వరకూ తగ్గిస్తాను. ఎందుకంటే దానివలన రక్తపోటు, గుండె సంబంధ వ్యాధులు ఎక్కువగా వస్తాయి. బేకరీ ఉత్పత్తులు, వేపుళ్లు, చిప్స్, పచ్చళ్ల జోలికి అస్సలు పోను. ఉప్పు అతిగా వాడితే ప్రమాదం అకస్మాత్తుగా ముంచుకొస్తుంది. ఉప్పులేకుండానే రుచిగా ఉండే ఆహార పదార్థాలను తయారు చేసుకోవడానికి ప్రయత్నించాలి. రోడ్లపక్కన బండ్లపై అమ్మే పదార్థాల్లో ఉప్పు ఎక్కువగా వాడతారు. అందుకే వాటి జోలికి వెళ్లను.

–సుధాకర్‌రెడ్డి మల్లిడి



గతనెల పజిల్ పూరించి, అన్నీ సరైన సమాధానాలు రాసినవారిలో డ్రా ద్వారా ఎంపికైన విజేత

**గురజాల వరలక్ష్మి**
'శ్రీరమణ దయాదీప్తి',
ఉచ్చిలి,
ఆత్రేయపురం మండలం,
తూర్పు గోదావరి జిల్లా
పిన్: 533 235

వీరికి రూ.150/- త్వరలోనే అందుతాయి.

## చతురంగం-2 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 వా | ల్మీ | కి | ★ | 2 అం | 3 దా | 4 ల | రా | 5 ము | 6 డు |
| లి | ★ | ★ | ★ | 7 గ | త | ము | ★ | 8 అ | య |
| ★ | 9 నీ | ★ | 10 వా | డి | ★ | 11 కా | 12 న | న | ము |
| 13 గా | లి | వా | న | ★ | ★ | ★ | 14 వ | ఘ | ★ |
| ధే | ★ | ★ | 15 ర | 16 సా | భా | 17 స | ★ | ★ | 18 పౌ |
| యు | ★ | 19 ల | ము | వా | ★ | ప్త | ★ | 20 క | రు |
| 21 డు | ము | వృ | ★ | స | ★ | ప | ★ | 22 వి | షం |
| ★ | ★ | డు | ★ | 23 ము | 24 వా | ది | 25 రా | త్ర | ★ |
| 26 స | 27 దా | ★ | 28 వ | ★ | న | ★ | 29 వ | య | 30 సు |
| 31 భా | ర | తీ | యు | డు | ★ | 32 డ్డా | ణ | ము | వ |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. గుండాన జోగారావు, సింహాచలం,
2. కె. రఘుపతి, సికింద్రాబాద్
3. పెయ్యేటి సీతామహాలక్ష్మి, తిరుపతి
4. పిశుపాటి దాక్షాయణి, హైదరాబాద్
5. యన్.సురేఖ, హోసూర్, తమిళనాడు
6. వానపల్లి గంగరాజు, విశాఖపట్నం
7. వి.వి.సత్యనారాయణశెట్టి, తిరుపతి
8. టి.వి.డి.యన్. సీతారామారావు, విజయవాడ
9. ఏ. కోటేశ్వరరావు, హైదరాబాద్
10. బోడపాటి కృష్ణవేణి, చెన్నై
11. ఆలూరి పార్థసారథి, చెన్నై
12. టి.పరమేశ్వరి, నెల్లూరు
13. బి.నిర్మల్ రావు, బరంపురం, ఒడిషా
14. మద్దాని నాగసాయి పరీక్షిత్తు, హైదరాబాద్
15. టి.ఆర్.బాలకృష్ణారావు, రాజమండ్రి.
16. వి.సీతానరసింహారావు, విజయవాడ
17. పప్పు శ్రీదేవి, అమలాపురం
18. పప్పు కామేశ్వరరావు, అమలాపురం
19. అయ్యగారి శ్రీనివాసరావు, విజయనగరం
20. నల్లపనేని కోటేశ్వరరావు, తోపుగుంట, నెల్లూరు జిల్లా
21. పాలెపు బుచ్చిరాజు, వడోదర, గుజరాత్
22. జి.సి.శంకరరావు, హైదరాబాద్
23. యన్.జగన్మోహనరావు, కరీంనగర్.
24. జె.ఇందిర, హైదరాబాద్
25. యస్.అబ్దుల్ అజీజ్, పెద్దమందడి, మహబూబ్ నగర్ జిల్లా
26. వేమూరి విశాలాక్షి, గుంటూరు
27. యన్.విజయలక్ష్మి, ఒంగోలు
28. రామకూరు నాగేశ్వరరావు, శ్రీకాకుళం
29. ఎ.వెంకటరమణ, విజయనగరం

# చతురంగం - 3 ఆధారాలు

**అడ్డం**

1. రంగనాయకమ్మ విషవృక్షానికి ఖండన రాసిన రచయిత్రి (2)
2. సినారె తొలిదశ గేయకావ్యాల్లో ఒకటి, ఒక ప్రాజెక్టు (7)
7. పైనాపిల్ తెలుగులో (3)
8. దేవుడికి చేసేది గందరగోళం (4)
10. 'జగదేకవీరుడి కథ'లో నాయిక సంబోధన (2)
11. త్యాగయ్య ఇది చాలా సుఖమా? అని ప్రశ్నించాడు (2)
12. విహరించేవాడు. ఈ కలం పేరుతో ఓ రచయిత (3)
14. యండమూరి తులసీ దళానికి పేరడీగా వచ్చిన నవల (5)
15. 'తాతాజీ' ఇంటి పేరు (2)
16. పూలమాల (2)
17. వెయ్యిమైళ్ల ప్రయాణమైనా మొదటి....తోనే ప్రారంభం (3)
19. వేడిపాల మీది తెట్టు.. తడబడింది (3)
20. ఈ రోజు అటు నుంచి (2)
21. గందరగోళం లేకుండా నిలువు 15, కృష్ణంరాజు, జయప్రదల సినిమా (5)
23. గజేంద్రుడ్ని పట్టింది తడబడింది (3)
25. చంద్రగుప్తుడి తల్లి (2)
26. తోకతెగిన అర్జునుడు (3)
28. మనందరం ఈ రాజ్యం కోరుకుంటాం (5)
29. బంతే.. గజిబిజి (4)

**నిలువు**

1. కొత్తగా వస్తున్న 'తనికెళ్ళ' తనయుడి సినిమా పేరు, కొరికితే చురుక్కు (3)
2. 'పచ్చనాకు సాక్షిగా' రచయిత ఇంటిపేరు (3)
3. క్రీడాకారులకు ఇచ్చే అవార్డు గజిబిజి 3)
4. 'న' గుణింతం మొదలు (2)
5. 'స' గుణింతం కిందనుంచి మొదలు (2)
6. వర్మ, ఊర్మిళల సినిమా (3)
8. పెరుగు (2)
9. విశ్వనాథవారి బృహన్నల (6)
10. విష్ణువు (2)
12. తలకిందులుగా కోన (3)
13. గాథాసప్తశతి కర్త (3)
14. ఏనుగు (4)
15. గందరగోళమైన ఆదర్శదంపతులు (5)
18. తడబడుతున్న భర్త (3)
19. కృష్ణభక్తురాలు (2)
22. భాజపా గుర్తు చిందరవందర (3)
23. సరిగా, చక్కగా (3)
24. తలకిందైన స్వర్ణకారుడు (3)
27. కోతికి ఉండేది (2)

## నిబంధనలు

1. పక్క పేజీలోని చతురంగాన్ని అదేపేజీలో పూర్తిచేసి పంపాలి.
2. తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు.
3. గడువు తేదీ దాటిన తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు.
4. ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి ఒక విజేతను ఎంపిక చేస్తాం.
5. ఒక్కొకరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు
6. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం**

చతుర, ఈనాడు కాంపౌండ్,

సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు

★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 3

రూ.150/- బహుమతి

గడువు తేది : ఈనెల 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | | 3 | 4 | 5 | | 6 |
| | | | | | 7 | | | | |
| | | 8 | | 9 | | | | 10 హ | |
| | 11 | | | | | 12 | 13 | | |
| | | | 14 వే | | | | | | |
| 15 తా | | | 16 | | | 17 | | 18 | |
| | | 19 | | | | | | 20 | |
| 21 | 22 | | | | | 23 | 24 | | |
| 25 | | | | | 26 స | | | | 27 |
| 28 | | | | | | 29 | | | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------------

----------------------------------------

---------------- పిన్ : ------------ ఫోన్ : ----------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

